Islami Tahjeeb ke
Chand Daraksha Pahlu
(Telugu)

# ఇస్లామ్ సంస్కృతీ సౌరభాలు

రచయిత :

డాక్టర్ ముస్తఫా సబాయి

అనువాదం :

అబ్దుర్రహ్మాన్ సాబిర్

# విషయసూచిక

**ఈ పుస్తకం** ..... 09
పాశ్చాత్య సంస్కృతి ..... 10
పతనమవుతున్న ధర్మం ..... 11
వాస్తవాల స్పృహ ..... 16
ఇస్లామ్ నేటి అవసరం ..... 18
సాంస్కృతిక భవిష్యత్తు ..... 22
ప్రచురణ ఉద్దేశ్యం ..... 25
నేను ప్రారంభించాను...మీరు ముగించండి ..... 26

**మానవ మైత్రి** ..... 27
ఇస్లామీయ సమానత్వం ..... 29
ఈ ప్రకటనలన్నీ బూటకాలేనా? ..... 30
ఒకటవ నిదర్శనం ..... 31
రెండవ నిదర్శనం ..... 31
మూడవ నిదర్శనం ..... 32
నాలుగవ నిదర్శనం ..... 32
అయిదవ నిదర్శనం ..... 33
ఆరవ నిదర్శనం ..... 34
ఏడవ నిదర్శనం ..... 34
ఎనిమిదవ నిదర్శనం ..... 35
తొమ్మిదవ నిదర్శనం ..... 35
అనుపమానమయిన ఆదర్శం ..... 36
పదవ నిదర్శనం ..... 37
పదకొండవ నిదర్శనం ..... 39
వీటికి సరితూగే సంఘటనలున్నాయా? ..... 40
ఎందరెందరో! ..... 41

| | | |
|---|---|---|
| సమానత్వం | ..... | 42 |
| కేవలం మాటల్లోనే కాదు | ..... | 42 |
| మరో నిదర్శనం | ..... | 44 |
| ఇదొక్కటే కాదు | ..... | 45 |
| రెండవ నిదర్శనం | ..... | 45 |
| సమానత్వం | ..... | 46 |
| వర్ణ విచక్షణ లేదు | ..... | 46 |
| ప్రగతిశీల ప్రపంచం | ..... | 47 |
| అద్దంలో చూడండి | ..... | 48 |
| అమెరికా కూడా అంతే | ..... | 49 |
| నిలువెల్ల మచ్చలే! | ..... | 50 |
| కేవలం తలబిరుసుతనం | ..... | 51 |
| మరో రెండు నిదర్శనాలు | ..... | 53 |
| భయానక సంఘటన | ..... | 54 |
| మచ్చుతునక | ..... | 55 |
| మత సహనం | ..... | 56 |
| మత సహనానికి మౌలిక సూత్రాలు | ..... | 56 |
| ప్రవక్త (సఅసం) కాలంలో... | ..... | 60 |
| శ్రేయస్కర ఖలీఫాల కాలంలో ... | ..... | 61 |
| సుల్తాన్ ముహమ్మద్ విశాల హృదయం | ..... | 63 |
| ఇతర మతాల్లో జోక్యం లేదు | ..... | 64 |
| యోహాన్ చర్చ్ దృశ్యం | ..... | 64 |
| మత విచక్షణ లేకుండా పదవులు | ..... | 65 |
| బనూ అబ్బాస్ కాలంలో | ..... | 66 |
| ముస్లిమేతర సాహిత్యవేత్తలు | ..... | 67 |
| ముస్లిమేతరుల పట్ల అధికారుల ప్రవర్తన | ..... | 67 |
| జ్ఞాన వేదికలు | ..... | 68 |

| | | |
|---|---|---|
| సాధారణ సభలు | ..... | 69 |
| కుటుంబ వాతావరణం | ..... | 70 |
| పాశ్చాత్య పరిశోధకుల ఆరోపణలు | ..... | 70 |
| ముస్లిమేతరుల ఉత్సవాల్లో పాల్గొనడం | ..... | 71 |
| అద్భుత సహనం | ..... | 72 |
| ఆర్నాల్డు సాక్ష్యం | ..... | 74 |
| సుదీర్ఘమైన చర్చకు కారణం | ..... | 75 |
| తప్పులెన్నువారు తమ తప్పులెరుగరు | ..... | 75 |
| పాశ్చాత్యుల మత దురభిమానం | ..... | 75 |
| తుది సాక్ష్యం | ..... | 76 |
| లీబాన్ న్యాయ ప్రియత్వం | ..... | 77 |
| ఇస్లామీయ సంస్కృతీ శుభాలు | ..... | 78 |
| యుద్ధనీతి | ..... | 79 |
| ఆయుధశక్తి సమకూర్చుకోవడం దేనికి? | ..... | 79 |
| యుద్ధలక్ష్యాలు | ..... | 80 |
| మరో మహోజ్వల అంశం | ..... | 81 |
| యుద్ధం ఎవరితో? ఎంతవరకు? | ..... | 81 |
| యుద్ధం గురించి కొన్ని హితవులు | ..... | 83 |
| మాటలే కాదు, చేతలు కూడా | ..... | 84 |
| ప్రవక్త (సఅసం) కాలం నాటి నిదర్శనాలు | ..... | 84 |
| శ్రేయస్కర ఖలీఫాల ప్రవర్తనా సరళి | ..... | 87 |
| గవర్నర్ తన నిర్ణయాన్ని మార్చుకోవాల్సి వచ్చింది | ..... | 88 |
| పాశ్చాత్యుల వైఖరి | ..... | 89 |
| ఇలాంటి ఆదర్శం ఏ సంస్కృతిలోనైనా ఉందా? | ..... | 89 |
| వాగ్దాన పాలన | ..... | 90 |
| ఇబ్నె తైమియా ఔదార్యం | ..... | 91 |
| మేలు మరచిన క్రైస్తవులు | ..... | 91 |

| | | |
|---|---|---|
| సలాహుద్దీన్ అయ్యూబి | ..... | 93 |
| సుల్తాన్ ముహమ్మద్ ఔన్నత్యం | ..... | 95 |
| ఉస్మానీ పాలకుల ప్రవర్తన | ..... | 96 |
| ఐరోపా క్రైస్తవ పాలకులు | ..... | 97 |
| మరికొన్ని అమానుష కృత్యాలు | ..... | 98 |
| ఒప్పందం ఉల్లంఘన | ..... | 99 |
| అమానుష నైజాన్ని మార్చేదెవరు? | ..... | 99 |
| ఇక నాగరిక ప్రపంచంలో | ..... | 101 |
| భూతదయ | ..... | 102 |
| జంతులోకం కూడా ఓ జగత్తే! | ..... | 103 |
| రక్ష, శిక్ష | ..... | 103 |
| నిషేధించబడిన విషయాలు | ..... | 105 |
| అపురూప బోధనలు | ..... | 106 |
| ఆ ప్రయాణంలోని ఇంకో సంఘటన | ..... | 106 |
| కొన్ని ఫిఖ్హ్ ఆజ్ఞలు | ..... | 107 |
| సద్వర్తనకు మరికొన్ని నిదర్శనాలు | ..... | 108 |
| ఇస్లామీయ ప్రభుత్వ బాధ్యతలు | ..... | 108 |
| జంతు రక్షణ సంస్థలు | ..... | 109 |
| అనన్యమయిన నిదర్శనం | ..... | 110 |
| ప్రాచీన కాలంలో ప్రజల వైఖరి | ..... | 110 |
| యూదుల ధర్మశాస్త్రంలోని కొన్ని నియమాలు | ..... | 111 |
| ప్రాచీన గ్రీక్‌లో | ..... | 111 |
| పూర్వపు రోమన్ల శాసనం | ..... | 112 |
| పూర్వపు పర్షియాలో | ..... | 113 |
| ఐరోపా జాతుల దృక్పథం | ..... | 113 |
| మరికొన్ని వింత శిక్షలు | ..... | 114 |
| ఇంకొన్ని కేసుల వివరాలు | ..... | 114 |

తుది మాట ..... 117
ప్రజా సంక్షేమ సంస్థలు ..... 117
ఆ మహోన్నత స్థానం ఎవరికి ప్రాప్తమయింది? ..... 118
మరో అంశం ..... 119
సంక్షేమం, మౌలిక దృక్పథం ..... 119
ఫలితాలు, ప్రభావాలు ..... 121
ఇస్లాంలో ప్రప్రథమ వక్ఫ్ ఆస్తి ..... 122
అపార వఖ్ఫ్ ఆస్తులు ..... 122
రెండు రకాల వఖ్ఫ్ ఆస్తులు ..... 123
కొన్ని సంక్షేమ సంస్థలు ..... 123

**విద్యా సంస్థలు** ..... 128
ఇస్లామీయ పాఠశాలలు ..... 128
బోధనశాలలు ..... 128
ఆదర్శ విద్యాసంస్థ ..... 129
అధ్యాపకుల స్థితిగతులు ..... 131
బోధనా బాధ్యతల్ని నిర్వహించేవారు ..... 132
అధ్యాపకుల దుస్తులు ..... 133
అధ్యాపక సంఘం ..... 134
కొన్ని ప్రఖ్యాత పాఠశాలలు, వాటి వ్యవస్థాపకులు ..... 135
పాఠశాలల వఖ్ఫ్ ఆస్తులు ..... 137
వివిధ విద్యా కళలకై ప్రత్యేక పాఠశాలలు ..... 138
ఆనాటి ఐరోపా పరిస్థితి ..... 138
అరబ్బులు అంధకార యుగంలో కూడా .... ..... 140

**ప్రప్రథమ ఆస్పత్రి** ..... 141
రెండు రకాల ఆస్పత్రులు ..... 141
విభిన్న రకాల ఆస్పత్రులు ..... 142
ప్రాథమిక వైద్య కేంద్రాలు ..... 142

సాధారణ ఆస్పత్రులు ..... 143
యోగ్యతా పత్రం పొందిన విద్యార్థులకే చికిత్స .... ..... 144
ఉచిత చికిత్సాలయాలు ..... 145
నూరీ ఆస్పత్రి, డెమాస్కస్ ..... 146
మన్సూరీ ఆస్పత్రి వఖ్ఫ్ నామా ..... 148
మొరాకో ఆసుపత్రి ..... 150
వైద్య సంస్థలు ..... 151

**గ్రంథాలయాలు** ..... 153
పుస్తకాల పట్ల ఆసక్తి ..... 154
గ్రంథాలు భద్రంగా ఉంటే చాలు ..... 156
పుస్తక సేకరణ ..... 156
గ్రంథాలయాల స్థాపన ..... 157
కైరోలోని విజ్ఞాన మందిరం ..... 159
బగ్దాద్‌లోని బైతుల్ హిక్మత్ ..... 160
స్పెయిన్‌లోని హకం గ్రంథాలయం ..... 160
బనీ అమ్మార్ గ్రంథాలయం టెబ్లస్ ..... 161
స్వంత గ్రంథాలయాలు ..... 161
గ్రంథాలయాల పట్ల విరోధుల వైఖరి ..... 163
ఒప్పుకోలు ..... 165
విభిన్న సభలు, వేదికలు ..... 165
అబ్బాసీల కాలంలో ..... 168
సదనాలు ..... 170
విద్వాంసుల సభలు ..... 171
పుస్తక వ్యాపారులు ..... 173




# ఈ పుస్తకం

భౌతిక ప్రగతి, వైజ్ఞానిక ఆవిష్కరణల దృష్ట్యా చూస్తే ప్రస్తుత కాలం గత కాలాలన్నింటికన్నా ఎంతో ప్రగతి సాధించింది. కాని సమాజంలో మానసిక రుగ్మతలు పెరగడాన్ని చూసి మానసిక నిపుణులు, వైద్యనిపుణులు సామాజిక శాస్త్రవేత్తలు నిర్ఘాంతపోయి చూస్తున్నారు. నిజానికి ఎటు చూసినా భయాందోళనల వాతావరణం అలుముకుని ఉంది. యావత్తు మానవాళి భవిష్యత్తు చీకటిలో కూరుకుపోతుందా అనిపిస్తోంది. ఆలోచించవలసిన విషయమేమంటే, ఈ ఆధునిక నాగరికత ప్రమాణాలు, సదుపాయాలు, సౌలభ్యాలు, సుఖవిలాసాల సామగ్రి వగైరాలన్నీ అందుబాటులో ఉన్నప్పటికీ ఎవరికీ ఆనంద సంతోషాలు లభించడం లేదు. పందొమ్మిదవ శతాబ్దానికి చెందిన మేధావులు, శాస్త్రవేత్తలు సాధించిన వైజ్ఞానిక ఆవిష్కరణలు ఒక శ్రేయస్కర యుగానికి నాంది పలుకుతాయన్న కల కలగానే మిగిలిపోయింది.

సాధన సామగ్రిలో ప్రగతి వికాసాలు ఎంతగా సాధించామో అంతగా ఆందోళన అలజడులు కూడా ఎక్కువయ్యాయి. జీవన ప్రమాణాలు అత్యున్నత స్థాయిలో ఉన్న దేశాల్లో ఇతర దేశాలతో పోల్చితే మానసిక రుగ్మతలు కూడా ఎక్కువయ్యాయి. స్వయంగా అమెరికా ప్రభుత్వం ప్రకటించిన లెక్కలే దీనికి సాక్ష్యమిస్తున్నాయి. ఈ ఆందోళన అలజడులనేవి రెండు ప్రపంచయుద్ధాల ఫలితంగానో లేక మూడవ ప్రపంచ యుద్ధం రావచ్చున్న భయం వల్లనో జనించినవి కావు. ఇవి ఆధునిక సంస్కృతీ నాగరికతల కారణంగా జనించినవే. సామ్రాజ్యవాద శక్తులు తమ అధీనంలో ఉన్న జాతులు భయాందోళనల్లో జీవించే పరిస్థితిని సృష్టించాయి. కాని మనం ప్రస్తావిస్తున్న, సమాజంలో సర్వసాధారణంగా కనబడుతున్న ఆందోళన విభిన్నమైనది. ఈ కలతలు, అలజడులు సామ్రాజ్యవాదంతో ఇతర దేశాలపై పెత్తనం చెలాయిస్తున్న దేశాల్లోను, సామ్రాజ్యవాద ప్రభావానికి దూరంగా ఉన్న దేశాల్లోను అన్ని చోట్లా కనబడుతుంది. ఆధునిక సామాజిక సిద్ధాంతాల పునాదులపై నిలబడిన ప్రతి ఒక్క సమాజంలోను ఈ ఆందోళనా అలజడుల వాతావరణాన్ని మనం చూస్తున్నాం. ప్రాచ్య పాశ్చాత్య దేశాలన్నింటా మనకు ఈ ఆందోళన కనబడుతుంది. మాజీ సోవియట్ యూనియన్ వ్యవస్థలో కూడా ఈ ఆందోళన అలజడులే అవధులు దాటాయి. చివరకు సోవియట్ కుప్పకూలింది.

సమాజంలోని ఈ పరిస్థితికి అద్దం పట్టే సంఘటనలు తరచు చోటు చేసుకుంటున్న ఆత్మహత్యలు. ఆధునిక నాగరికత వెల్లివిరుస్తున్న దేశాల్లో ఆత్మహత్యలు కూడా అధికమవుతున్నాయి. ఆధునిక నాగరికతకు పెద్దపీట వేసిన నార్వే, స్వీడన్, డెన్మార్క్ లాంటి దేశాల్లో ఆత్మహత్యలు కూడా ఎక్కువే. సుఖభోగాల జీవితం ఉన్నప్పటికీ జీవితం పట్ల విసిగి వేసారి ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. ఈ పరిస్థితికి కారణం ఆధునిక నాగరికతలో వేళ్ళూనుకున్న భావాలు, సిద్ధాంతాలలోనే ఉంది.

## 2. పాశ్చాత్య సంస్కృతి

పాశ్చాత్య సంస్కృతి ఎలా రూపుదిద్దుకుందన్నది గమనిస్తే, ఇస్లామీయ సంస్కృతి, ఇస్లామీయ సంస్కృతికి చెందిన అరబ్బు కేంద్రాలతో పాశ్చాత్యుల సాన్నిహిత్యం వల్ల ఉనికిలోకి వచ్చింది. స్పెయిన్ తదితర దేశాలు ఒకప్పుడు ఇస్లామీయ సంస్కృతికి కేంద్రాలుగా ఉండేవి. ఇస్లామీయ తత్వవేత్తలు గ్రీకు తత్వశాస్త్రం పట్ల చాలా ఆసక్తి చూపించారు. ఆ విధంగా అరబ్బుల ద్వారా పాశ్చాత్య విద్యార్థులకు గ్రీకు తత్వశాస్త్రం పరిచయమైంది. గ్రీకు గ్రంథాలను తమ భాషలోకి అనువదించారు. చర్చి తీవ్రంగా వ్యతిరేకించినప్పటికీ దీని అధ్యయనం కొనసాగింది. తర్వాత పాశ్చాత్య ఆలోచనా విధానంలో విప్లవాత్మకమైన మార్పులు వచ్చిన తర్వాత చర్చి విశ్వాసాలకు, ఆలోచ నలకు విభిన్నమైన వాస్తవాలను కూడా స్వీకరించడం ప్రారంభించారు. ఫలితంగా చర్చికి, విజ్ఞానశాస్త్రానికి మధ్య ఒక సుదీర్ఘ సంఘర్షణా వాతావరణం నెలకొంది. తత్వవేత్తలు, మేధావులను జైళ్ళలో బంధించడం జరిగింది. వారిపై దౌర్జన్యాల పర్వతాలు విరుచుకుపడ్డాయి. సుదీర్ఘ పోరాటాలు, సంఘర్షణల తర్వాత కాని తాత్వికులకు, మేధావులకు స్వేచ్ఛ లభించలేదు. పాశ్చాత్య పునరుజ్జీవన ఉద్యమం తన కాళ్ళపై నిలబడినప్పుడు దానిపై రెండు ప్రభావాలు స్పష్టంగా కనబడతాయి. ఒకటి గ్రీకు తత్వశాస్త్రం నుంచి గ్రహించిన ప్రేమభావన. ఇది కేవలం భౌతికవాద ఆలోచనలతో, విగ్రహారాధక విధానాలతో ఉనికిలోకి వచ్చిన భావన. రెండవ ప్రభావం ధర్మం పట్ల చికాకు. మతపెద్దల పట్ల వ్యతిరేకత, తిరుగుబాటు వైఖరి. ఈ రెండు ప్రభావాల ఫలితంగా పాశ్చాత్య మేధావుల భావాలు, ఆలోచనలు పద్దెనిమిదవ, పందొమ్మిదవ శతాబ్దాలలో రూపుదిద్దుకున్నాయి. ఈ ప్రభావాల నేపథ్యంలోనే పాశ్చాత్య దృక్పథాలు, నైతిక ప్రమాణాలు ఉనికిలోకి వచ్చాయి. నేడు కూడా ఈ ప్రభావాలు పాశ్చాత్య ఆలోచనలపై చెక్కుచెదరకుండా కొనసాగుతున్నాయి.

పాశ్చాత్య సంస్కృతి నిలబడి ఉన్న ఈ పునాదులు పూర్తిగా భౌతికవాదం ప్రధానమైనవి. ధార్మిక ఆధ్యాత్మిక చింతనకు ఇందులో అవకాశమే లేదు. అందువల్లనే పాశ్చాత్య వ్యవస్థలో మతప్రమేయం, ధార్మిక ప్రభావాలు అడుగంటాయి. నేడు పాశ్చాత్య ప్రజలు అధోపాతాళానికి పతనమవుతున్న స్వంత ఉనికిని చూసి తీవ్ర ఆందోళనకు గురవుతున్నారు. అక్కడ మేధావులు, ఆలోచనాపరులు ధార్మిక భావాలను మళ్ళీ ప్రోత్సహించాలన్న ఆలోచనల్లో ఉన్నారు. కాని ఇప్పుడవి ఎక్కడ లభిస్తాయి. భౌతిక వాదం, సుఖవిలాసాల విషబీజాలు నాటిన మహావృక్షం ఇప్పుడు చేదు ఫలాలను ప్రసాదిస్తోంది. ఈ వృక్షం వేళ్ళు లోలోతుల్లోకి నాటుకుపోయాయి.

గ్రంథ ప్రజలకు సంబంధించిన ఏ ధర్మాన్ని తీసుకున్నా గాని, మానవ సమాజాల్లో న్యాయాన్ని ప్రోత్సహించే ప్రత్యేకత మనకు ఖచ్చితంగా కనబడుతుంది. మనిషి ఆత్మకు, మనస్సుకు శాంతిని ప్రసాదిస్తుంది. హేయమైన భావావేశాలను నిర్మూలిస్తుంది. ఇస్లామ్ ప్రారంభకాలంలోనే ఈ పనిని జయప్రదంగా చేసి చూపించింది. కాని మన సామాజిక జీవితంలో ఇస్లామీయ విలువలు ఆచరణలో శూన్యమైనప్పుడు, వ్యక్తిగత, సామూహిక జీవితాల్లో నైతిక ప్రేరణలు, సంకల్పాలను, త్యాగం, మంచితనాల భావాలను పెంపొందించే భావాలు మసకబారినప్పుడు మనకు కూడా పాశ్చాత్య సంస్కృతి తన వారికి ప్రసాదించిన విషసంస్కృతి ఫలాలను చవిచూడవలసి వచ్చింది.

## 3 పతనమవుతున్న ధర్మం

పాశ్చాత్య సంస్కృతికి అక్కడి ధర్మానికి మధ్య సంతులనం సాధించడం మన లక్ష్యం కాదు. ఈ పని చేయడానికి ప్రారంభంలో అక్కడ జరిగిన ప్రయత్నాలేవీ ఫలించలేదు. ఈ సంస్కృతి విషఫలాలను మనం తెలుసుకుంటే చాలు. దీనికి కారణాలను గ్రహిస్తే చాలు. ఈ సంస్కృతి మనిషికి ప్రశాంతతను, మానసిక శాంతిని ప్రసాదించడంలో తీవ్రంగా విఫలమైందని అవగాహన చేసుకుంటే చాలు. దీనికి కారణమేమంటే, ఈ సంస్కృతి మతాన్ని, ధర్మాన్ని వదిలి ప్రత్యేక బాటన నడక మొదలు పెట్టినప్పుడు, అప్పుడు సమాజంలో ప్రబలంగా ఉన్న మత భావాలతో యుద్ధం చేయవలసి వచ్చినప్పుడు ఈ సంస్కృతి మరో ధర్మం వైపు చూసే బదులు స్వతంత్రంగానే ముందుకు సాగాలని నిర్ణయించుకుంది. ఇలా వ్యవహరించినప్పుడే ఈ ఉద్యమస్ఫూర్తి తాజాగా ఉంటుందని భావించారు. కాని ఇదంతా ఒక భ్రమగా

తేలిపోయింది. నేడు పాశ్చాత్య దేశాలు వివిధ ప్రభుత్వాలు, చర్చిల మధ్య ఆధునిక సంస్కృతి సృష్టించిన విభేదాలు, వినాశాలను తగ్గించడానికి పరస్పర సహాయసహకారాల భావనలను ప్రోత్సహించడం మనం చూస్తున్నాం. నేను వెళ్ళిన ప్రతి పాశ్చాత్య దేశంలోను ఈ పరిస్థితిని చూశాను. అనేక పద్ధతులు, మార్గాలు, వనరులతో ఈ ప్రయత్నాలు జరుగుతున్నాయి.

సోవియట్ యూనియన్ పతనం కాక ముందు, కమ్యునిస్టు వ్యవస్థ ప్రబలంగా ఉన్న సోవియట్‌లోను ఇలాంటి దృశ్యాలు మనకు కనబడేవి. ప్రతి ఆదివారం "ముక్తి సైన్యం" మాదిరిగానే బ్యాండుమేళంతో ఒక ఊరేగింపు ప్రతి పార్కు బహిరంగ ప్రదేశంలో కనబడేది. ఈ ధార్మిక ఊరేగింపును చర్చి ఏర్పాటు చేసేది. యువకులు, వృద్ధులు, పిల్లలు, బాలికలు ఈ ఊరేగింపుల్లో ఉండేవారు. చర్చి పాటలను వాయిద్యాలతో సహా పాడుతూ ప్రజలకు ధార్మిక భావాల దిశగా పిలవడం జరిగేది. ఈ పాటల వల్ల జనం పోగయ్యేవారు. వారి మాటలను శ్రద్ధగా వినేవారు. అలాగే లండన్ లోని హైడ్ పార్కులోను మనకు ఇలాంటి దృశ్యాలు కనబడతాయి. ముఖ్యంగా ఆదివారం రోజున అక్కడ స్వేచ్ఛగా ప్రసంగాలు జరుగుతాయి. ఈ ప్రసంగీకుల్లో చర్చికి చెందినవారే ఎక్కువ. వాగ్ధాటితో, ప్రసంగ పటిమతో పార్కులో హాజరైన జనాన్ని తమవైపు తిప్పుకోవాలని ప్రయత్నించడమూ మనం చూడవచ్చు. అదేవిధంగా సినిమా థియేటర్ల వద్ద జనసమూహం కిటకిటలాడుతున్నప్పటికీ అక్కడ కూడా ఎవరో ఒకరు ఏదో ఒక చిన్న తాత్కాలిక వేదికపైకి ఎక్కి ప్రజలకు బోధించడం, ధర్మం గురించి చెప్పడం లాంటి దృశ్యాలు చూడవచ్చు. ఒక రాత్రి ఒక వ్యక్తి సినిమా థియేటర్ గేటు వద్ద నిలబడి ప్రసంగించడం నేను చూశాను. ఆ వ్యక్తి గట్టిగా సినిమా వల్ల వాటిల్లే నష్టాలను ఏకరువు పెడుతున్నాడు. ఇదంతా పోలీసుల సమక్షం లోనే జరుగుతోంది. పోలీసు కూడా అందులో జోక్యం చేసుకోవడం నేను చూడలేదు. కొందరు పోలీసులు కూడా ఆ మాటలను శ్రద్ధగా వినేవారు. కాని ఈ ప్రసంగాలను విని ప్రభావితుడై సినిమా చూడ్డానికి వచ్చి చూడకుండా వెనుదిరిగిన ఒక్క వ్యక్తిని కూడా నేను చూడలేదు.

అమెరికా యూరప్‌లలో సాధారణంగా ప్రతి చర్చితో పాటు ఒక సంస్థ కూడా ఉంటుంది. అక్కడ యువతీయువకులు ఆటపాటలు, వినోద కార్యక్రమాలు నిర్వహిస్తుంటారు. వారంతా ఒక బృందంగా ప్రయాణాలు చేస్తారు. సభలు సమావేశాలు

నిర్వహిస్తారు. అలాంటి ఒక సంస్థలో నేను కూడా పాల్గొన్నాను. ఆటపాటలు, తినడం తాగడం, రాత్రిళ్ళ జాగారం తప్ప మరో పని ఏదీ అక్కడ నాకు కనబడలేదు. ఈ కార్యక్రమాల నిర్వాహకుడితో నేను "ఈ కార్యక్రమాల్లో పాల్గొన్న వారి ముందు మీరు ప్రసంగించడం, ధార్మిక విషయాలు బోధించడం కూడా చేస్తారా" అని అడిగాను. ఆయన అలాంటిదేమీ ఉండదన్నాడు. మరి చర్చి ఈ కార్యక్రమాలను ఎందుకు ఏర్పాటు చేస్తుంది? ఎందుకు ఖర్చులు భరిస్తోంది? నిజానికి ఈ సంస్థల ఏర్పాటు అన్నది ఇలాంటి అనేక సంస్థల పరంపరలో ఒక భాగం. దీనికి చర్చికి ఎలాంటి సంబంధమూ లేదు. చర్చికి అనుబంధంగా ఈ సంస్థ కొనసాగుతూ ఉంటుంది. దీనివల్ల లాభమేమిటని అడిగితే ఆ నిర్వాహకుడు, "ఈ సంస్థలోకి రావడానికి యువతీ యువకులు చర్చి ఆవరణ నుంచి వస్తారు, ఇది చాలదా? ఆ విధంగా చర్చిని కూడా గుర్తుంచుకుంటారు" అన్నాడు. యూరప్ లోని హోటళ్ళలో గదిలోని మంచం పక్కన ఒక బైబిలు గ్రంథం ఉంటుంది. దీన్ని బైబిల్ ప్రేమికుల సంఘం ఏర్పాటు చేస్తోంది. దీని ఉద్దేశ్యమేమంటే గదిలో బస చేసిన వారు పడుకునే ముందు, లేచిన తర్వాత బైబిలు గ్రంథాన్ని చదివి తమ ధార్మిక చైతన్యాన్ని పెంచుకోవాలన్నది. యూరప్‌లోని చాలా విశ్వవిద్యాలయాల్లో క్రిస్టియన్ యువసంఘాలు పని చేస్తుంటాయి. ఈ సంఘాల వారాంతపు సమావేశాల్లో చర్చి ఫాదర్లు ప్రసంగిస్తారు. క్రయిస్తవ మత నియమాలను విలువలను తెలియజేస్తారు. విద్యార్థులు కూడా ఈ చర్చల్లో పాల్గొంటారు.

పశ్చిమ జర్మనీలో ప్రభుత్వం ప్రత్యేక చర్చి నిధిని వసూలు చేసేది. క్రయిస్తవ ప్రచారానికి ఈ నిధి ఉపయోగించేవారు. ఒకసారి నేను జర్మనీలోని కొలన్ యూని వర్శిటీ ఆసుపత్రిలో ఉన్నాను. నా వార్డులో పడకకు ఎదురుగా గోడపై పెద్ద శిలువ బొమ్మ ఉంది. ఆ ఆసుపత్రిలో ప్రతి గదిలోను అలాంటి బొమ్మలుండడాన్ని తర్వాత గమనించాను. చివరకు డాక్టర్ల గదుల్లోను, ఆఫీసుల్లోను కూడా ఉన్నాయి. ఆ శిలువ బొమ్మలను ఎందుకుంచారని అడిగితే, చర్చి కార్యకలాపాల్లో ఇది కూడా ఒక భాగమని తెలిసింది. ఇలా శిలువ బొమ్మలను ఉంచడం వల్ల ప్రజల మనోమస్తిష్కాల్లో ధర్మం సజీవంగా ఉండడానికి తోడ్పడుతుందన్నది వారి ఆలోచన. ఆ ఆసుపత్రి యూనివర్శిటీ క్రింద పని చేస్తున్న ఆసుపత్రి అయినప్పటికీ, చర్చితో ఎలాంటి సంబంధం లేకపోయి నప్పటికీ ఇవన్నీ అక్కడ జరిగేవి. ఈ సందర్భంగా మనం హాలీవుడ్‌లో తయారైన

భారీ చిత్రాలను కూడా మరిచిపోలేం. ఆ చలనచిత్రాలు ప్రజలను పెద్ద సంఖ్యలో ఆకర్షించాయి. మనలో చాలా మందికి నైతిక సాయుధీకరణ (మోరల్ రిఆర్మమెంట్) తెలిసే ఉంటుంది. ఈ ఉద్యమం యూరప్‌లోని అనేక దేశాల్లో వ్యాపించింది. ఈ ఉద్యమ ప్రతినిధులు మధ్యప్రాచ్యం, దూరప్రాచ్యం, ఉదాహరణకు కైరో వగైరా ప్రాంతాలను కూడా పర్యటించారు. ఈ ఉద్యమం ప్రధానంగా నైతిక ప్రమాణాలు, దయ సానుభూతి, న్యాయం పెంపొందించడానికి ప్రయత్నిస్తుంది.

పాశ్చాత్య దేశాల్లో ధర్మం, నైతికతలను ప్రోత్సహించడానికి ఉద్దేశించిన కార్య కలాపాల క్లుప్తమైన వివరాలివి. వీటివల్ల తెలిసేదేమంటే పాశ్చాత్య ప్రజలు తమ సంస్కృతి వల్ల వాటిల్లిన విషపరిణామాలను తగ్గించడానికి ధర్మం, నైతికతల ప్రాధాన్యతను గుర్తించారు. అయినప్పటికీ స్పష్టమైన వాస్తవమేమంటే మతపెద్దలు, ధర్మవేత్తలు, నైతిక ఆధ్యాత్మిక ప్రమాణాలను కోరేవారి చేతుల్లో ఇప్పుడు పగ్గాలు లేవు. రోజురోజుకు సమస్యలు పెరుగుతున్నాయి. ఇక ఈ సంస్కృతి దాని సహజ మార్గాన పయనించడం తప్పదు.

పాశ్చాత్య దేశాల్లో ధర్మం వైపు ప్రజలను పిలవడానికి, ఆధ్యాత్మిక ప్రమాణాలు పెంచడానికి ప్రయత్నిస్తున్న వారు చాలా మంది సామ్యవాదం విస్తరిస్తుందని, సమాజంలో బలం పుంజుకుంటుందని కూడా ఇదివరకు భయపడేవారు. కాని యూరప్‌లో మతం అనేది చాలా బలహీనపడింది. పాశ్చాత్య సిద్ధాంతాల కారణంగా జనించిన అనుమానాలు సందేహాల వల్ల సామ్యవాదాన్ని ఎదిరించే స్థితిలో కూడా మిగల్లేదు. అందువల్ల సామ్యవాదాన్ని అడ్డుకోడానికి సామూహిక, ఆర్థిక ప్రయత్నాలు, మార్గాలు అవలంబించారు. కేవలం భౌతికవాదం ప్రధానమైన ఆలోచనలు కేవలం భౌతిక ప్రయోజనాలను తప్ప మరివేటిని పరిగణనలోకి తీసుకోవు. మరో విషయాన్ని దేన్నీ అంగీకరించదు. నిజానికి సామ్యవాదం కూడా పాశ్చాత్య ఆలోచనల నుంచి పుట్టినదే. పాశ్చాత్య సంస్కృతి ఫలితాల్లోనిదే ఇది కూడా. ఇది పాశ్చాత్య సంస్కృతి దుష్పరిణామాలను మరింత పెంచింది.

మార్క్స్, ఏంగెల్స్ ప్రతిపాదించిన సామ్యవాద సిద్ధాంతం పద్ధెనిమిదవ శతాబ్దంలో ఉనికిలోకి వచ్చింది. ఇందులో ఒకరు జర్మనీకి చెందిన యూదుడు. రెండవ వ్యక్తి కూడా జర్మనీకి చెందిన వాడే. ఈ సిద్ధాంతం వల్ల సామాజిక పరిస్థితి మరింత దిగజారింది. ఎందువల్లనంటే మనిషికి, మనిషి మానసిక, ఆధ్యాత్మిక

ప్రశాంతతకు మధ్య ఈ సిద్దాంతం ఒక పెద్ద అఖాతాన్ని సృష్టించింది. దేవునిపై విశ్వాసం, పరలోకంపై విశ్వాసం మనోమస్తిష్కాల నుంచి మాయమయ్యేట్లు చేసింది. చరిత్ర ప్రారంభం నుంచి నేటి వరకు మానవసమూహాలు మనిషి శాంతిభద్రతల కోసం ఏ విలువలను ఆలంబనగా చేసుకున్నాయో ఆ నైతిక , ఆధ్యాత్మిక ప్రమాణా లన్నింటిని ఇది ధ్వంసం చేసింది. ప్రపంచంలో సామ్యవాద సిద్ధాంతాల పునాదులపై మొదటి ప్రభుత్వం కూడా ఏర్పడింది. ఈ ప్రభుత్వం ప్రజల పరిస్థితిని చక్కదిద్దడానికి ప్రయత్నాలు ప్రారంభించింది. కాని ఆ ప్రయత్నాలు ఫలించలేదు. చివరకు భౌతికవాద సిద్ధాంతాల కారణంగా దారుణంగా విఫలమైంది. ప్రజల సామూహిక, వ్యక్తిగత జీవితాల్లోని అన్నివిధాల ఆందోళనలు, మానసిక భయాందోళనలను దూరం చేయడం దానికి సాధ్యపడలేదు. పైగా ఈ వ్యవస్థ ప్రజల్లో కొత్త ఆందోళనలు, కొత్త కష్టాలను తెచ్చిపెట్టింది. ప్రభుత్వం, ప్రభుత్వ విధానాలను వ్యతిరేకిస్తే, విమర్శిస్తే వారిపై కష్టాలు విరుచుకుపడే ప్రమాదం వాటిల్లింది. ఈ భయం ఎల్లప్పుడు ప్రజల్లోనే కాదు సామ్యవాద పార్టీల కార్యకర్తల్లోను ఉండేది. పార్టీలో ప్రతి ఒక్కరు తమ నాయకుల అభిప్రాయాలను బలంగా సమర్థించక తప్పదు. గుడ్డిగా వారిని అనుసరించక తప్పదు. పార్టీని వ్యతిరేకించేవారయినా, పార్టీ నాయకులను సమర్థించని వారయినా ఎవరైనా సరే తీవ్ర పరిణామాలను చవిచూడక తప్పదు.

కమ్యునిజం దేవుడిని, దైవధర్మాన్ని తిరస్కరించింది. ఆ విధంగా భయం, కష్టాలు, నిరాశ, దౌర్జన్యాలను మనిషి ఎదుర్కొనే శక్తినిచ్చే చివరి ఆసరా కూడా లేకుండా చేసింది. కమ్యునిస్టు వ్యవస్థ ఎక్కడెక్కడ స్థాపించబడిందో అక్కడక్కడ భయం, బలవంతం, బీభత్సం, రక్తపాతాల ద్వారా మనుష్యులను గొర్రెలమందలా మార్చేసింది. తమ స్వంత అభిప్రాయాలు, నిర్ణయాలకు స్వేచ్ఛలేని వాతావరణం సృష్టించింది.

పాశ్చాత్య నాగరికతా సంస్కృతుల రెండు శాఖలు పెట్టుబడిదారి విధానం, సామ్యవాదం రెండు కూడా మనిషికి శాంతి ప్రశాంతతలు లేకుండా చేశాయి. అత్యున్నత ఆదర్శాలను ధ్వంసం చేశాయి. కారణమేమంటే ఈ సంస్కృతి కేవలం భౌతిక వాదాన్నే ఏకైక లక్ష్యంగా చేసుకుంది. ఫలితంగా భౌతిక ప్రయోజనాలు సాధించలేని వ్యక్తి మూర్ఖుడిగా మిగిలిపోయాడు. ఈ ప్రయోజనాలను సాధించుకున్న వ్యక్తికి కూడా నిజమైన సంతోషం లభించలేదు. నిరాశ నిస్పృహలు వెంటాడుతూనే ఉన్నాయి. ఫలితంగా ఆత్మహత్యలు పెరగడంలో ఆశ్చర్యం ఏముంది.

## వాస్తవాల స్పృహ

ఏది ఏమైనా ఇప్పుడు పాశ్చాత్యదేశాల్లో నైతిక, ఆధ్యాత్మిక పతనం పట్ల ఆలోచనలు మొదలయ్యాయి. అక్కడి ప్రజలు ఇప్పుడు ప్రాచ్యదేశాలవైపు చూడ్డం మొదలుపెట్టారు. ఇక్కడి మతధర్మాల్లో వారు కోరుకుంటున్న ఆధ్యాత్మిక శూన్యాన్ని భర్తీ చేయవచ్చునని ఆశిస్తున్నారు. ఈ దేశాల్లో ముఖ్యంగా అమెరికాలో ప్రజలు బౌద్ధాన్ని, బహాయీ మతాన్ని లేదా ఇస్లామ్‌ను స్వీకరించడం మనం చూస్తూనే ఉన్నాము. ఇందులో ఆశ్చర్యం ఏదీ లేదు. ఇక్కడ ఇస్లామ్ స్వీకరిస్తున్న వాళ్ళు ముఖ్యంగా రెండురకాలుగా కనిపిస్తారు. ఆలోచించి, అవగాహన చేసుకుని హేతుబద్ధ తర్క వితర్కాల తర్వాత ఇస్లామ్ స్వీకరిస్తున్నవారు కొందరైతే, ఆధ్యాత్మికంగా మానసికమైన ప్రశాంతత ఇస్లామ్‌లో లభించినందువల్ల ఇస్లామ్ స్వీకరిస్తున్నవారు కొందరు.

ఒకసారి నేను ఇస్లామ్ స్వీకరించిన ఒక ఆంగ్లేయుడిని కలిశాను. ఆయన పేరు అబూబక్ర్. ఆయన తాను ఇస్లామ్ ఎలా స్వీకరించినది నాకు తెలియజేశాడు. ఆయన కైరోలోని విశ్వవిద్యాలయంలో ఇంగ్లీషు బోధించేవాడు. అక్కడే ఆయన ఇస్లామ్ స్వీకరించాడు. ఆ తర్వాత లండన్‌లోని జాతీయ పుస్తకాలయంలో ప్రాచ్య విభాగానికి సెక్రటరీగా పని చేశాడు. ఆయన తాను ఇస్లామ్ ఎందుకు స్వీకరించింది తెలియజేస్తూ, పాశ్చాత్య సంస్కృతి మనిషి ఔన్నత్యాన్ని, గౌరవాన్ని, మనిషి అందచందాలను నాశనం చేసిందన్నాడు. నేను ఆయనతో మాట్లాడుతూ, మనిషి ఔన్నత్యం విషయానికి వస్తే మీ మాటలతో నేను విభేదించను కాని అందచందాలంటారేమిటని అడిగాను. నిజానికి పాశ్చాత్య సంస్కృతి చాలా అందమైనదిగా పలువురు భావిస్తారు కదా. ఈ సంస్కృతిలో మనిషి సహజ వాంఛలకు అనుగుణమైన అందమైన దృశ్యాలు, అందమైన దుస్తులు, నివసించే ప్రదేశం కూడా అందంగా ఉండడం, అడవారిని అందంగా చూపించడం... అందచందాలకు పాశ్చాత్య సంస్కృతిలోనే ఎక్కువ అవకాశం ఉందికదా అన్నాను. ఆయన జవాబిస్తూ, ఈ సంస్కృతి ఆత్మపరమైన, మానసికమైన, నైతికమైన అందచందాలను నాశనం చేసింది అన్నాడు.

నేను 1952లో ప్యారిస్‌లోని జామిఅ మస్జిదులో ప్రసంగించాను. మిలాదున్నబీ సందర్భంగా జరిగిన ప్రసంగం అది. ఆ ప్రసంగంలో నేను ఇస్లామ్ లోని న్యాయ భావనను పరిచయం చేశాను. ఇస్లామ్‌లోని ఈ న్యాయభావన యుద్ధ విజయాల్లోను, రాజ్యాధికారం చెలాయిస్తున్నప్పుడు కూడా ప్రబలంగా ఉండేదని సోదాహరణంగా

వివరించాను. ఈ సందర్భంగా ఒక ఉదాహరణ ఏమంటే అల్జీరియాలో చరిత్రలోనే అమానుషమైన సామూహిక హత్యాకాండ జరిగింది. ఆ సంఘటనలను కూడా నేను ప్రస్తావించాను. ఈ ప్రసంగం తర్వాత నన్ను కలిసినవారిలో ఇటలీకి చెందిన నవముస్లిమ్ ముస్తఫా కూడా ఉన్నాడు. ఆయన ప్యారిస్‌లో ఇటలీ కౌన్సిలర్‌గా పనిచేస్తున్నాడు. ఇస్లామ్ స్వీకరించిన తర్వాత దౌత్యహోదా వదులుకున్నాడు. ఫ్రాన్స్‌లో ఇస్లామ్ స్వీకరించిన యువకుల సంఘానికి నాయకుడిగా వ్యవహరిస్తున్నాడు. ఆ సంఘం గురించి అప్పట్లో ఎవరికీ పెద్దగా తెలియదు కూడా. సభ్యులందరూ వారానికి ఒకరోజు తమ నాయకుడి ఇంట్లో సమావేశమయ్యేవారు. వారందరూ ప్రాచ్య దేశాల మాదిరి దుస్తులు ధరించి ఉన్నారు. చాలా మంది యువకులు గెడ్డం పెంచుతున్నారు. వారం వారం జరిగే వారి సమావేశంలో దివ్యఖుర్‌ఆన్ పారాయణం, ఇస్లామ్ అధ్యయనం జరిగేది. ముస్తఫా నా వద్దకు వచ్చి "మీరు ఇస్లామ్ సాధించిన విజయాలను ప్రస్తావిస్తూ ఆ సందర్భంగా చూపించిన దయ న్యాయం తదితర అంశాలకు ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చారు. వాటన్నింటిని నేను చాలా శ్రద్ధగా విన్నాను. బహుశా మీరు కొంతమంది పాశ్చాత్య మేధావులు రాసిన రాతలకు జవాబివ్వాలని అనుకున్నారు. పాశ్చాత్య మేధావులు కొందరు ఇస్లామ్ యుద్ధాల్లో క్రూరమైన వైఖరి పాటించినట్లు రాశారు. కాని మీరు ఈ విషయమై ఆందోళన చెందనవసరం లేదు. ప్రతి జాతికి నైతిక కొలమానం ఒకటి ఉంటుంది. ఆ కొలమానం ద్వారానే దాన్ని అంచనా వేయడం జరుగుతుంది. ఇక పాశ్చాత్యుల కొలమానం విషయానికి వస్తే దయ, జాలి, కారుణ్యం అనేవి మచ్చుకు కూడా అక్కడ కనబడవు అన్నాడు.

ఒక అరబ్బు ముస్లిమ్ ఈ ఫ్రెంచ్ ముస్లిమ్ యువకులతో ఇస్లామ్ గురించి, ఇస్లామ్ ఔన్నత్యం గురించి, ఇస్లామ్‌లోని ప్రగతిశీల భావాల గురించి మాట్లాడు తున్నాడు. మాట్లాడుతూ అతను ఎంతదూరం వరకు పోయాడంటే ఏదో అరబ్బు దేశం సైనిక శక్తి గురించి గొప్పలు చెప్పసాగాడు. ఇస్లామ్ బలం పెంచుకోవాలని బోధిస్తుందని, ట్యాంకులు, యుద్ధ విమానాలు ఇలాంటి సైనిక ఆవిష్కరణలను ప్రోత్సహిస్తుందని వాగ్ధాటిలో చెప్పుకుపోసాగాడు. ఈ మాటలు విన్న ఫ్రెంచ్ నవముస్లిమ్ యువకుల్లో ఒకడు "బాబూ, మేం పాశ్చాత్య సంస్కృతి యుద్ధాలు, ఆయుధాలతో మా జీవితాలను నింపేసింది కాబట్టే మేం దాన్ని వదిలి ఇస్లామ్‌లోకి వచ్చాం. పాశ్చాత్య సంస్కృతి మా ఆత్మను మృత్యులోయలోకి తోసింది. భౌతికవాదం

ప్రధానంగా సుఖభోగాలే ముఖ్యంగా భావించేలా చేసింది. మానవత్వాన్ని మంట గలిపింది. మీరు మాకు ఇస్లామ్‌లోని ఆధ్యాత్మిక ఔన్నత్యం గురించి మాట్లాడండి. మాకు ఇస్లామ్‌లో మానవ ఔన్నత్యం, ఆత్మపరమైన శాంతి లభించాయని స్పష్టం చేశారు.

ఇదే విధంగా ఒక స్విస్ అమ్మాయి కూడా మాట్లాడింది. ఆమె ప్యారిస్‌లో నివసించేది. మనస్తత్వశాస్త్రం చదువుతోంది. ఆమె మాట్లాడుతూ "నేను ఒక పేద అమ్మాయిని. మా వాళ్ళు పంపే డబ్బు నాకు ఈ నగరంలో బతకడానికి చాలదు. ఈ నగరంలో మనుష్యులు కేవలం తమ ప్రయోజనాలు కోరికలకే ప్రాముఖ్యం ఇస్తారు. అందువల్ల నేను ఏదైనా ఇంట్లో పని వెదుక్కుని నా ఖర్చులకు సంపాదించుకోవాలనుకున్నాను. ఒక ప్రాచ్యదేశస్తుడి కుటుంబం అయితే అక్కడ ఆధ్యాత్మిక వాతావరణం ఉంటుంది కాబట్టి నాకు రక్షణ ఉంటుందని భావించాను. ఆ రకంగా నేను ఒక హిందూ కుటుంబంలో పనికి కుదిరాను. రోజుకు కొన్ని గంటలు అక్కడ పనిచేయాలి. కాని అక్కడ కూడా నాకు ఆధ్యాత్మిక వాతావరణం కనబడలేదు. నేను అనుకున్న రక్షణ నాకు లభిస్తుందనిపించలేదు.

ఇవన్నీ ఇక్కడ ఎందుకు ప్రస్తావించడం జరిగిందంటే, పాశ్చాత్య ప్రజలు ఆధ్యాత్మిక వాతావరణాన్ని అన్వేషిస్తున్నారు. భౌతికవాదం ప్రధానమైన పాశ్చాత్య సంస్కృతి సృష్టించిన చెడులు, ఆందోళనలు, సమస్యల నుంచి విముక్తి ప్రసాదించే ఆధ్యాత్మిక వాతావరణాన్ని కోరుకుంటున్నారు. పాశ్చాత్య సంస్కృతి దుష్పరిణామాలను వారు కూడా గుర్తిస్తున్నారు. ఆలోచనల సమతుల్యం ఉన్న ఏ పాశ్చాత్యుడిని కదిపినా ఈ భావాలే మన ముందుకు వస్తాయి.

## ఇస్లామ్ నేటి అవసరం

భౌతిక జీవితానికి సంబంధించినంతవరకు పాశ్చాత్య సంస్కృతి చాలా ప్రగతి సాధించింది. కాని కేవలం భౌతిక ప్రగతి వికాసాలు మాత్రమే మనిషికి సుఖ సంతోషాలు, శాంతి ప్రశాంతతలు ప్రసాదించలేవు. భౌతిక ప్రగతితో పాటు ఆధ్యాత్మిక, పారలౌకిక ప్రశాంతతను కూడా ప్రసాదించే సమతులమైన వ్యవస్థ అవసరం. ప్రాపంచిక, ఆధ్యాత్మిక అంశాలు రెండు సమానంగా, ఏదీ తక్కువ కాకుండా ఉండే వ్యవస్థ కావాలి. ఇలాంటి నాగరికత సాధ్యమా? ఇలాంటి జాతి ఏదన్నా ఉందా? ఇది పాశ్చాత్య ప్రపంచానికి సాధ్యం కాదేమో, ఎందుకంటే నేడు పాశ్చాత్య వ్యవస్థ

భౌతిక ప్రధానమైన చట్రంలో ఇరుక్కుని, వినాశాన్ని సృష్టించే ఆయుధాల గుట్టలపై కూర్చుని ఉంది. కాని ఈ భౌతికవాదం బలం తగ్గితే అప్పుడు మానవ ఔన్నత్యం, గౌరవ మర్యాదలు, శాంతి ప్రశాంతతల కోసం అవసరమైన నాయకత్వాన్ని అందించే సామర్థ్యం కూడా వారికి మిగలదు. సామ్యవాద సిద్ధాంతం కూడా ఇప్పుడు అలాంటి నాయకత్వం అందించే స్థాయిలో లేదు.

ఇక ప్రాచ్యదేశాల్లో బహుదైవారాధక, విగ్రహారాధక విధానాల విషయానికి వస్తే ఇవి కూడా మనిషికి కావలసిన శాంతి ప్రశాంతతలను ప్రసాదించలేవు. ఎందువల్లనంటే, సంస్కృతి ఏదైనా భ్రమల పునాదులపై నిలబడలేదు. విగ్రహారాధక సంస్కృతి మానవ ఔన్నత్యానికి విరుద్ధమైనది. పైగా ప్రపంచానికి కావలసిన సంస్కృతి, ప్రపంచానికి కావలసిన ఆధ్యాత్మికత నిర్మాణాత్మకమైనది కావాలి. మనిషి ప్రగతి వికాసాలకు తోడ్పడేదిగా ఉండాలి. మనిషిని ప్రాపంచిక జీవితాన్ని వదిలి సన్యసించేలా ప్రోత్సహించేది కారాదు. మనిషి బాధ్యతలను, హక్కులను అన్నింటిని కాదనేదిగా ఉండరాదు. మనిషి భౌతిక ప్రగతిని వ్యతిరేకించేది కారాదు. ప్రస్తుత కాలంలో ఇస్లామ్ తప్ప మరేదీ ఇలాంటి గొప్ప సంస్కృతిని అందించే స్థాయిలో లేదు. దానికి కారణాలు:

అన్నింటికన్నా ముందు ఇస్లామ్ నాగరికతలను ఉనికిలోకి తీసుకొచ్చే విశ్వాసాలన్నింటిలోను చాలా ప్రగతిశీలమైన విశ్వాసాలు కలిగి ఉన్న ధర్మం. అత్యున్నతమైన, పవిత్రమైన, ప్రకాశమానమైన, సంపూర్ణమైన ఏకదైవారాధక విశ్వాసాన్ని ప్రతిపాదిస్తుంది. ఈ విశ్వాసం బుద్ధీవివేకాలు, హేతుబద్ధ ఆలోచనలను గౌరవిస్తుంది. ఇది సమతులమైన మానవ నైతికతను ప్రసాదిస్తుంది. దయ, సానుభూతి, న్యాయం, బాధ్యతాభావం అన్నింటి మధ్య సమతుల్యతను ఏర్పాటు చేసింది. మనిషి జీవితానికి కావలసిన సౌలభ్యం ప్రసాదించే చట్టాలను ఇస్తుంది. ఈ చట్టాలు వివేకం, వివేచన ప్రధానమైనవి. ఈ వ్యవస్థలో వ్యక్తి ప్రయోజనాలు సామాజిక ప్రయోజనాలకు అనుగుణంగా ఉంటాయి. అలాగే సామాజిక ప్రయోజనాల కోసం వ్యక్తి ప్రయోజనాలను బలిపెట్టడం కూడా జరగదు. ఈ విధమైన సమతుల్యం లేనట్లయితే జాతి పరమైన, ప్రాంతపరమైన ప్రత్యేకతలు స్థానిక ప్రాధాన్యతలు నాశనమై పోతాయి.

మరో విషయమేమంటే, మనం ఒక నిర్మాణాత్మకమైన ఆధ్యాత్మికతకు వారసులం. ఇది దైవదత్తమైన ఆధ్యాత్మికత. జీవితమంతా అలుముకుని ఉండే

ఆధ్యాత్మికత. సైనికుడు యుద్ధరంగంలో ఉన్నా, కార్మికుడు కార్ఖానాలో ఉన్నా, విద్యావేత్త అధ్యయనంలో ఉన్నా, తత్వవేత్త వాదనలో ఉన్నా, న్యాయమూర్తి న్యాయస్థానంలో ఉన్నా, ఉద్యోగి కార్యాలయంలో ఉన్నా, పాలకుడు పాలిస్తున్నా.. అందరూ, అన్ని వేళలా ఈ ఆధ్యాత్మిక పరిధిలోనే ఉంటారు. ప్రతి మనిషిని వెన్నంటి ఉండే ఆధ్యాత్మికత ఇది. మనిషి గంభీరమైన పరిస్థితుల్లో ఉన్నా, వినోదాన్ని పొందుతున్నా, ఆరోగ్యంగా ఉన్నా, అనారోగ్యంగా ఉన్నా ఎలా ఉన్నప్పటికీ ఈ ఆధ్యాత్మికత మనిషిని వెన్నంటి ఉంటుంది. మనిషి మార్గంలో ఆటంకంగా కాదు, సౌలభ్యంగా ఉంటుంది. మనిషిని, మనిషి నివసిస్తున్న ఈ భూమిని, మనిషితో పాటు నివసిస్తున్న ప్రాణికోటిని, యావత్తు విశ్వాన్ని సృష్టించిన దేవుడికి మనిషి దాసుడన్న విషయాన్ని ఈ ఆధ్యాత్మికత గుర్తు చేస్తూ ఉంటుంది.

మనం ఇంతకు ముందు కూడా మాట్లాడుకున్నాం. మానవ ఔన్నత్యాన్ని, మనిషికి శాంతి ప్రశాంతతలను ప్రసాదించే సంస్కృతిని స్థాపించే శక్తిసామర్థ్యాలు మనకు ఉన్నాయి. ఈ సంస్కృతిని వ్యతిరేకించేవాళ్ళు చెప్పే మాటలు ఎలా ఉన్నప్పటికీ, ప్రస్తుత పాశ్చాత్య సంస్కృతి కన్నా ఈ సంస్కృతి మెరుగైనదనీ, మనిషికి మేలైనదని చాలామంది అంగీకరిస్తున్నారు. ఈ సంస్కృతిలో ఉన్న నైతిక ఔన్నత్యం, న్యాయబద్ధమైన పరిపాలన, ఆత్మపరమైన ప్రశాంతత, అనేక మానవీయ విషయాల్లో అత్యంత ఆదర్శనీయమైన సంస్కృతి. మనం విద్యావిజ్ఞానాల విషయంలో వెనుకబడిన కాలంలో కూడా అత్యుత్తమమైన సంస్కృతి నాగరికతలను స్థాపించి చూపించిన చరిత్ర మనకు ఉంది. నేడు విద్యావిజ్ఞానాలు ఉచ్ఛదశకు చేరుకున్న కాలంలో ఆ సంస్కృతిని మళ్ళీ స్థాపించడం కష్టం కానే కాదు.

ఆ అత్యున్నత సంస్కృతి పగ్గాలు మనం మన చేతుల్లోకి తీసుకుంటే గాల్లోకి విమానం ద్వారా ప్రయాణించడాన్ని దేవుడిని సవాలు చేసే ప్రగతిగా లేదా దేవుడిని తిరస్కరించే వైజ్ఞానిక ప్రగతిగా భావించడం జరగదు. భూమి గురుత్వాకర్షణను అధిగమించి రోదసిలోకి దూసుకుపోయే రాకెట్లను తయారు చేయడం తదితర వైజ్ఞానిక ఆవిష్కరణలను ప్రపంచ జాతులను బెదిరించడానికి లేదా స్వాధీనం చేసుకోడానికి ఉపయోగించడం జరగదు. రేడియో టెలివిజన్లను మార్గం తప్పించే సాధనాలుగాను, సినిమాను భ్రమల వలయంగాను మారనివ్వడం జరగదు. స్త్రీని వాంఛలు తీర్చే ఆటవస్తువుగా పరిగణించడం జరగదు. ప్రగతి బలంతో వివిధ జాతులపై దౌర్జన్యాలకు

పాల్పడడం జరగదు. ఆయా జాతుల గౌరవమర్యాదలను నాశనం చేయడమూ ఉండదు. ఇవి మన సంస్కృతిలోని కొన్ని విశేషాలు, వీటివల్లనే మనం ఇతరుల కన్నా విభిన్నంగా విశిష్టంగా ఉన్నాము. పాశ్చాత్య సంస్కృతి వైఫల్యం తర్వాత ఒక కొత్త సంస్కృతి కావాలని కోరుకునేవారు, మానవ దౌర్భాగ్యాలకు ఇంతటితో స్వస్తి పలకాలని భావించేవారికి ఈ సంస్కృతి ఎంతైనా కావలసిన సంస్కృతి.

మనం మన విశ్వాసాల పునాదుల గురించి ఆలోచిస్తే మన దివ్యగ్రంథం బోధనలు ఈ వాస్తవాలను స్పష్టంగా చెబుతున్నాయి. మానవాళికి అవసరమైన సాంస్కృతిక ప్రత్యేకతను కలిగి ఉన్న ఏకైక సముదాయంగా చాటి చెబుతున్నాయి. ఇది జాతిపరమైన వివక్ష కానేకాదు. ఎందుకంటే జాతి మత వివక్షలను ఇస్లామ్ ఎన్నడూ సమర్థించలేదు. దివ్యఖుర్ఆన్ స్పష్టంగా ఇలా ప్రకటించింది.

**"ఇకనుండి ప్రపంచంలో మానవులకు మార్గం చూపటానికీ, వారి సంస్కరణకూ రంగంలోకి తీసుకురాబడిన ఉత్తమ సమాజం మీరే. మీరు మంచిని చెయ్యండి అని ఆజ్ఞాపిస్తారు. చెడు నుండి ఆపుతారు అల్లాహ్‌ను విశ్వసిస్తారు."**

***(ఆలి ఇమ్రాన్ : 110)***

ఈ దైవవాక్యం మన విశ్వాసాలు, మన నైతికతను సూచిస్తుంది. ఒక శ్రేయో సమాజంగా తీర్చిదిద్దిన ప్రత్యేకతలు ఇవి.

**"మేము గనక వారికి భూమిపై అధికారాన్ని ప్రసాదిస్తే, వారు నమాజ్‌ను స్థాపిస్తారు, జకాత్ ఇస్తారు, మంచి చేయమని ఆజ్ఞాపిస్తారు, చెండు నుండి నిరోధిస్తారు."** ***(అల్‌హజ్ : 41)***

ఈ దైవవాక్యంలోను మన సంస్కృతికి చెందిన అవే ప్రత్యేకతలను ప్రస్తావించడం జరిగింది.

మరో చోట దివ్యఖుర్ఆన్ ఇలా పేర్కొంది.

**"ఈ విధంగా మేము మిమ్మల్ని ఒక "మధ్యస్థ సమాజం"గా చేశాము. ఇకపై మీరు సమస్త మానవ జాతికి సాక్షులుగా ఉంటారు. ప్రవక్త మీకు సాక్షిగా ఉంటాడు..."** ***(అల్ బఖర : 143)***

ఈ దైవవాక్యం మనల్ని ఒక ఉద్యమ నిర్వాహకులుగా పేర్కొంటోంది. మన మనిషి సహజ ప్రవృత్తి పిలుపును స్వీకరించి ఈ ఉద్యమంలోకి వచ్చాక మనం

శాంతి, హితబోధల గమ్యం దిశగా మానవాళికి మార్గదర్శనం ఇవ్వవలసి ఉంది. కాని మనం ఈ బాధ్యతను మరిచిపోయాం. ఈ దైవవాక్యాలు మన బాధ్యతలను గుర్తు చేస్తున్నాయి. ఆందోళనలు, దౌర్జన్యాలు, నిరాశ నిస్పృహల చీకట్లలో కొట్టు మిట్టాడుతున్న మానవాళిని ఆదుకునే బాధ్యత అది. ప్రపంచంలో ఆత్మహత్యలు పెరుగుతున్నాయి. అణుబాంబుల వంటి దారుణమారణాయుధాలతో జాతులు వినాశానికి చేరువవుతున్నాయి. ఈ నేపథ్యంలో మనం ప్రపంచశాంతి కోసం ముందడుగు వేయవలసి ఉంది.

## సాంస్కృతిక భవిష్యత్తు

ఒక సరికొత్త సాంస్కృతిక పాత్ర పోషించవలసిన బాధ్యత గురించి నేను ప్రస్తావించాను. కాని దీన్ని రెండువర్గాలు చాలా చిన్నచూపు చూస్తాయి. ఇందులో మొదటి వర్గం పాశ్చాత్య సంస్కృతికి బానిసైన వర్గం. పాశ్చాత్యులకు పోటీగా నిలబడే స్థాయి తమకు లేదనుకుంటారు. ఈ వర్గం వల్లనే మనం అనేక సమస్యల్లో ఇరుక్కున్నాం. కాని అదృష్టవశాత్తు మనలో ఈ వర్గం క్రమేణా బలహీనపడుతోంది. వారి సంఖ్య తగ్గుతోంది. ప్రస్తుత సంస్కృతిలోని లోపాలు, ఈ సంస్కృతి వల్ల తలెత్తిన కష్టనష్టాలు, ఇతరులపై కొనసాగుతున్న దౌర్జన్యాలు మొదలైనవి ఇప్పుడు చర్చకు వస్తున్నాయి. దీనిక్కారణం ఆలోచనల్లో మార్పు రావడం, రాజకీయ చైతన్యం పెరగడం. పాశ్చాత్య సామ్రాజ్యానికి దాస్యం చేసే దశ ఇప్పుడు అంతరించింది.

రెండవ వర్గం, పాశ్చాత్య సంస్కృతిలోని లోపాల వల్ల అది అంతరిస్తుందని నమ్ముతారు కాని, మనం ఒక ఆధునిక సంస్కృతికి పునాదులు వేయగలమన్న విషయాన్ని ఒప్పుకోడానికి సిద్ధంగా లేరు.

కాని పాశ్చాత్య సంస్కృతి అంతరించి మన సంస్కృతి విస్తరించడం అన్నది ఏదో పాతిక యాభై సంవత్సరాల కాలంలో అయిపోతుందన్నది నా ఉద్దేశ్యం కాదు. సంస్కృతుల ఉత్థాన పతనాలు సహజ సూత్రాల ప్రకారం జరుగుతాయి. పటిష్టమైన కోటగోడల పునాదుల్లో లోపం ఏర్పడినా పైకి మాత్రం చాలా పటిష్టంగానే కనబడుతుంది. కాని లోలోపల బలహీనపడుతూ ఉంటుంది. కాలక్రమేణా శిథిలాల గుట్టగా మిగిలిపోతుంది.

మనం పునరుజ్జీవన కాలం నుంచి అనేక దశలు దాటుకుని వచ్చాం. ప్రతి దశ తర్వాత సహజంగానే మరో దశను ఎదుర్కుంటూ వచ్చాం. చివరకు సామ్రాజ్యవాద

ఊబిలో కూరుకుపోయాం. కాలక్రమేణా అనేక దేశాల నుంచి సామ్రాజ్యవాదాన్ని తరిమేయగలిగాం. ఆధునిక సంస్కృతి తప్పనిసరిగా చేసిన పద్ధతులను మనం నేర్చుకుని వాటిని పాటిస్తూ వస్తున్నాం. నిజానికి ఈ పద్ధతులన్నీ మనల్ని బానిసలుగా మార్చిన సంస్కృతిలోని భాగాలే. అయినా వాటిని పాటిస్తున్నాం. ప్రగతి వికాసాలు సాధించిన తర్వాత ఇప్పుడిక సాంస్కృతికంగా ఆధునిక సమస్యలను పరిష్కరించే నాగరికతను వృద్ధి చేసుకోవలసిన అవసరం ఉంది. ఈ దశ దాటి రానున్న మరో దశలో కావలసిన ఏర్పాట్లు ముందుగానే చేసుకోవాలి. మనం భవిష్యత్తులో కూడా పాశ్చాత్య సంస్కృతి ఛాయలోనే ఉంటామా? లేక మనకన్నా ముందు పరుగెత్తుతున్న వారి వెనకే పరుగెత్తుతూ ఉంటామా? ఆ విధంగా ఎల్లప్పుడు వెనుకబాటను కొనసాగిస్తూనే ఉంటామా? లేక మన కోసం సరికొత్త మార్గాన్ని నిర్మించుకుంటామా? ఆధునిక సమస్యలకు పరిష్కారాన్నిచ్చే కొత్త మార్గంలో కొనసాగుతామా? అన్నది ప్రశ్న

నేడు పాశ్చాత్య దేశాలు సాధించిన భౌతిక ప్రగతి స్థాయిని కొన్ని సంవత్సరాల్లో అందుకోవడం మనకు సాధ్యం కాదు. ఒకవేళ మనం ఇప్పుడు పాశ్చాత్య దేశాల స్థాయిని కొన్నేళ్ళలో అందుకున్నా అప్పటికి పాశ్చాత్య దేశాలు మరింత ముందుకు వెళ్ళిపోతాయి. అందువల్ల భౌతిక ప్రగతికి మన శక్తిసామర్థ్యాల మేరకు ప్రయత్నిస్తూనే దానితో పాటు మన కోసం, యావత్తు మానవాళి కోసం సరికొత్త సాంస్కృతిక ప్రమాణాలను నిలబెట్టాలి. వాస్తవమేమంటే సాంస్కృతిక ప్రమాణాల విషయంలో మనం పూర్తి స్వేచ్ఛను కలిగి ఉన్నాం. ఆధునిక సంస్కృతిలోని లోపాల గురించి ఆలోచించడానికి కావలసిన సమయమూ మన వద్ద ఉంది. ఇది కొన్నేళ్ళలో సాధించే విషయం కాకపోవచ్చు. కాని కాలం గడిచే కొద్దీ రానున్న కాలాల్లో మనం ఎదుర్కొనే కొత్త దశకు ఇప్పటి నుంచి చేసుకునే ఈ ఏర్పాట్లు మన సాంస్కృతిక ఆలోచనలు మనకు ఈ లోపభూయిష్టమైన విధానాలనుంచి విముక్తి పొందడానికి తోడ్పడతాయి. ఈ లక్ష్య సాధనకు మార్గం మన ముందుంది.

మనం ఈ ప్రయత్నాలు కొనసాగిస్తే ఆధునిక చరిత్రను ఒక గొప్ప మలుపు తిప్పినవారమవుతాము. ఆసియా ఆఫ్రికా ఖండాల్లో మన ఆధ్యాత్మిక, నైతిక ప్రమాణాలకు పునాదులు వేయగలం. ఈ ప్రమాణాలు ప్రజల జీవితాల్లో సుఖసంతోషాలను నింపగలవు.

ఈ మాటలెన్ని చెబుతున్నప్పటికీ చరిత్రలో సంఘటనల వేగాన్ని వ్యాసకర్త

ఆలోచనలు అందుకోలేవన్న స్పృహ నాకు ఉంది. రేపు ఏం జరుగుతుందో ఎవరు చెప్పగలరు? ప్రపంచంలో ఎక్కడో ఒక మూల ఒక సంఘటన జరుగుతుంది. మరో మూల నివసిస్తున్న జీవితాలు కకావికలమవుతాయి. అయినప్పటికీ మనం భవిష్యత్తు గురించి ఆలోచించడం తప్పదు.

ఈ పుస్తకంలో రాసిన విషయాలు నేను హి.శ 1375 ముహర్రమ్ 20వ తేదీన అంటే 1955 డిసెంబర్ 8వ తేదీన, తర్వాత రబీవుస్సాని 23 అంటే 1955 డిసెంబర్ 15వ తేదీన డెమస్కస్ రేడియోలో చేసిన ప్రసంగాలు. ఇందులో మన సంస్కృతికి సంబంధించిన విశిష్ట అంశాలను ప్రస్తావించడం జరిగింది. న్యాయంగా ఆలోచించే ప్రతి వ్యక్తిని ఆకట్టుకునే విషయాలవి. శ్రోతల స్థాయిని దృష్టిలో ఉంచుకుని సంస్కృతిలోని విశిష్టతల పట్ల వారిలో అవగాహన పెంచడానికి ప్రయత్నిం చాను. ముఖ్యంగా దేవునిపై విశ్వాసం, మన చరిత్రపై నమ్మకం కలిగిన యువకులను దృష్టిలో ఉంచుకుని చేసిన ప్రసంగాలవి. కాని ఆ ప్రసంగాలను ఆ తర్వాత నేను కొనసాగించడం సాధ్యపడలేదు. నేను పాశ్చాత్య దేశాల్లో స్టడీ టూర్ కోసం ఏర్పాట్లలో ఉన్నందువల్ల ఆ ప్రసంగాలు కొనసాగలేదు. ఈ పర్యటన 1956లో పూర్తయ్యింది. ఆ ప్రసంగాలు కొనసాగి ఉంటే నేను దైవవిశ్వాసం, సత్యం పట్ల నిబద్ధత, పవిత్రత, ఉన్నత నైతికవర్తనం, సానుభూతి, న్యాయపరిపాలన వంటి ఉన్నత గుణగణాలను ప్రతిబింబించే అనేక ఉదాహరణలు ఇవ్వాలనుకున్నాను. సుల్తానులు, ధర్మవేత్తలు, తత్వవేత్తలు, వ్యాపారులు, పాలకులు, స్త్రీలు పురుషులు అనేకమందికి చెందిన అనేక ఉదాహరణలున్నాయి. వీరంతా కల్పిత పాత్రలు కాదు. నిజంగా ఈ ప్రపంచంలో జీవించి, ఉన్నత గుణగణాలను ప్రదర్శించిన వారు.

పటిష్టమైన ఆధ్యాత్మిక జీవితానికి గొప్ప ఉదాహరణలుగా వారి జీవితాలు గడిచాయి. ఇలాంటి వారి వల్ల మన సంస్కృతి ఇతర సంస్కృతులకు విభిన్నంగా విశిష్టంగా కనబడుతోంది. దూరప్రాచ్యంలో ఆధ్యాత్మికంగా ప్రత్యేకతలు కలిగిన కొందరు వ్యక్తులు మనకు చరిత్రలో కనబడతారన్నది వాస్తవమే. నేడు కూడా ఇలాంటి వారు కనబడవచ్చు. ఇలాంటి వారు ఆధ్యాత్మికంగా ఉన్నతస్థాయిలో కనిపించినా సాంస్కృతిక వ్యవహారాలకు సంబంధించి వారి పాత్ర ఏదీ కనబడదు. వారు నిత్యజీవిత వ్యవహారాలకు దూరంగా, సంస్కృతి నాగరికతల వాసన అంటకుండా ఉండడమే కనబడుతుంది. వారి జీవితాలు ఆరాధనాలయాల్లో, ఆశ్రమాల్లో, కొండల్లో, అడవుల్లోనే

గడిచిపోయాయి. కాని మన సంస్కృతిలో ఉన్నత ఆధ్యాత్మిక నైతిక ప్రమాణాలు ప్రదర్శించిన వారు నిత్యజీవితంలో ప్రాపంచిక వ్యవహారాలను నిర్వహిస్తూ, ప్రపంచాన్ని ఆధ్యాత్మిక గుణగణాలతో అలంకరించారు. ఈ ప్రయత్నాల్లో ధనప్రాణ త్యాగాలకు కూడా వెనుదీయలేదు.

## ప్రచురణ ఉద్దేశ్యం

ఈ పుస్తక ప్రచురణ ముఖ్య ఉద్దేశ్యం ఆ ఉన్నత గుణగణాలను పాఠకుల దృష్టికి తీసుకురావడం. ప్రస్తుత సంస్కృతి కన్నా ఉన్నతమైన, ఉత్కృష్టమైన సంస్కృతిని నిలబెట్టే శక్తిసామర్థ్యాలు మనకున్నాయని చాటి చెప్పడం. ఒక ఉదాత్తమైన, ఉత్తమమైన సంస్కృతిని స్థాపించేలా యువతరాన్ని సంసిద్ధం చేయడం. ఒకప్పుడు మన పూర్వీకులు స్థాపించి చూపించిన సంస్కృతిని మళ్ళీ పునరుజ్జీవింపజేయడానికి అవసరమైన వాతావరణం సృష్టించడం. ఈ విషయాలు గుర్తు చేయవలసిన కాలం ఇది. ఎందుకంటే, ఇప్పుడు మనం ఒక చరిత్రలో ఒక కొత్త దశలోకి అడుగిడే పరిస్థితులు ఉన్నాయి. అందువల్ల ఒక మెరుగైన, ఉదాత్తమైన భవిష్యత్తును యువతరం నిర్మించడానికి ఈ విషయాలు గుర్తు చేయడం ఎంతైనా అవసరం. ముస్లిమ్ యువతరంలో వారి పెద్దల ఉదాత్తమైన లక్షణాలు, గుణగణాలు మిగిలే ఉన్నాయి. అందువల్ల వారి పెద్దల ఉదాత్త వ్యక్తిత్వాలు, ఉత్తమ గుణగణాలకు సంబంధించిన కథనాలు వారి ముందుకు వస్తే వారిలో గొప్ప ప్రేరణ కలుగుతుంది. వారు ఆ తర్వాత ఆచరణాత్మకంగా నడుం కట్టగలరు.

ఈ గొప్ప సంఘటనలను ప్రస్తావించడానికి కారణం మన చరిత్రలోని వైభవాన్ని ప్రచారం చేయడం కాదు. చరిత్రలో పొరబాట్లు, తప్పులు జరగని కాలం అంటూ ఏదీ లేదు. మన చరిత్రలో ప్రేరణాత్మకమైన, ఉదాత్తమైన, మానవాళికి ఆదర్శప్రాయమైన సంఘటనలు చాలా ఉన్నాయి, వాటిని ప్రస్తావించడం ద్వారా యువతరాన్ని ప్రోత్సహించాలన్నదే ఉద్దేశ్యం. మన సంస్కృతిలో కేవలం లోపాలు తప్ప మరి ఏవీ కనబడని అనేకమంది మేధావుల రాతలను ఖండించడం కూడా ఈ పుస్తక ప్రచురణ ఉద్దేశ్యం. ఈ ఉదాత్తమైన సంస్కృతిపై అపవాదులు వేసి భవిష్యత్తులో మానవాళికి ఉపయోగపడే సంస్కృతి కాదన్నట్లు తీర్మానించే వారి మాటలను ఖండించడం కూడా దీని ఉద్దేశ్యం. మన చరిత్రలోని ప్రస్ఫుటమైన ఉదాహరణలు మన యువతరం దృష్టిలో పడకుండా కొందరు పన్నుతున్న కుట్రలను తిప్పికొట్టడం

కూడా దీని ఉద్దేశ్యం. ఈ మేధావులు తమ యువతరంతో పాటు మన వారిని కూడా తమ విషసంస్కృతి ప్రభావానికి గురయ్యేలా చేస్తున్నారు. వారు తమ సంస్కృతిలో మన యువతరాన్ని కూడా కలగలిపేయాలనుకుంటున్నారు. కాని ఈ పాశ్చాత్య సంస్కృతి విషపరిణామాలు ఇప్పుడు దాచేసినా దాగవు. ఇందులో ప్రయోజనాలు ఒక్క పేజి ఉంటే, వేలాది పేజీల్లో దీని కష్టనష్టాలున్నాయి. కాని సామ్రాజ్యవాదం ఈ సంస్కృతిని కాపాపడుకోవాలని ప్రయత్నిస్తోంది. పాశ్చాత్య సంస్కృతికి భావదాస్యం చేస్తున్న మేధావులు కూడా దీని గుణగానాలు చేస్తూ వస్తున్నారు.

## నేను ప్రారంభించాను...మీరు ముగించండి

నేను ఈ పుస్తకంలో ఎంచుకున్న కొన్ని సంఘటనలను ప్రస్తావించాను. మన చరిత్రను అధ్యయనం చేసిన వారు ఈ ప్రారంభ ప్రయత్నాన్ని అందిపుచ్చుకుని కొనసాగిస్తారని ఆశిస్తున్నాను. ఆ విధంగా మన సంస్కృతిలోని ఉత్తమ గుణగణాలు మన యువతరం ముందు ప్రస్ఫుటం అవుతాయి. ఒకప్పుడు మన సంస్కృతి ద్వారా మానవాళికి కావలసిన ప్రయోజనాలు లభించాయి. సమాజంలో వెన్నెల్లా ఈ సంస్కృతి సుఖశాంతులను పంచింది. మధ్యప్రాచ్యంలో సంస్కృతిని విప్లవాత్మకంగా మార్చేసింది. ఒకప్పుడు గొప్ప సంస్కృతికి వారసులైన వారు నేడు తమ చరిత్రను మరిచిపోయారు. ఏ జాతయితే తన లోపాలను, బలాలలను గుర్తించలేదో ఆ జాతికి భవిష్యత్తు ఉండదు. ప్రతి జాతికి దాని చరిత్రతో సంబంధం ఉంటుంది. ప్రతి జాతిలోని మౌలికమైన ప్రత్యేకతలే ఆ జాతి సంస్కృతి ఉనికిలోకి రావడానికి కారణమవుతాయి. కాబట్టి ఈ చరిత్రను మనం తెలుసుకోవడం అవసరం. మన చరిత్రలో దాగున్న నిధులను గ్రహించి మనం భవిష్యత్తును నిర్మించుకోడానికి ఉపయోగించుకోవాలి. ఆ విధంగా మన ప్రగతి వికాసాలు నిర్మాణాత్మకంగా ముందుకు కొనసాగుతాయి.

**- ముస్తఫా హసనీ సబాయీ**

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# ఇస్లామ్ సంస్కృతీ సౌరభాలు

## మానవ మైత్రి

శాశ్వతమైన ఇస్లాం నాగరికత, దాని చారిత్రక అంశాలపై చర్చించే వారికి ఇతర సమస్త నాగరికతలకు భిన్నమయిన, అతీతమయిన దాని ప్రధాన లక్షణాన్ని విస్మరించడం సాధ్యం కాదు. మానవ ప్రేమ దాని ప్రధాన లక్షణం. ఇస్లామీయ నాగరికత మానవ జాతిని అసహ్యించుకోవడం, ద్వేషించడం, విభజించడం, అసూయ పడడం నుండి విముక్తం చేసి ప్రేమించడం, ఆదరించడం, సహకరించడం, సమాన స్థాయి ఇవ్వడం గురించి ప్రబోధించింది. ఇస్లామీయ శాసనం, ఇస్లామీయ సామాజిక సూత్రాల ప్రకారం వంశ, వర్గ, జాతీయ ప్రాతిపదికలపై గౌరవప్రతిష్ఠలు ఇవ్వడమనే ప్రశ్న ఉదయించదు. ఈ సూత్రాలు ఇస్లాం నాగరికత మౌలిక విషయాలు, అంశాలు, విశదీకరణల్లో సయితం అతి స్పష్టంగా గోచరిస్తాయి.

ఇస్లాం సూత్రాలకు సంబంధించినంత వరకు సర్వమానవులు ఒకే ప్రాణి నుండే జన్మించారని అది ప్రకటించింది.

> **"మానవులారా! మీ ప్రభువుకు భయపడండి, ఆయన మిమ్మల్ని ఒకే ప్రాణి నుండి సృష్టించాడు. అదే ప్రాణి నుండి దాని జతను సృష్టించాడు. ఇంకా ఆ జంట ద్వారా ఎంతోమంది పురుషుల్ని, స్త్రీలను అవనిలో వ్యాపింపజేశాడు."**
>
> ***(అన్ నిసా :1)***

యావత్ మానవజాతికి అసలు మూలం ఒకటే. ఆ ఏక మానవ సంతతి నుండి ప్రజలు జాతులు, తెగలు, వర్గాలు, దేశాలు, విడిపోయారు. అది ఎలా అంటే, ఒకే ఇంట్లో ఒక తల్లిదండ్రుల సంతానంలో ఎందరో అన్నదమ్ములు, అక్క చెల్లెండ్రు పుట్టినట్లు. వాస్తవం ఇదయినప్పుడు తెగలు, జాతుల మధ్య పరస్పర పరిచయం, మంచిలో ఒకరినొకరు సహకరించుకోవడం మాత్రమే జరగాలి. అందుకే ఖుర్ఆన్ ప్రబోధిస్తోంది:

**"మానవులారా! మేము మిమ్మల్ని ఒకే పురుషుని నుండి, ఒకే స్త్రీ నుండి సృజించాము. తరువాత మీరు ఒకరినొకరు పరిచయం చేసుకునేందుకు మిమ్మల్ని జాతులుగానూ, తెగలుగానూ చేశాము." *(అల్ హుజురాత్ : 13)***

ఆ తర్వాత కొందరు వ్యక్తులు జీవన రంగంలో ముందుకు వెళ్ళిపోతారు. కొందరు వెనుక పడిపోతారు, కొందరు సంపన్నులవుతారు, మరికొందరు పేదవారిగా ఉండిపోతారు. ఒక వ్యక్తి పాలకుడవుతే, ఒక జాతి పాలితురాలవుతుంది. కొన్ని జాతుల వర్ణం తెల్లగా ఉంటే, కొన్ని జాతుల రంగు నల్లగా ఉంటుంది.

ఇది ప్రకృతి శాసనం. మార్పు చెందని జీవిత విధానమిది. అయితే ఇలాంటి నిమ్నోన్నతలు మానవతను ఖండఖండాలుగా విభజించడానికి కారణభూతమవ్వాలని భావం కాదు. సంపన్నుడికి పేదవాని మీద, పాలకునికి పాలితుల మీద, తెల్లవారికి నల్లవారి మీద ఎలాంటి ఆధిక్యత లేదు. మానవత్వం రీత్యా అందరూ సమానులే. ఒకవేళ ఆధిక్యత ఉంటే అది కేవలం దైవభీతి ప్రాతిపదికపైనే ఉంటుంది.

**"వాస్తవానికి మీలో అందరికంటే ఎక్కువ భయభక్తులు కలవాడే అల్లాహ్ దృష్టిలో ఎక్కువ గౌరవపాత్రుడు." *(అల్ హుజురాత్ : 13)***

చట్టం ముందు అందరూ సమానులే. చట్టం అందరినీ సమానంగా శాసిస్తుంది. అన్నింటికి అతీతంగా ఉండి ఆజ్ఞాపిస్తుంది. ఎవరి మధ్యనైనా విచక్షణ అన్నది వుందంటే అది కేవలం సత్యం ప్రాతిపదికపైనే ఉంటుంది.

**"ఎవడైనా రవ్వంత సత్కార్యం చేసి ఉన్నాసరే దాన్ని అతను చూసుకుంటాడు. అలాగే ఎవడైనా రవ్వంత దుష్కార్యం చేసివున్నాసరే దాన్నీ అతను చూసుకుంటాడు." *(అల్ జిల్‌జాల్ : 7, 8)***

సామాజిక జీవన స్రవంతిలో అందరి స్థానం సమానంగా ఉంటుంది. అందులోని బలవంతుడు బలహీనుడ్ని ఆదుకుంటాడు. అలా పూర్తి సమాజం ఒక్కో వ్యక్తి సేవ చేస్తుంది.

హదీసులో ఇలా ఉంది :

"ప్రేమ, వాత్సల్యాలలో ముస్లింలు ఒకే శరీరాన్ని పోలి ఉంటారు. వారి శరీరంలో ఒక అవయవం రోగాన పడితే మిగతా అవయవాలన్నీ జ్వరంలో, అవిశ్రాంతంలో దానితో పాటు పాలు పంచుకుంటాయి." (ముస్లిం, అహ్మద్)

ఈ విధంగా ఇస్లాం నిరంతరం మానవులంతా ఒకటేనని మానవ ఏకత్వాన్ని, చాటుతూ అందులోని వ్యక్తులు ఒకే తల్లితండ్రి సంతానం లాంటి వారని ప్రకటిస్తోంది. మానవ సమాజం ఓ వృక్షం వంటిది. గాలి వీచినప్పుడల్లా దాని పై కొమ్మలూ, క్రింది కొమ్మలూ అన్నీ కదులుతాయి. అందుకే ఖుర్‌ఆన్‌లో అనేక చోట్ల "యా అయ్యుహన్నాస్" (ఓ మానవులారా!), "యా బనీ ఆదమ్" (ఓ ఆదం సంతానమా!) లాంటి పదాలతో మానవులను సంబోధిస్తుంది. ఈ మానవ ఏకత్వభావన హృదయాలలో జనించి స్థిరపడిపోవాలన్నదే ఖుర్‌ఆన్ ఉద్దేశ్యం. అలాగే ఇస్లాం ధర్మాన్ని ఆచరించే వారిని "యా అయ్యుహల్లజీన ఆమనూ", "యా అయ్యుహల్ మూమినూన్" (ఓ విశ్వాసులారా!) అని మాత్రమే సంబోధించిందిగాని, వారిలో వంశ, వర్గ విభేదాల్ని ఎత్తిచూపించలేదు.

## ఇస్లామీయ సమానత్వం

**"అల్లాహ్ మీది ప్రేమతో పేదలకూ, అపరాధులకూ, ఖైదీలకూ అన్నం పెట్టే వారు (వారు వారితో ఇలా అంటారు): "మేము కేవలం అల్లాహ్ కోసమే మీకు అన్నం పెడుతున్నాము. మేము మీ నుండి ఎలాంటి ప్రతిఫలాన్నిగానీ, కృతజ్ఞతలను గానీ ఆశించటం లేదు."** ***(అద్దహర్ : 8, 9)***

మానవుల్ని, జంతువుల్ని, వృక్షాల్ని, పర్వతాల్ని, భూమ్యాకాశాల్ని సమస్తాన్ని ఇస్లాం దేవుని దాస్య పరిధిలోకి తెచ్చింది. ఇస్లాం అలా పురోగమిస్తూ తన శాసన నిర్మాణం ద్వారా మానవ మైత్రిని అత్యున్నత శిఖరాలకు చేర్చింది. నమాజ్‌లోని ప్రతి రకాత్‌లో ఖుర్‌ఆన్ ఎంత ప్రేమపూర్వక ధోరణిలో ముస్లింకు ఈ విషయం గుర్తు చేస్తుందో చూడండి :

**"అల్‌హమ్దు లిల్లాహి రబ్బిల్ ఆలమీనర్రహ్మా నిర్రహీం."** ***(అల్ ఫాతిహా)***

"స్తోత్రం కేవలం అల్లాహ్ కొరకే. ఆయన సకల లోకాలకు ప్రభువు, అనంత కరుణామయుడు, అపార కృపాశీలుడు."

మానవుడు ఈ విశ్వంలో ఒక అంతర్భాగమని, యావత్ విశ్వ వ్యవస్థ అపార కృపాశీలుడైన అల్లాహ్ సృష్టిలో తమని, ఆయన కారుణ్యాఛాయ ప్రతి సృష్టి రాశిపై విస్తరించి ఉందనే యదార్థాన్ని ప్రతి ముస్లిం అనుక్షణం తన దృష్టిలో ఉంచుకోవాలని ఖుర్‌ఆన్ చెబుతుంది. అందువల్ల ఈ విశ్వంలో నివసిస్తూ, ఈ విశ్వంపై ఆధారపడి

ఉండే ప్రతి ముస్లిం అల్లాహ్ గుణనామాల (రహ్మాన్, రహీం)కు అనుగుణంగా విశ్వ కారుణ్యానికి ప్రతీకగా ఉండాలి.

## ఈ ప్రకటనలన్నీ బూటకాలేనా?

ఇవి ఇస్లామీయ నాగరికతలోనున్న మానవ మైత్రికి నిదర్శనాలు. ఇంకా ఇస్లాం మౌలిక దృక్పథాల్లోను, దాని శాసనాల్లోనూ విలీనమై ఉన్నాయి. అయితే ఇస్లాం విజయం పొంది, అధికార పీఠాన్ని అలంకరించిన తర్వాత ఆ ప్రకటనలన్నింటినీ క్రియాత్మకంగా చేసి చూపించిందా? లేక ఆ సూత్రాల్ని ఐక్యరాజ్యసమితి వలె మానవ హక్కుల పరిరక్షణకై కేవలం ప్రకటన చేసి ఊరుకుందాం అన్న ప్రశ్న ఉదయిస్తుంది. అలా అది ప్రకటించిన దినం రాగానే ప్రతి సంవత్సరం ప్రపంచ రాజ్యాలన్నీ ఘనంగా ఉత్సవాలు జరుపుకుంటున్నప్పటికీ, ప్రపంచంలోని అగ్రరాజ్యాలు ప్రతీ సమయం, ప్రతీ రోజు, ప్రతి నెల ఆ మానవ హక్కుల నన్నింటినీ కాలరాసి పారేస్తుంటాయి. లేక ఆ సూత్రాలు ఒప్పుకున్న రాజ్యాల వరకే అవి పరిమితమయి ఉన్నాయి. ఉదాహరణకు ఫ్రాన్స్ విప్లవ సూత్రాలు ఫ్రాన్స్ వరకే పరిమితమై ఉన్నాయి. ఫ్రాన్స్ ప్రభావం క్రిందనున్న రాజ్యాలు, దాని వలస దేశాలు, అది దురాక్రమణ జరిపిన ప్రాంతాల వరకు వాటి ద్వారాలు మూయబడి ఉన్నాయి. న్యూయార్క్ తీరంలో స్వేచ్ఛ, స్వాతంత్ర్యానికీ చిహ్నంగా ప్రతిష్ఠించబడివున్న విగ్రహాన్ని ఆ దేశంలో అడుగుపెట్టిన ప్రతీ వ్యక్తి దర్శిస్తాడు. అలా ప్రపంచంలో ఇంకే దేశంలోనైనా అలాంటి విగ్రహం ప్రతిష్టించబడిందా? నిజానికి అవతలి ప్రపంచంలో అమెరికా జరుపుతున్న కార్యకలాపాలన్నీ స్వేచ్ఛా, స్వాతంత్ర్యాల్ని వెక్కిరిస్తున్నాయి. వాటిని అపహాస్యం చేస్తున్నాయి. స్వాతంత్ర్య ప్రియులపై హింసా, దౌర్జన్యాలు నిరంతరం జరుపబడుతున్నాయి.

.కాని ఇస్లామీయ వ్యవస్థలో అలా జరుగలేదు. ఇక్కడ ఏమి చెప్పబడిందో అదే చేసి చూపించబడింది. ఈ వాస్తవాన్ని గురించి మనం చరిత్రను అడగాలి. ఎందుకంటే దానికి చరిత్రే నిజమైన సాక్షి కాబట్టి. ఇస్లామీయ నాగరికతలోని దేదీప్య మానమైన మానవమైత్రిని పరిశీలించాలి. ప్రపంచ మానవాళిపై ఇస్లామీయ నాగరికత వేసిన ఆచరణా ముద్ర, చరిత్ర హృదయంలో భద్రపరచబడి ఉన్న వారి కార్యకలాపాలు ఎలాంటి వాస్తవాన్ని చాటుతున్నాయో కూడా మనం చూడాల్సి ఉంది.

## ఒకటవ నిదర్శనం

హజ్రత్ అబూజర్ (రజిఅన్) గిఫార్ తెగకు చెందినవారు. ఓ సందర్భంలో హజ్రత్ అబూజర్ (రజి) స్వేచ్ఛ పొందిన బానిస హజ్రత్ బిలాల్ (రజి)ను కోపగించుకున్నారు. ఈ ఇద్దరూ మహాప్రవక్త (సఅసం) అనుచరులు. ఇద్దరి మధ్య పోట్లాట కాస్త పెరిగింది. హజ్రత్ అబూజర్ (రజి) తీవ్రమైన కోపంలో హజ్రత్ బిలాల్ (రజి)ను "ఇబ్నె అస్వద్" అన్నారు. (నలుపు వర్ణం గల హబషీ స్త్రీ కొడుకువు అని). ఈ విషయాన్ని హజ్రత్ బిలాల్ (రజి) దైవప్రవక్త (సఅసం) సమ్ముఖంలో విన్నవించుకున్నారు. ప్రవక్త (సఅసం) హజ్రత్ అబూజర్‌తో "నీవు ఇతని తల్లిని ఎత్తిపొడిచావా? దీన్నిబట్టి నీలో ఇంకా కొంచెం అజ్ఞానమున్నదని తెలుస్తున్నది" అని అన్నారు. అజ్ఞానం అంటే అదేదో లైంగిక సంబంధమైన చెడు విషయమని, అది యువకుల్లోనే ఉంటుందని భావించిన అబూజర్ (రజి), "హుజూర్! ఇంత పెద్ద వయస్సులోనా ఈ మాటలు!" అని అన్నారు. అందుకు ప్రవక్త (సఅసం), "ఇతడు నీ సోదరుడు" అన్నారు. అది విన్న హజ్రత్ అబూజర్ (రజి) ఎంతో పశ్చాత్తాపుడి దైవాన్ని క్షమాపణ వేడుకున్నారు. తన విచారాన్ని, బాధను వ్యక్తం చేయడానికి ఆయన తన ముఖాన్ని కాళ్ళతో తొక్కివేయమని హజ్రత్ బిలాల్ (రజి)ను అర్థించారు.

## రెండవ నిదర్శనం

మహాప్రవక్త (సఅసం) కాలంలో జరిగిన మరొక సంఘటన : మఖ్‌జూమ్ వర్గానికి చెందిన ఓ స్త్రీ దొంగతనం చేసింది. ఆమెను శిక్షించడానికి ప్రవక్త (సఅసం) వద్దకు తీసుకువచ్చారు. అది ఖురైష్ వారికి ఆందోళన కలిగించింది. ఎలాగైనా ఆ శిక్ష నుండి ఆమెను తప్పించడానికి ప్రవక్త (సఅసం) వద్దకు ఎవరినైనా పంపి సిఫారసు చేయాలని యోచించారు. ఉసామా బిన్ జయీద్ ప్రవక్త (సఅసం)కు అత్యంత ప్రీతిపాత్రుడు కావడం వల్ల ఈ పనికోసం అతణ్ణే పంపించాలని నిర్ణయించి సిఫారసు చేయడానికి అతణ్ణి ఒప్పించారు. ఆయన వెళ్ళి ప్రవక్త (సఅసం)తో మాట్లాడారు. అప్పుడు ప్రవక్త (సఅసం) ఎంతో ఆగ్రహంతో, "నీవు దేవుడు విధించిన హద్దుల విషయంలో సిఫారసు చేస్తున్నావా?" అని మందలించారు. తర్వాత ప్రజల్ని పిలిపించి ఈ విషయం గురించి ఓ గంభీర ఉపన్యాసం ఇచ్చారు. "మీకు పూర్వం

గతించిన జాతుల వినాశనానికి ఇటువంటి వైఖరే కారణం. వారు గొప్పగా భావించిన వారిలో ఎవరైనా దొంగతనం చేస్తే వారిని వదలివేసేవారు. బలహీన వర్గంలోని వారు దొంగతనం చేస్తే వారిని శిక్షించేవారు. దేవుని సాక్షిగా చెబుతున్నాను. ఒకవేళ ఫాతిమా బిన్తె ముహమ్మద్ (సఅసం) దొంగతనం చేస్తే నేను ఆమె చేతిని కూడా నరికివేస్తాను" అన్నారు ఆయన (స).

## మూడవ నిదర్శనం

ఖైస్ బిన్ మతావియ ఓ కపటి ముస్లిం. అతడు ఒక సమావేశంలోకి ప్రవేశించాడు. అక్కడ సల్మాన్ ఫార్సీ, సుహైబ్ రూమీ, బిలాల్ హబ్షీ (రిజ్వానుల్లాహ్ అలైహిం) కూడా ఉన్నారు. అప్పుడతడు, "ఔస్, ఖజ్రజ్ తెగలవారు ఆ వ్యక్తి (మహాప్రవక్త - సఅసం)కి సహాయం చేశారు. కానీ వీరికి (బిలాల్, సుహైబ్, సల్మాన్ - రజి) ఏమయిందో తెలియడం లేద"ని అన్నాడు. ఈ మాటలు వినగానే అక్కడున్న హజ్రత్ మఆజ్ బిన్ జబల్ (రజి) లేచి అతని చొక్కా పట్టుకుని లాక్కుంటూ దైవప్రవక్త (సఅసం) వద్దకు తీసుకొచ్చారు. అతడన్న మాటలన్నీ వినిపించారు.

అది విని దైవప్రవక్త (సఅసం) ముఖారవిందం ఎర్రగా మారిపోయింది. దుప్పటిని ఈడ్చుకుంటూ మస్జిద్-యె-నబవిలోకి వెళ్ళి "అస్సలాతు జామిఅహ్" అని ప్రకటించారు. (ఏదైనా అసాధారణ సమావేశం కోసం అలా ప్రకటించడం జరుగుతుంది) ఆయన (సఅసం) ప్రసంగిస్తూ అన్నారు, "ఓ ప్రజలారా! మీ ప్రభువు ఒక్కడే, మీ జాతి మూల పురుషుడూ ఒక్కడే, మీ ధర్మం కూడా ఒక్కటే. (ఇబ్నె అసాకర్ జహ్రీ ద్వారా ఈ వివరణ ఇచ్చారు. ఈ వివరణ మిగిలిన భాగం ఏమంటే, "అరబీదనం తండ్రిద్వారా లేదా, తల్లి గర్భాన జన్మించినంత మాత్రాన రాదు. అదొక భాష. దాన్ని ఎవరు మాట్లాడితే అతడే అరబ్బీయుడవుతాడు.)

## నాలుగవ నిదర్శనం

హజ్రత్ అదీ బిన్ హాతిమ్ తాయి ఇస్లాం స్వీకరించకముందు ఒకసారి మదీనా వచ్చారు. అప్పుడు దైవప్రవక్త (సఅసం) చుట్టూ సహాబీలు కూర్చొని ఉన్నారు. వారు ఏదో యుద్ధం నుండి అప్పుడే తిరిగి వచ్చారు. అప్పటికింకా వారు ఆయుధాలు దించలేదు. వారి హృదయాల్లో దైవప్రవక్త (సఅసం) పట్ల వినయ విధేయతలు, అపరిమితమయిన గౌరవమర్యాదలను చూసి అదీ బిన్ హాతిమ్ అత్యంత

ప్రభావితులయ్యారు. ఆ సమయంలో మదీనాలోని ఓ అనాధ స్త్రీ ఆయన వద్దకు వచ్చి, "ఓ దైవప్రవక్తా! మీతో ఏకాంతంలో మాట్లాడదలిచానని" అన్నది. అలాగే, మదీనాలోని ఏ వీధిలోకయినా సరే, నడిచివచ్చి నీ మాటలు వినడానికి సిద్ధంగా ఉన్నానన్నారాయన (స). తర్వాత లేచి ఆమె వెంట కొంచెం దూరం వెళ్ళి చాలాసేపు ఆమె చెప్పేదంతా విని తిరిగి వచ్చారు. హజ్రత్ అదీ ఊహకందని ఆ మానవ మైత్రి దృశ్యాన్ని చూసి అత్యంత ప్రభావితుడై ముస్లిం అయిపోయారు.

## అయిదవ నిదర్శనం

21 సంవత్సరాలపాటు తీవ్రమైన ఒడిదుడుకులు ఎదుర్కొన్న తర్వాత మహాప్రవక్త (సఅసం) మక్కాను జయించారు. ఆయన (సఅసం)ను తిరస్కరించిన వారు, ఆయనను ఇంటినుండి వెళ్ళగొట్టినవారు, ఆయనతో పోట్లాడినవారు, ఇప్పుడాయన (సఅసం) సమక్షంలో నిలబడి ఉన్నారు. ఆ తరుణంలో కూడా ఆయన (సఅసం) వారి ముందు అదే సందేశాన్ని, అదే నియమాలను ఉంచారు వేటినయితే కాలి నడకతో తిరిగి తిరిగి మక్కా లోయల్లో, పర్వత స్థానువుల్లో ప్రబోధించారో లేక మదీనా అధినేతగా ఆయన ఏ విషయాలనయితే బోధించారో వాటినే హితవుచేశారు. ఇస్లామీయ చరిత్రలో ఆయన ఓ నవనాగరికతకు అంకురార్పణ చేస్తున్న సమయమది. సంపూర్ణ విజయం సాధించకముందు నుండే ప్రబోధిస్తూ వస్తున్న సూత్రాల్ని స్థాపించే ప్రకటన చేస్తూ నేడు ఆయన (సఅసం) కాబా గృహ ద్వారం ముందు నిల్చుని ఇలా అన్నారు :

"ఓ ఖురైషు ప్రజలారా! నేడు ఏకేశ్వరుడయిన అల్లాహ్ మీ అజ్ఞాన శక్తుల్ని, మీ తాతముత్తాతల వంశ గర్వాన్ని, అహంభావాన్ని రూపుమాపుతున్నాడు, జ్ఞాపకముంచుకోండి! సర్వమానవులు ఆదం (అ) సంతానం. ఆదం మట్టితో సృష్టించబడ్డారు."

అరేబియాలో తిరుగులేని అధికారం, సమాజంలో ఎనలేని గౌరవప్రతిష్టలు కలిగి ఉన్నామనుకుంటున్న ఖురైష్‌వారు తలలు వంచి మౌనంగా వింటున్నారు. ఆ సమయంలో దైవప్రవక్త (సఅసం) అనుదినం పఠించే పవిత్ర ఖుర్ఆన్ ఆయత్‌ను వినిపించారు.

**"మానవులారా! మేము మిమ్మల్ని ఒకే పురుషుని నుండి, ఒకే స్త్రీ నుండి**

**సృజించాము. తరువాత మీరు ఒకరినొకరు పరిచయం చేసుకునేందుకు మిమ్మల్ని జాతులుగానూ, తెగలుగానూ చేశాము. వాస్తవానికి మీలో అందరి కంటే ఎక్కువ భయభక్తులు కలవాడే అల్లాహ్ దృష్టిలో ఎక్కువ గౌరవపాత్రుడు."**

***(అల్ హుజురాత్ : 13)***

## ఆరవ నిదర్శనం

ఖలీఫా హ|జత్ అబూబక్ర్ (రజి) కాలమది. మానవత్వం మూర్తీభవించిన హృదయమున్న మానవుడాయన. ధర్మ యుద్ధంలో ఎందరో ముజిహాద్‌లు అమరగతి పొందారు. ఆయన మహోన్నతమైన ఖిలాఫత్ స్థానంలో ఉన్నప్పటికీ అమరగతి పొందిన యోధుల అనాథ బాలికలను చూడటానికి వీధుల్లోకి వచ్చి వారికి వారి మేకల పాలు పితికి ఇస్తూ, "ఈ ఖిలాఫత్ బాధ్యత నేను పూర్వం నుండి చేస్తూ వస్తున్న ఈ సేవకు అడ్డురాదనే నమ్ముతున్నానని" అన్నారు.

## ఏడవ నిదర్శనం

హ|జత్ ఉమర్ (రజి) అత్యున్నత వ్యక్తిత్వం గల ఖలీఫా. ఆయన బలహీనులకు వృద్ధులకు సేవచేశారు. న్యాయప్రియులు ఆయన దృష్టిలో అందరూ సమానులే. ప్రజల ఆకలిని తీర్చేందుకు స్వయంగా ఆయన పస్తులున్నారు. తనవద్ద ఏమీ మిగిల్చుకోకుండా ఉన్నదంతా ప్రజాసేవకే వెచ్చించారు. ఆయన ప్రజల గృహాలు, నివాస స్థలాన్ని సందర్శించి స్వయంగా వారి స్థితిగతుల్ని తెలుసుకునేవారు. ఈ విషయంలో ఆయనకు ఆయనే సాటి.

ఉదాహరణకు ఓసారి అంగడి వద్ద ఓ వృద్ధుడు యాచించడం చూసి ఆ వృద్ధుణ్ణి మీరెవరని అడిగారాయన. "నేను ముసలివాణ్ణి, జిజియా పన్ను ఇవ్వడానికి, జీవిత అవసరాలు తీర్చుకోవడానికి, నేనిలా యాచిస్తున్నాను" అని బదులిచ్చాడు ఆ వృద్ధుడు. అతడు మదీనాలో నివసిస్తున్న యూదుల్లో ఒకడు. అది విని ఆయన ఏమంటారో చూడండి :

"ఓ వృద్ధుడా! మేము నీ పట్ల న్యాయం చేయలేదు. నీవు యువకునిగా ఉన్నప్పుడు మేము నీ వద్ద జిజియా (పన్ను) వసూలు చేశాము. కాని నీ వృద్ధాప్యంలో నిన్నిలా దీనస్థితిలో వదలిపెట్టాము" అంటూ అతని చెయ్యిపట్టుకుని ఇంటికి తీసుకెళ్ళారు. స్వయంగా వంటచేసి తినిపించారు. తర్వాత బైతుల్ మాల్ కోశాధికారితో

"ఈ వ్యక్తికీ, ఇంకా ఇలాంటి వారందరికీ వారి భార్యాపిల్లలకు సరిపడే రోజువారి భత్యాన్ని ఏర్పాటు చేయండి" అని ఆజ్ఞాపించారు.

## ఎనిమిదవ నిదర్శనం

హ॥జత్ ఉమర్ (రజి) మదీనాలో ఓ వీధిగుండా వెళుతున్నారు. ఓ బక్కపలచని బాలిక పడుతూ లేస్తూ పోతుండటం చూశారాయన.

"పాపం ఈ అమ్మాయి దీనావస్థలో ఉంది! అసలెవరీమె? మీలో ఎవరైనా ఆమెను ఎరుగుదురా?" అన్నారు.

అప్పుడు దగ్గరలో నిలుచున్న హ॥జత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) "అమీరుల్ మూమినీన్! మీరు ఈ అమ్మాయిని ఎరుగరా?" అని అడిగారు.

హ॥జత్ ఉమర్ (రజి) "లేదు" అన్నారు.

హ॥జత్ అబ్దుల్లాహ్ : "ఈమె మీ అమ్మాయే"

హ॥జత్ ఉమర్ : "మన అమ్మాయిల్లో ఎవరీమె?"

హ॥జత్ అబ్దుల్లాహ్ : "ఈమె నా ఫలానా కూతురు (మీ మనుమరాలు)"

హ॥జత్ ఉమర్ : "అయితే ఈమెకు పట్టిన ఈ దురవస్థ ఏమిటి?"

హ॥జత్ అబ్దుల్లా : "మీ దగ్గరున్న దాంట్లో మాకు ఏమి ఇవ్వరు కదా, ఆ పేదరికమే ఆ అమ్మాయిని ఈ స్థితికి తెచ్చింది."

హ॥జత్ ఉమర్ (రజి) : "దైవం సాక్షిగా చెబుతున్నాను. ఒక సాధారణ ముస్లింకిచ్చే ఉపకార వేతనం కంటే అధికంగా మీకిచ్చేందుకు నా వద్ద ఇంకేమీ లేదు. మీ అవసరాలు తీరినా తీరకపోయినా సరే, మీకు నాకు మధ్య తీర్పు ఇచ్చే దైవగ్రంథం ఉంది."

## తొమ్మిదవ నిదర్శనం

ఒకసారి ఓ వ్యాపార బృందం మదీనా వచ్చింది. అందులో పిల్లలు, స్త్రీలు కూడా ఉన్నారు. హ॥జత్ ఉమర్ (రజి), "మీరు ఈ రాత్రి వారికి రక్షణ ఇవ్వగలరా?" అని హ॥జత్ అబ్దుల్లాహ్ బిన్ ఔఫ్ (రజి)ను అడిగారు. ఆ ఇద్దరు కలిసి ఆ రాత్రంతా మేల్కొని ఆ వ్యాపార బృందానికి రక్షణ కల్పిస్తున్నారు. ఆ సమయాన ఇద్దరూ తహజ్జుద్ నమాజ్ కూడా చేసుకున్నారు.

ఇంతలో హ్రజత్ ఉమర్ (రజి)కు ఒక పిల్లవాడు ఏడ్వడం వినిపించింది. అది భరించలేక ఆయన అక్కడకు వెళ్ళి ఆ పిల్లవాని తల్లితో అన్నారు, "దైవానికి భయపడు, పిల్లవాణ్ణి బాగా చూసుకో" అని చెప్పి తిరిగి వచ్చారు. మళ్ళీ పిల్లవాని ఏడుపు వినిపించింది. ఆయన మళ్ళీ వచ్చి ఆ తల్లితో "దేవునికి భయపడు, పిల్లవానికి ఏం కావాలో చూడు" అన్నారు.

తిరిగి తెల్లవారురుఝాముున పిల్లవాడు మళ్ళీ ఏడ్చాడు. ఆయన మరలా ఆ తల్లి వద్దకు వచ్చి "నీ ఈ వైఖరివల్ల నాకు విచారం కలుగుతున్నది. నీవు చాలా చెడ్డ తల్లిలా కనపడుతున్నావు. పిల్లవాడు రాత్రంతా ఎందుకలా ఏడ్చాడ"ని ప్రశ్నించారు.

ఆ వ్యక్తి ఖలీఫా అన్న సంగతి ఆవిడకు తెలియదు. అందుకని ఆమె తన సహజ ధోరణిలో "ఓ దైవదాసుడా! నీవు రాత్రంతా నన్ను వెన్నాడుతున్నావేమిటి? నేను బలవంతంగా పిల్లవానికి పాలు మాన్పిస్తున్నాను. అయినా వాడు పాలు త్రాగడం మరవడం లేదు" అన్నది.

"అలా ఎందుకు చేస్తున్నావు?" అడిగారాయన.

"ఎందుకంటే ఖలీఫా హ్రజత్ ఉమర్ (రజి) కేవలం పాలు విడిచిన పిల్లవానికే రోజు వారి భత్యం మంజూరు చేస్తారు కదా?" అన్నదామె.

"ఇప్పుడు పిల్లవాని వయస్సెంత?"

"కొన్ని నెలలు మాత్రమే" అని జవాబిచ్చింది.

"అయితే పిల్లవానికి పాలు విడిపించడంలో తొందర చేయకు (అని చెప్పి వెళ్ళిపోయారు హ్రజత్ ఉమర్ (రజి).

ఆయన ఉదయం నమాజు అత్యంత బాధాతప్త హృదయంతో చేయించారు. అందువల్ల ప్రజలు "ఖిరాత్" సరిగా వినలేకపోయారు. నమాజ్ ముగిసిన తర్వాత ఆయన ఎంతో బాధతో విశ్వాసుల పిల్లల్ని హతమార్చిన ఉమర్ నాశనమైపోవాలి" అన్నారు. ఆ తరువాత కేవలం భత్యం కోసం పసిపిల్లల్ని పాలు విడిపించరాదని, ఈ రోజు నుండి మేము ప్రతి పిల్లవానికి రోజు వారి భత్యం ఏర్పాటు చేస్తున్నామని ప్రకటించారు. ఈ మేరకు దేశం నలుమూలలా ఓ బహిరంగ ప్రకటన చేయించారు.

## అనుపమానమయిన ఆదర్శం

యావత్ మానవ చరిత్రలో మనకు ఇటువంటి అనుపమానమయిన ఆదర్శం

కానరాదు. ప్రపంచ సర్వ నాగరికతల్లో హజ్రత్ ఉమర్ (రజి) వంటి ఆదర్శం ఏ నాగరికతలోను లేదు. ఖైసర్, కిస్రాల మహాసామ్రాజ్యాలను జయించిన మహోన్నతమైన అధిపత్యం కలిగిన అమీరుల్ మోమినీన్ వ్యాపార బృందం నిద్రిస్తుండగా స్వయంగా మేల్కొని దానికి కాపలాకాశారు. ఈనాడు ఓ వర్గాన్ని సంరక్షించేందుకు నియమించబడిన ఓ సిపాయి కూడా చేయలేని కార్యాన్ని అలా ఆయన చేసి చూపించారు.

ఆయన మూడుసార్లు పిల్లవాణ్ణి సుఖంగా నిద్రపుచ్చమని ఆ తల్లిని సున్నితంగా మందలించారు. ప్రయాణీకుల పిల్లలపట్ల ఉమర్ (రజి) చూపిన ప్రవర్తన వలె ఎవరు చేసి చూపించగలరు? మానవ చరిత్రలోని ఉన్నతమైన వ్యక్తిత్వాలలో హజ్రత్ ఉమర్ (రజి) వంటి మహోన్నతమైన మానవతా పరిజ్ఞానం కలిగిన వారెవరుంటారు?

## పదవ నిదర్శనం

అంతేకాదు ఇస్లామీయ నాగరికతలో అంతకంటే కూడా అద్భుత సంఘటనలు ఉన్నాయి.

హజ్రత్ ఉమర్ (రజి) సేవకుడు అస్లమ్ ఏమంటున్నారో వినండి : "నేను ఒకసారి హజ్రత్ ఉమర్ (రజి)తో కలసి వెళ్ళాను. అలా మేమిద్దరం మదీనాకు చాలా దూరంగా వెళ్ళిపోయాము. దూరంగా ఉన్న గృహాలు, వాటిలో నివసించే ప్రజల స్థితిగతుల్ని మేము సేకరిస్తున్నాము. ఎక్కడో దూరాన ఒక మంట మండుతూ కనిపించింది. ఈ రాత్రి, చలివల్ల ఎవరో బాటసారులు విడిది చేశారని నా అనుమానం. అక్కడికి వెళదాం రా" అన్నారు హజ్రత్ ఉమర్ (రజి). పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ మేమక్కడికి వెళ్ళాము.

అక్కడ ఓ స్త్రీ తన పిల్లలతో కూర్చొని ఉంది. పొయ్యిమీద ఓ పాత్ర ఉంది. పిల్లలు ఏడుస్తున్నారు. హజ్రత్ ఉమర్ (రజి) సలాం చేసి, "మీరెలా ఉన్నారు? ఇక్కడ ఏం చేస్తున్నా"రని అడిగారు.

స్త్రీ : కటిక రాత్రి, ఆపైన చలి తీవ్రత వల్ల మేమిక్కడ ఆగిపోయాము.

హజ్రత్ ఉమర్ (రజి) : ఈ పిల్లలు ఎందుకలా ఏడుస్తున్నారు?

స్త్రీ : ఆకలివల్ల.

హజ్రత్ ఉమర్ (రజి) : ఈ పాత్రలో ఏముంది?

స్త్రీ : ఏముంటుంది, వట్టి నీళ్ళు మాత్రమే. ఆకలికి అల్లాడిపోతున్న పిల్లల్ని ఊరడించటానికి అలా వంటచేస్తున్నట్లు నటిస్తున్నాను. అలాచేస్తే కొంతసేపటికి పిల్లలు వారంతటవారే మౌనంగా నిద్రపోతారు. ఇక మాకు, ఉమర్ (రజి)కు మధ్య తీర్పు దేవుడే ఇస్తాడు.

హజ్రత్ ఉమర్ (రజి) : అమ్మా, నీ విషయం ఉమర్‌కు ఎలా తెలుస్తుంది?

స్త్రీ : అలా అయితే మా బాగోగులు పట్టించుకోని ఆయన ఖలీఫా అయి గద్దెనెక్కి కూర్చోవడం ఎందుకు?

అస్లమ్ : ఇక పోదాం అంటూ ముందుకుపోయాం.

మేమిద్దరం గబాగబా నడుస్తూ పిండి గోదాం వద్దకు వచ్చాము. హజ్రత్ ఉమర్ ఓ సంచిలో పిండి, క్రొవ్వుతో నిండిన ఓ బుట్ట తీసుకొని, "అస్లం! ఈ మూట ఎత్తి నా భుజాన పెట్టు" అన్నారాయన.

"నేను తీసుకువస్తాను పదండి అన్నాను" "మరి ప్రళయదినాన కూడా నా భారాన్ని నీవే మోస్తావా?" అని కోపంతో గద్దించారు. చేసేదిలేక నేను మౌనంగా ఆ సామగ్రి మూటను ఆయన భుజం మీద పెట్టాను.

త్వరత్వరగా వచ్చి ఆ సామగ్రిని ఆ స్త్రీ ముందుంచాము. కొంచెం పిండితీసి దీన్ని నీవు పిసుకుతూ ఉండు, నేను మంట రాజేస్తానంటూ పొయ్యి ఊదడం మొదలెట్టారు. ఆయనది గుబురు గడ్డం, ఆ గడ్డంలోంచి పొగ తెరలుతెరలుగా రావడం నేను చూశాను.

"భోజనం తయారయింది. ఏదైనా తీసుకురా, వడ్డిస్తా" నన్నారాయన. ఆ స్త్రీ ఓ పళ్లెం తీసుకొచ్చింది, ఆ పాత్రలోనిదంతా ఆ పళ్లెంలో వంచేసి ఆ స్త్రీతో "నీవు పిల్లలకు తినిపిస్తూ ఉండు, నేను గాలి విసురుతూ దాన్ని చల్లబరుస్తుంటా"నన్నారు.

అలా అందరూ తిని త్రాగేవరకు ఆయన అలాగే కూర్చుని ఉన్నారు.

తరువాత మిగిలించి అక్కడే వదిలేసి లేచారు. నేను కూడా ఆయనతో పాటు లేచి నిలుచున్నాను. అప్పుడా స్త్రీ "దేవుడు మీకు మేలు చేయుగాక! అమీరుల్ మూమినూన్ కంటే ఖలీఫా పదవికి మీరే అర్హులు"ని అన్నది.

"నీవు నీ నోటి నుండి శుభాశీస్సుల్నే పలుకుతూ ఉండు. రేపు నీవు అమీరుల్ మూమినీన్ వద్దకు వస్తావు కదా! దైవం తలిస్తే నీవు నన్నక్కడ చూస్తావు" అంటూ

హ(జ్రత్ ఉమర్ (రజి) కొంచెం దూరం వెళ్ళి మళ్ళీ వెనుతిరిగి వచ్చి వారున్న చోటుకు కొంచెం దూరంలో దాగుకొని చూడసాగారు.

## పదకొండవ నిదర్శనం

సానుభూతి, సమానత్వం గురించి మానవ చరిత్రలో మరో మహోజ్వల సంఘటన :

అది రాత్రివేళ, రాత్రుల్లో గస్తీ తిరుగుతూ ప్రజల స్థితిగతుల్ని తెలుసుకోవడం హ(జ్రత్ ఉమర్ (రజి)కు అలవాటు. అలా ఓ రాత్రి మదీనాలోని ఒక లోయగుండా వెళుతున్నారాయన. అకస్మాత్తుగా ఓ గుడారం నుండి ఎవరో ఏడ్వడం వినిపించింది. ఆ గుడారం ముందు ఓ పురుషుడు నిలుచుని ఉన్నాడు. హ(జ్రత్ ఉమర్ (రజి) అతనికి సలాం చేసి, "మీరు ఎవరు" అని అడిగారు. "నేను ఓ పల్లెవాసిని, అమీరుల్ మూమినీన్‌ను సహాయమర్థించడానికి ఇక్కడకు వచ్చాను" అన్నాడావ్యక్తి.

"అయితే, ఈ ఏడ్పులేమిటి?" అడిగారు ఉమర్ (రజి).

"మీకెందుకండీ? మీ దారిన మీరు పోండి. మీకు సంబంధించని విషయాల్లో తలదూర్చకండి" అన్నాడా వ్యక్తి.

ముఖాముఖి అమీరుల్ మూమినీన్‌తోనే సంభాషిస్తున్నానన్న సంగతి పాపం అతనికేం తెలుసు? ఉమర్ (రజి) బలవంతం చేయగా అతడన్నాడు, "నా భార్య పురిటి నొప్పులతో బాధపడుతోంది. ఆమె వద్ద ఎవ్వరూ లేరు." ఈ మాట విన్న వెంటనే హ(జ్రత్ ఉమర్ (రజి) పరుగు పరుగున ఇంటికి వచ్చి తన సతీమణి ఉమ్మె కుల్సూమ్ బిన్తె అలీ (రజి)తో "దేవుడు నీ కోసం ప్రత్యేకించిన ఓ పుణ్యకార్యాన్ని శ్రద్ధతో నిర్వహించగలవా?" అన్నారు.

"ఏమిటండి అది?" అడిగిందామె.

అప్పుడు హ(జ్రత్ ఉమర్ (రజి) విషయమంతా చెప్పి పుట్టబోయే పసికందుకు బట్టలు, పురుడుపోయడానికి కావలసిన వస్తు సామగ్రితో పాటు ఆహార పదార్థాలు, నెయ్యి కూడా తీసుకుపోదామన్నారు. ఆ మహాసాధ్వి అన్నీ సమకూర్చి మూటగట్టి తెచ్చింది. దాన్ని భుజాన వేసుకొని ఆయన ముందు, వెనుక సతీమణి అనుసరిస్తుండగా సాగిపోయారు. ఇద్దరూ గుడారం వద్దకు చేరుకున్నారు. "నీవు గుడారంలోనికి వెళ్ళ"మని చెప్పి హ(జ్రత్ ఉమర్ ఆ పురుషునితో బయట కూర్చున్నారు.

మంట రాజేసి తమతో తెచ్చిన పదార్థాలతో వంట ప్రారంభించారాయన. అప్పటి వరకు ఓ ప్రపంచంలోనే మహా మనిషి ప్రక్కన కూర్చున్నాననన్న విషయం ఆ పల్లెవాసికి తెలియదు. ఇంతలో గుడారంలో పిల్లవాడు జన్మించాడు. ఉమ్మె కుల్సూమ్ (రజి) లోపలి నుండి "అమీరుల్ మూమినీన్! మీ స్నేహితునికి బాబు పుట్టాడన్న శుభవార్త వినిపించండ"ని అన్నారు.

ఈ మాటలు వినగానే ఆ గ్రామీణునికి ముచ్చెమటలు పోశాయి. ఖలీఫా పట్ల తను ప్రవర్తించిన తీరు గుర్తుకు రాగానే అక్కడ నుండి మెల్లిమెల్లిగా జరగడం మొదలెట్టాడా వ్యక్తి. అది గమనించి హజ్రత్ ఉమర్ (రజి) "భయం దేనికి? అలాగే స్వేచ్ఛగా కూర్చో"మని చెప్పి స్వయంగా భోజనం సిద్ధం చేశారు. అటు బాలింతకు అన్నం తినిపించమని తన సతీమణికి చెప్పారు.

ఆ బాలింత భోంచేసిన తర్వాత హజ్రత్ ఉమర్ (రజి) మిగిలిన దాన్ని ఆ పల్లెవాసి ముందుంచి, "భోంచేయ్, ఎంతో బాధను భరిస్తూ రాత్రంతా మేల్కొని ఉన్నావు. రేపు మీరు మా వద్దకు రండి. మేము మీ అవసరాలు తీర్చే ఏర్పాటు చేస్తాము" అని చెప్పారు. వారు ఉదయం వెళ్ళగానే పిల్లవానికి దిన భత్యం ఏర్పాటు చేశారు ఖలీఫా. అతనికి కూడా చక్కని పారితోషికమిచ్చి పంపించారు.

## వీటికి సరితూగే సంఘటనలున్నాయా?

నాకు తెలిసినంత వరకు మానవ చరిత్రలోగాని మహా పురుషుల జీవిత చరిత్రల్లోగాని ఇటువంటి మహోజ్వలమైన సమానత్వ భావనగల ఒక్క సంఘటన కూడా కానరాదని సాక్ష్యాధారాలతో చెప్పగలను.

అమెరికా విముక్తికారుడయిన జార్జి వాషింగ్టన్ గురించి ఓ సంఘటన ప్రఖ్యాతిగాంచింది. ఆయనొకసారి రోడ్డెంబడి వెళుతున్నారు. కొందరు సిపాయిలు, ఓ పెద్ద రాతి బండను ఎత్తడానికి ప్రయత్నిస్తుండగా చూశారాయన. అది వారికి కదలడం లేదు. వారి పైఅధికారి అక్కడే నిల్చుండి చూస్తున్నాడే కాని సహకరించడం లేదు. అప్పుడు వాషింగ్టన్, "బ్రదర్! వారికి కాస్త చేయూత ఇవ్వండి" అని అధికారితో అన్నారు. అందుకా అధికారి అలా చేయడం నా స్థాయికి అవమానకరమని చెప్పి సహకరించడానికి తిరస్కరించాడు. వాషింగ్టన్ తన శాలువను ప్రక్కన పెట్టి బండను ఎత్తడంలో వారికి సహకరించారు. తర్వాత సిపాయిలతో "మీకు ఎప్పుడైనా ఇలాంటి

కష్టాలు ఎదురయితే నా చిరునామ తెలుసుకొని మా ఇంటికి రండ"ని చెప్పి వెళ్ళిపోయారు.

నిస్సందేహంగా ఉన్నత నైతిక ప్రవర్తనకు ఇదొక ఉదాహరణ.

హజ్రత్ ఉమర్ (రజి) రాత్రివేళ తన నిద్రను, సౌఖ్యాన్ని త్యజించి ప్రజల స్థితిగతులను విచారించడానికి బయలుదేరారు. అప్పుడాయనకు ఓ నిండు చూలాలు పురిటి నొప్పులతో బాధపడుతున్నదని, ఆమెకు సహకరించేందుకు ఎవ్వరూ లేరని తెలిసింది. వెంటనే ఇంటికి వచ్చి తన సతీమణిని వెంట తీసుకొని, ఆహార పదార్థాలను స్వయంగా మోసుకువెళ్ళారు. సతీమణి బట్టలు, ఇతర సామగ్రి పట్టుకుని భర్తను అనుసరించారు. మన పరిభాషలో రాణి అయిన ఆయన సతీమణి సేవిక పాత్రను, స్వయంగా ఆయన వంటవాని పాత్రను నిర్వహించారు.

మానవ చరిత్రలో ఇంతటి మహోన్నతమైన ఉదాహరణ ఇంకొకటి ఉందా? ఈ భూగోళంపైన ఇప్పటి వరకు ఏ ప్రభుత్వాధినేత కూడా అంతటి మహోన్నతమైన శిఖరానికి చేరుకోలేదు. హజ్రత్ ఉమర్ (రజి) నిర్వహించిన ఉన్నత కార్యాల్లో ఇదొకటి. ఇస్లామీయ నాగరికతలోని మహోజ్వలమైన అంశం ఇది. ప్రపంచ నాగరికతల్లో ఇస్లామీయ నాగరికత మొదటి స్థానంలో ఉన్నట్లుగానే ఆ నాగరికత ఉమర్ (రజి) వంటి ఎడారివాసిని మానవ చరిత్ర మహా పురుషుల్లో అత్యున్నత పీఠాన్ని అలంకరించేలా మలచివేసింది.

## ఎందరెందరో!

ఇక్కడ ఇంకో విషయాన్ని విశదపరచడం అవసరం. అదేమంటే, ఇస్లామీయ సంస్కృతి పరిపూర్ణతలో, మూర్తీభవించిన మృదు హృదయంతో ఏకైక వ్యక్తిగా అల్లాహ్ హజ్రత్ ఉమర్‌నే సృష్టించలేదు, హజ్రత్ అబూబక్ర్ సిద్దీఖ్, హజ్రత్ ఉస్మాన్, హజ్రత్ అలీ (రిజ్వానుల్లాహ్ అన్‌హుమ్) లను కూడా పుట్టించాడు. వారి జీవితాలు కూడా పరిపూర్ణ మానవతా మూర్తులుగా మలచబడ్డాయి. అంతేకాదు, హజ్రత్ ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్, సలాహుద్దీన్ అయ్యూబి (రహ్మ.అలై) మొదలగు గొప్ప గొప్ప వ్యక్తిత్వాలు, విద్వాంసులు, ఫికాహ్‌వేత్తలు, తాత్వికులు, నాయకుల జీవితాలలో కూడా అసంఖ్యాక మైన ఉదాహరణలు కనబడతాయి. అవి జీవిత సర్వాంశాల్లో ఇస్లామీయ నాగరికత, సంస్కృతికి సజీవ నిదర్శనాలయి విరాజిల్లుతున్నాయి.

## సమానత్వం

ఇస్లామీయ సంస్కృతిలో మానవ మైత్రికి సంబంధించిన మరో కోణం ఏమిటంటే, అది మానవుల మధ్య వాస్తవమయిన సమానత్వ పునాదులను పటిష్ఠవంతం చేసింది. ఎవరి వర్ణం ఎలా ఉంది, ఎవరి వంశం ఎవరితో సంబంధముంది అన్న ప్రశ్న ఇస్లామీయ సంస్కృతిలో ఉదయించదు.

“వాస్తవానికి మీలో అందరికంటే ఎక్కువ భయభక్తులు కలవాడే అల్లాహ్ దృష్టిలో ఎక్కువ గౌరవపాత్రుడు.” (హుజురాత్ : 13) అని ఖుర్‌ఆన్ ప్రకటించింది. మహాప్రవక్త (సఅసం) హజ్జతుల్ విదా సమయాన చేసిన చారిత్రాత్మక ప్రసంగంలో ఈ వాస్తవాన్నే సూచించారు :

“సర్వ మానవులు ఆదం సంతానం, ఆదం మట్టితో సృష్టించబడ్డారు. అరబ్బుకు అరబ్బేతరునిపై, తెల్లవానికి నల్లవానిపై ఎలాంటి ఔన్నత్యం లేదు, దైవభీతి రీత్యా తప్ప.”

## కేవలం మాటల్లోనే కాదు

ఇది కేవలం మాటలు వల్లించడం వరకే పరిమితం కాలేదు. నేడు పాశ్చాత్యులు ప్రకటిస్తున్నట్లు ఇస్లామీయ సమతాభావాలు కేవలం ఓ ఆచారంగా వస్తున్నవి కావు. మనిషి నిజ జీవితంలోని విభిన్న పరిస్థితులలో క్రియాత్మకంగా ఆచరించే సంపూర్ణ సమానతలవి. అవి దైనందిన జీవిత వ్యవహారాల వలె ఆచరించబడేవి. వాటిపై ఎవరికి ఎలాంటి ఆశ్చర్యం కలిగేది కాదు. ఆ ఆచరించడంలో కూడా ఎలాంటి కాపట్యం గాని, నటన గాని ఉండేది కాదు.

కాబట్టే మస్జిద్‌లో దేవుని సమ్ముఖంలో నిర్మల హృదయంతో అత్యంత భక్తి శ్రద్ధలతో నిలబడే వారిలో ఈ సమానత్వం కనిపిస్తోంది. అక్కడ అన్ని వర్ణాలు, వర్గాలు, సంతతులవారు గుమిగూడి ఒకేచోట భుజం భుజం కలిపి దైవారాధన చేసేవారు. ఏ తెల్లవాడయినా తన పక్కన నల్లవాడయిన నీగ్రో ఎందుకు నిలుచున్నాడని రవ్వంత కూడా అసహ్యించుకొనేవాడు కాదు. ఇలాంటి సమానతలు హజ్‌లో కూడా చూడవచ్చు. విభిన్న జాతులు, తెగలవారు, ధనికులు, పేదవాళ్ళు, నల్లవాళ్ళు, తెల్లవాళ్ళు అంతా ఒకేచోట హజ్ విధుల్ని నిర్వహిస్తారు. ఒకే రకమయిన దుస్తులు ధరిస్తారు. తెల్లవారికి నల్లవారికి మధ్య ఎలాంటి భేదం, ఆధిక్యతలు ఉండవు.

మక్కా విజయోత్సవం సమయంలో మహాప్రవక్త (సఅసం) అబిసీనియా నీగ్రో హజ్రత్ బిలాల్ (రజి)ను కాబా గృహం పైకి ఎక్కి సత్యధర్మ ప్రకటన కోసం అజాన్ ఇవ్వమని ఆజ్ఞాపించడాన్ని కాలం తన కళ్ళతో చూసించింది. ఆలోచించాల్సిన విషయం ఏమంటే, కాబా దైవగృహం. అది అజ్ఞాన యుగంలో కూడా పవిత్ర ఆలయంగా పరిగణించబడి మహోత్కృష్ట స్థానంలో ఉండేది. ఇస్లాం కాలంలో కూడా అది ఖిబ్లాలాగా పరిగణించబడి ఔన్నత్యాన్ని పొందింది. కాని ఓ నీగ్రో బానిస దానిపైకెక్కి నిలబడడాన్ని కాలం చూసింది. ఇటువంటి అసమానమైన ఆదర్శం నేటి నాగరికతా ప్రపంచంలో కూడా ఎక్కడా కానరాదు.

దీనికి భిన్నంగా అమెరికాలో తెల్లవాళ్ళు, నల్లవాళ్ళు విడివిడిగా ఉంటున్నారు. అయితే ఇస్లాం పద్నాలుగు వందల సంవత్సరాలకు పూర్వమే సమానత్వాన్ని క్రియాత్మకంగా ఆచరించి చూపించింది. ఒక నీగ్రో హజ్రత్ బిలాల్ (రజి) కాబా గృహంపై ఎక్కడమంటే వాస్తవంగా మానవుడు విశ్వంలోని ప్రతి వస్తువుపై ఔన్నత్యం కలిగి ఉన్నాడని బహిరంగ ప్రకటన చేయడమే. మానవునికి ఈ గౌరవ ప్రతిష్ఠలు అతని విశ్వాసం, జ్ఞానం, నైతికత, బుద్ధి వివేచన వల్ల ప్రాప్తిస్తాయే కాని అతని వర్గం, వర్ణాల వల్ల వచ్చేవి కావు. ఆచరణ రీత్యా వెనుకకు నెట్టివేయబడ్డ ఏ మనిషిని అతని వర్గం ముందుకు తీసుకురాలేదు. అలాగే మేధస్సు, బుద్ధి కుశలత, విచక్షణా జ్ఞానం రీత్యా పైకి వచ్చిన ఏ మనిషిని అతని వర్ణం అతణ్ణి క్రిందికి నెట్టివేయజాలదు.

ప్రవక్త అనుచరులలో అగ్రగామి అయిన హజ్రత్ అబూజర్ గిఫారి (రజి) ఒకసారి తీవ్రమైన కోపంతో హజ్రత్ బిలాల్ (రజి)ను "ఓ హబషి స్త్రీ కొడుకా" అని సంబోధించి హేళన చేశారు. అప్పుడు మహాప్రవక్త (సఅసం), ఆయన ఆ ప్రవర్తన పట్ల కోపగించుకుంటూ, "నీలో ఇప్పటికీ అజ్ఞానపు వాసనలు పోలేదు. అందుకే నీవు అతని తల్లి నలుపు రంగు స్త్రీ అని ఎత్తిపొడిచి అతణ్ణి అవహేళన చేయతలచావు" అని తీవ్రంగా మందలించారు.

ఇక్కడే జ్ఞానం అజ్ఞానానికి మధ్య గీత గీయబడింది. ఇంకో మాటలో చెప్పాలంటే అది మానవుని వాస్తవిక సంస్కృతికి, అజ్ఞానయుతమైన నాగరికతకు మధ్య గీయబడిన గీత.

## మరో నిదర్శనం

ముస్లింలు ఈజిప్టుపై దాడిచేసిన రోజులవి. సైన్యాలు చాలా దూరం చొచ్చుకుంటూ బాబిలోన్ కోట వద్దకు చేరుకున్నాయి. అప్పుడు ఈజిప్టు పాలకుడయిన మఖూఖస్ ముస్లింలతో మాట్లాడి, వారికేమి కావాలో తెలుసుకోవడానికి ఓ ప్రతినిధి వర్గాన్ని పంపించాడు. ముస్లింలు కూడా తమ ప్రతినిధి వర్గాన్ని పంపించమని కోరాడు. అప్పుడు హజ్రత్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) పదిమంది సభ్యులుగల ప్రతినిధి వర్గాన్ని అతని వద్దకు పంపించారు. ఆ వర్గానికి హజ్రత్ ఉబాద ఇబ్నె సామిత్ (రజి) నాయకుడు, ఆయనే మఖూఖస్‌తో చర్చలు జరపాలని నిర్ణయించారు.

హజ్రత్ ఉబాద (రజి) చాలా నల్లగా, పొడుగ్గా ఉంటారు. ముస్లిం ప్రతినిధి వర్గం మఖూఖస్‌ను కలుసుకోవడానికి వెళ్ళింది. హజ్రత్ ఉబాద (రజి)తో చర్చలు జరపడానికి ముందుకు రాగా, ఆయన రూపురేఖల్ని, ఆకారాన్ని చూడగానే మఖూఖస్‌కు భయం ఆవరించింది. అతడు ప్రతినిధి వర్గం సభ్యులతో, దేవుని కోసమైన ఈ నల్లవ్యక్తిని నాకు దూరంగా ఉంచి నాతో సంభాషించడానికి మరొక వ్యక్తిని పంపించండని పలికాడు.

అప్పుడా బృందంలోని సభ్యులందరూ ఏక కంఠంతో "ఈయన జ్ఞానంలో, వివేచనలో, దూరదృష్టిలో ఏదైనా సలహాల నివ్వడంలో మాకంటే ఎంతో మిన్న. ఈయన మా నాయకుడు. మేమందరం ఈయన నిర్ణయం, అభిప్రాయాలతోనే ఏకీభవిస్తున్నాము. అంతేకాకుండ మా అమీరు ఈయనకు కొన్ని ప్రత్యేక హితవులు చేసి ఉన్నారు. ఈయన అభిప్రాయాన్ని వ్యతిరేకించ కూడదని మమ్మల్ని ఆజ్ఞాపించారు" అని చెప్పారు. అందుకు మఖూఖస్ "మీరు ఈయన నాయకత్వాన్ని అంగీకరించారు. అసలీయన మీ క్రింద ఉండాల్సినవాడు, మీకెలా నాయకుడయ్యాడు" అన్నాడు. దానిపై బృందం సభ్యులు "అదెలా సాధ్యం? జ్ఞాన విచక్షణలో ఆయన మా కంటే మిన్న, సలహాల నివ్వడంలో దూరదృష్టిలో కూడ మాకంటే అధికుడే, ఇక నలుపు రంగు మాటకొస్తే అది మాలో ఎలాంటి దోషం కాద"ని సమాధానమిచ్చారు.

ఈ మాటలు విని, మఖూఖస్ నిరుత్తరుడయ్యాడు. హజ్రత్ ఉబాద (రజి)తో, "ఓ నల్లనివాడా! ముందుకు రా, మాట కొంచెం మృదువుగా మాట్లాడు. ఈ నీ నలుపు వర్ణం నా శరీరంలో వణుకు పుట్టిస్తున్నది. ఇక నీవు కరుకుగా సంభాషిస్తే నా భయం ఇంకా అధికమవుతుంది" అన్నాడు. హజ్రత్ ఉబాద బిన్ సామత్ (రజి)

మఖూఖస్ భయాన్ని చూసి, "సోదరా! మా సైన్యంలో నాకంటే కూడా అత్యంత నలుపు వర్ణం కలవారు ఇంకా వేయిమంది ఉన్నారు" అని తెలిపారు.

## ఇదొక్కటే కాదు

ఇస్లామీయ సంస్కృతిలో ఈ విషయం ఎంత మహోజ్వలమయినదో, మానవునికి ఈ సంస్కృతి ఎంతటి మహోన్నత స్థానాన్ని ప్రసాదించిందో ఆలోచించండి! ఆనాడు ప్రజలందరూ ఈ నలుపు రంగును దోషమనే భావించారు. (ఈనాడు 21వ శతాబ్దంలో కూడా ఆధునికులు దాన్ని దోషంగానే పరిగణిస్తున్నారు). వారిని ముందు వరుసలో కూర్చోబెట్టడం, విద్యా జ్ఞాన రంగాల్లో విశేష స్థానాన్ని కల్పించడం అటుంచి, అసలు వారిని మానవులుగానయినా పరిగణించే వారు కాదు. కాని ఇస్లామీయ సంస్కృతి ఆవిర్భవించి ఈ దుష్ట ప్రమాణాలన్నింటినీ తుడిచిపెట్టింది. దుష్ట ఆలోచనా దృక్పథాలన్నింటినీ ఏహ్యమైన దృష్టితో చూసింది. ఒక నల్లవాణ్ణి అతని జ్ఞానం, ఆలోచన సరళి సాహసం పైకి తీసుకురాగలిగితే ఇస్లామీయ సమాజం అతన్ని పైకి తీసుకురావడంలో ఎలాంటి కొరత చేయలేదు. ఒక్క హజ్రత్ ఇబాదా బిన్ సామత్ (రజి) ఏమిటి? ఇస్లామీయ సంస్కృతిలో నాయకత్వం, అధినాకత్వపు హోదాలు అలంకరించిన వారెందరినో ఉదాహరించవచ్చు.

## రెండవ నిదర్శనం

అబ్దుల్ మలిక్ బిన్ మర్వాన్ హజ్ సమయంలో అతా బిన్ అబీ రిబాహ్ తప్ప ఇంకొకరు "ఫత్వా" ఇవ్వకూడదని ప్రకటన చేయిస్తుండేవారు, అతా మక్కావాసుల నాయకుడు, పండితుడు, తత్వవేత్త. ఈ అతా ఆకారం, రూపురేఖలు ఎలాంటివో తెలుసా? అత్యంత నల్లగా, మెల్లకళ్ళ, కుంటికాలు, చప్పిడి ముక్కు రేగిన వెంట్రుకలతో చాలా అందవికారంగా ఉంటారు. ఆయన్ని చూస్తేనే భయం వేస్తుంది. ఆయన తన వేలాది శిష్యుల మధ్య కూర్చొని పాఠాలు బోధిస్తున్నప్పుడు తెల్లని పత్తి పొలంలో ఓ నల్లని పదార్థం ఉన్నట్లు అనిపిస్తుంది. కాని ఆ నలుపు రంగు, చప్పిడి ముక్కు గలవానికి ఇస్లామీయ సంస్కృతి అత్యుత్తమమైన ఇమామ్ స్థానాన్ని ప్రసాదించింది. ప్రజలు ఫత్వాల కోసం ఆయన చుట్టూ చేరేవారు. ఆయన వ్యక్తిత్వమే ఓ విద్యాలయం. సుందరాకారులైన వేలాది పండితులు, ఆచార్యులు ఆయన వద్ద పాఠాలు నేర్చుకున్నారు. వారి హృదయాల్లో ఆయన గౌరవనీయుడుగా, ప్రేమమూర్తిగా నిలిచిపోయారు.

## సమానత్వం

ఇస్లామీయ నాగరిక సమాజంలో జాతి రీత్యా నీగ్రోలు, నల్లవారు అయినా మేధావులు కూడా అనేకమంది విద్యా సాహిత్య రంగాల్లో వెలుగొందారు. అయితే వారి నలుపు వర్ణం వారికి విద్యా, సాహిత్య రంగాలలో ప్రగతి చెందకుండా ఏ మాత్రం అడ్డుపడలేకపోయింది. వారు ఆ కాలపు సునిశితమైన నైజం కల ఖలీఫాకు సయితం దీటుగా నిలబడ్డారు. ఫిఖా విద్వాంసులై ఇస్లామీయ విద్యా సాహిత్యంలో తిరుగులేని ఉద్గ్రంథాలు రచించారు.

ఉదాహరణకు ఉస్మాన్ బిన్ అలీ జీలయి హనఫీ ఫిఖాలో ప్రామాణికమైన షరీఅత్ గ్రంథాన్ని వ్రాసారు. జమాలుద్దీన్ అబూ ముహమ్మద్ అబ్దుల్లా బిన్ యూసుఫ్ అలీ జీలయి నసీబుర్రయ వంటి ప్రఖ్యాత ప్రామాణిక గ్రంథాన్ని రచించారు. వీరిద్దరూ అబిసీనియాలోని జీలా ప్రదేశానికి చెందినవారు. ఇక కాఫూర్ అఖ్‌సయిదీని ఎరుగని చరిత్రకారులుండరు. ఆయన నలుపు వర్ణం గల బానిస. హిజ్రీ నాల్గవ శతాబ్దంలో ఈజిప్టు పరిపాలకుడుగా ఉండేవారు. ఆయన పేరును ముత్‌నబీ తన హుజ్జూ, మదిహ్ గ్రంథాల ద్వారా శాశ్వతంగా నిలిచిపోయేలా చేసారు.

## వర్ణ విచక్షణ లేదు

క్లుప్తంగా చెప్పేదేమంటే ఇస్లామీయ సంస్కృతి నలుపు, తెలుపు వర్ణాల వారి మధ్య ఎలాంటి విచక్షణ, విభేదాలు పాటించలేదు. ఇస్లామీయ నాగరికతలో నల్లవాళ్ళని తెల్లవాళ్ళకు దూరంగా వేరుగా ఉంచడానికి ఎటువంటి వీధులుగాని, వాడలుగాని నిర్మించబడలేదు. తెల్లవాళ్ళు జరిపే అత్యాచారాలను, దౌర్జన్యాలను నోరు మూసుకొని భరించేలా వారి హక్కుల్ని ఏమాత్రం తగ్గించలేదు.

ఇస్లామీయ సంస్కృతే నిజమైన మానవ సంస్కృతి, దాని దృష్టిలో మానవత్వానికే విలువ ఉంది. ఇది సమస్త మానవుల్ని సత్యం, ధర్మం ఆధారంగా పరికిస్తుంది. దానికి కావలసింది ఆచరణలోని మంచే కాని నలుపు తెలుపు రంగులు కాదు.

**"ఎవరు రవ్వంత పుణ్యకార్యం చేసినా దానిని వారు చూసుకుంటారు. మరెవరు రవ్వంత చెడు కార్యం చేసినా వారు దానిని పొందుతారు."**

**(అజ్ జిల్ జాల్ : 7-8)**

## ప్రగతిశీల ప్రపంచం

గత యాభై సంవత్సరాల తర్వాత ఎలాగో తెలుపు నలుపు జాతుల్లో కేవలం వర్ణం కారణంగా విచక్షణ చూపడం తెలివి తక్కువనే వాస్తవం గుర్తించబడిందని అందరికీ తెలుసు. ప్రగతి చెందిన సంస్కృతి సమాజం అటువంటి నీచమైన ఆచారాన్ని భరించజాలదు. న్యాయం సమానత్వాల్లో ప్రపంచంలోని యావత్తు సంస్కృతులకంటే అత్యంత ఖ్యాతిపొంది, ప్రశంసించబడిన ఇస్లామీయ సంస్కృతిలో అలాంటి విషయానికి అణుమాత్రమయినా ఆస్కారం లేదు.

వివిధ రంగాల్లో ఎంతో అభివృద్ధి చెందిన ఈ యుగంలో ఐక్యరాజ్య సమితి నిర్మాణం, దాని మౌలిక హక్కుల చార్టర్ ప్రకటితమైనప్పటికీ మనకు ఇటువంటి సమస్యల మీద చర్చించే అవసరం తప్పడం లేదు. ఎందుకంటే దక్షిణాఫ్రికాలో నల్లజాతిపై జరుగుతున్న హింసాకాండ ప్రపంచ ప్రజలందరూ చూస్తున్నారు. ప్రతిరోజూ దాన్ని గురించి హృదయ విదారకమైన వార్తలు వింటూనే ఉన్నారు. కెన్యాలో సామ్రాజ్యవాదులు జరిపిన భయంకర అత్యాచారాలను ప్రపంచం ఇంకా మరచిపోలేదు. అమెరికాలోని నీగ్రోల దయనీయ గాథ అందరికీ తెలిసిందే. ఇంతకంటే ఆశ్చర్యకరమైన విషయం ఏమంటే, దక్షిణాఫ్రికాలో వర్ణ విభేదాన్ని పాటిస్తున్నవారు, కెన్యాలో నల్లజాతి వారిపై ఆర్థిక ఆంక్షలు విధించి హింసించినవారు, అమెరికాలో నీగ్రోలపై దారుణ అత్యాచారాలు సాగిస్తున్న వారందరూ భోగభాగ్యాలతో తులతూగే ఐరోపా ఆధునిక సంస్కృతికి చెందిన జాతుల ముద్దుబిడ్డలే. అభివృద్ధి నిరోధకుడని, నిరుపేదఅని, తెలివిహీనుడని అపహాస్యం చేసేందుకు వారిలో తూర్పు దేశాల జాతులకు చెందినవాడు ఒక వ్యక్తి కూడా లేడు. వారందరు ఐక్యరాజ్య సమితిలో చేరి ప్రఖ్యాతి చెందిన ప్రముఖ దేశాలవారే.

ఐరోపాలోని నేతిబీరకాయ సంస్కృతికి చెందిన ఈ ముద్దుబిడ్డలు తూర్పు దేశవాసులను ఎల్లప్పుడూ నిరుపేదలని, ప్రగతి నిరోధకులని, అసూయాపరులని అవహేళన చేస్తుంటారు. కాని వారు స్వయంగా చేస్తున్నదంతా ఏమిటో అందరికీ తెలుసు. ఏ ప్రభుత్వాధినేతలు ఇటువంటి కిరాతక చర్యలకు పాల్పడుతున్నారో వారు ఐక్యరాజ్య సమితిలో గొప్ప సమీక్షకులుగా విమర్శకులుగా లెక్కించబడుతున్నారు.

ప్రస్తుతం అమెరికా ఐక్యరాజ్య సమితిని పూర్తిగా తన అదుపులో పెట్టుకుంది. బ్రిటన్ ఐరోపాలో పెద్ద ప్రభుత్వం. దానికి తన ప్రజాస్వామ్యంపై మహా గర్వముంది.

కాని దక్షిణాఫ్రికా దాని వలస పాలనలో మగ్గిపోతోంది. దక్షిణాఫ్రికా కీలుబొమ్మ ప్రభుత్వం. ఆ ప్రాంతాలలోని ఐరోపా సామ్రాజ్యవాదులయిన తెల్లవారికి ఏజంటు. ఇప్పుడక్కడ అధికారం చెలాయిస్తున్నది కూడా నాగరిక ప్రపంచంలో ప్రధాన దేశంగా పరిగణించబడుతున్నదే. దక్షిణ అమెరికా కూడా సమితిలో ప్రధాన దేశమే. సమితిలోని వర్ధమాన దేశాల్లో దాని పలుకుబడే చెల్లుతుంది. నాగరికతా రథసారధులయిన ఈ ప్రభుత్వాలు సరిగ్గా ఈ ఇరువయ్యో శతాబ్దంలో మానవ చరిత్రలోనే అతి దారుణమయిన పాపకార్యం చేస్తున్నాయి. అదేమంటే స్వయంగా మానవుడు తన తోటి మానవునిపై హింస, దౌర్జన్యం, అత్యాచారం జరుపుతున్నాడు. అతను బలహీనుడని, అజ్ఞాని అని కాదు. కేవలం నల్లవాడయి ఉన్న కారణంగానే.

## అద్దంలో చూడండి

పశ్చిమ ఆఫ్రికా ప్రభుత్వం జాత్యహంకార విధానాన్ని అవలంబించింది. అది తెల్లవాళ్ళు, నల్లవాళ్ళ జాతులకు వేర్వేరు విధుల్ని నిర్ణయించింది. ఐక్యరాజ్య సమితిలో ఆసియాఫ్రికా కూటమి నిరంతరం నిరసన, వ్యతిరేకత వెలిబుచ్చుతున్నా అది ఆవగింజంత కూడా లెక్కచేయడం లేదు. బ్రిటన్, కెన్యాలోని స్వాతంత్ర్య ఉద్యమకారులపై విచ్చలవిడిగా అత్యాచారాలు జరుపుతోంది. వారిపై సామూహిక హత్యాకాండ సాగిస్తున్నది. అక్కడ క్రీ.శ. 1915లో విధించిన భూచట్టమే ఉండాలని బ్రిటన్ పట్టుబడుతోంది. దీని ప్రకారం 29వేల మంది తెల్లజాతి వారిని 40 లక్షల 55 వేల మంది ఆఫ్రికన్లకంటే మించి భూయజమానులుగా నిర్ణయించబడింది. ఆ దేశవాసులు, ఆ దేశ సంపదకు, అధికారానికి అసలు హక్కుదారులు ఆఫ్రికన్‌లే అయినా వారి ఇండ్లు, భూములు, ఉద్యోగాలపై తెల్లవాడి దాడి జరుగుతోంది.

మిస్టర్ "సీరాలీవెట్" కెన్యాలో మొట్టమొదటి సారిగా 1955లో నియమితుడైన అధికారి. ఒక ప్రకటనలో కెన్యా ప్రభుత్వ విధానమేమిటో ఇలా విపులీకరించాడు: "తమ రక్షణలో ఉన్న కెన్యా అంతర్గత పరిస్థితి ఏమంటే అక్కడి పూర్తి నేల తెల్లజాతుల వారికి కట్టబెట్టబడింది. ఒకవేళ మేము అలా స్పష్టంగా చెప్పకపోతే అది కపటమే అవుతుంది. కెన్యాలో తెల్లజాతి వారి ప్రయోజనాలకే అవకాశాలున్నాయి. కెన్యాలో రాజకీయం, దాని విధానం ద్వారా అక్కడ ఓ తెల్లవారి సామ్రాజ్యం స్థాపించబడబోతున్నదని స్పష్టంగా తెలుస్తున్నది. కెన్యాలోని పాశ్చాత్య అధికారులు అక్కడి భూములన్నీ తెల్లవారి అధీనమయ్యేలా, అక్కడి ఉత్పత్తులను, వాటి ప్రయోజనాలను

వారు తమ ఇష్టమొచ్చినట్లు అనుభవించేలా అనేక విధానాల్ని అవలంబిస్తున్నారు. అక్కడ వింత వింత భూచట్టాలున్నాయి. ఈ చట్టాల ప్రకారం అక్కడి యూరోపియన్లు ఒక్కొక్కరు దాదాపు 500 ఎకరాల భూమి పొందగలిగారు. అసలు యజమానులైన స్థానికులకు మాత్రం ఒక్కొక్కరికి కేవలం 8 ఎకరాలే దక్కింది. అంతేకాకుండా అక్కడ నల్లవాళ్ళను తెల్లవాళ్ళను వేర్వేరుగా ఉంచడానికి నల్లజాతి వారికి ప్రత్యేక ప్రాంతాలను ఏర్పాటు చేశారు. వారు ఎలాంటి పరిస్థితిలోనూ తెల్లవాళ్ళ ప్రాంతాలకు పోజాలరు. ఒకవేళ ఎప్పుడైనా తెల్లవాళ్ళు నల్లవాళ్ళతో అత్యవసర పనులు చేయించుకున్నా పని అయిపోగానే వారిని తిరిగి వారి వారి గుడిసెల వైపునకు తరిమి వేస్తారు. పైగా వారు చేసే శ్రమకు కూలి కూడా చాలా తక్కువగా ఇస్తారు. ఈ అవసరం లేకపోతే వారిని అటు తాత్కాలికంగానయినా తెల్లవాళ్ళ ప్రాంతాలకు వెళ్ళడానికి అనుమతి ఉండదు.

## అమెరికా కూడా అంతే

అమెరికాలోని నల్లజాతి వారి స్థితిగతుల్ని పరిశీలించినప్పుడు అతి దారుణమైన అత్యాచార సంఘటనలు వెలికి వస్తాయి. ఒక్కోసారి మనిషిని భయం ఆవరించి స్పృహ కోల్పోయే స్థితి కూడా ఏర్పడుతుంది. అమెరికాకు తన నాగరికత పట్ల మహా గర్వం ఉంది. అమెరికా చేరిన ప్రతి విదేశీయునికి న్యూయార్క్ ఓడ రేవులో స్వాతంత్ర్యానికి చిహ్నమైన ఓ విగ్రహం స్వాగతం పలుకుతూ కనబడుతుంది. ఆ విగ్రహం క్రింద ఇలా వ్రాయబడి ఉంది.

"మీ అనాథల్ని, బాధితుల్ని, పీడిత తాడిత ప్రజల్ని మాకు అప్పగించండి. ఇక్కడ వారు స్వేచ్ఛాయుత జీవితం గడపగలుగుతారు. ఎలాంటి బ్రతుకుతెరువు, దేశం లేని మీ తీరప్రాంత ప్రజా బాహుళ్యాన్ని నా వద్దకు పంపించండి. ఇదిగో స్వర్ణ ద్వారం దగ్గర కాగడాతో నిలుచున్నాను."

మానవ స్వేచ్ఛా ప్రియులు స్వాతంత్ర్య సూచన విగ్రహాలు సమస్త ఓడరేవుల్లో, నగరాల్లో ఉండగా నల్లజాతి వారిపై దారుణ హింసాకాండలు సాగడం ఆశ్చర్యం! ఇది మానవ చరిత్రలో క్షమించరాని ఘోర నేరం. ఈ సందర్భంలో మేము మా తరఫున ఏమీ చర్చించదలచలేదు. ఇవన్నీ చేస్తున్నది తనేనని ఆ జాతి అంగీకరిస్తున్నది. వాస్తవం ఏమంటే అక్కడ ఏమి జరుగుతున్నదో ఆలోచనతోనే జరుగుతున్నది. అమెరికా సెనెట్ సభ్యుడు జేమ్స్ బేరింజ్ ఇలా అంటాడు :

"దక్షిణాది దేశాల్లో జరుగుతున్న రీతిగా రాజకీయ సమానత్వం గురించిన ఆలోచన మనస్సులో కూడా రానిచ్చే హక్కు ఏ నల్లజాతివానికి లేదు. ఈ దేశం తెల్లజాతివారిది. ఇదే స్థితిలో అది ఎల్లప్పుడూ ఉంటుంది."

## నిలువెల్ల మచ్చలే!

అమెరికాలో నీగ్రోలపై అనేక రంగాలలో రకరకాల హింసాకాండ జరుగుతోంది. ఉదాహరణకు సాంస్కృతిక రంగాన్నే తీసుకుందాం. అమెరికాలో దాదాపు 20 రాష్ట్రాల్లో నల్లజాతివారికి తెల్లజాతివారితో కలిపి ఒకే పాఠశాలలోగాని, ఒకే విశ్వవిద్యాలయంలోగాని విద్య అభ్యసించడానికి అనుమతి లేదు. మిసిసిపి రాజ్యాంగంలోని సెక్షన్ 257లో ఇలా స్పష్టంగా వ్రాయబడి ఉంది :

"ఈ రంగంలో .... అంటే విద్యా శిక్షణ రంగంలో, తెల్లజాతి పిల్లలు, నల్లజాతి పిల్లలకు వేరుగా ఉండి విద్యనభ్యసించేందుకు ఏర్పాట్లు చేయబడుతాయి. దీనికోసం ఈ ఇద్దరి పాఠశాలలు వేర్వేరుగా ఉంటాయి."

ఫ్లోరిడా రాష్ట్రమైతే పాఠ్యపుస్తకాల్లో కూడా భేదముండడం అవసరమని భావించింది. తెల్లవాళ్ళ పిల్లలకు, నల్లవాళ్ళ పిల్లలకు బోధించబడే పాఠ్య పుస్తకాలు వేరువేరుగా ఉన్నాయి. అమెరికాలోని అన్ని రాష్ట్రాల్లో ఓ తెల్లవాడు ఓ నల్లజాతి స్త్రీని వివాహమాడడానికి వీలులేదు. అలాగే నల్లవాడు తెల్లజాతి స్త్రీని వివాహమాడలేడు. మిసిసిపిలో అటువంటి వివాహం చట్టప్రకారంగా నిషిద్ధం. అంతేకాదు, ఎవరి నరాల్లో ప్రవహించే రక్తం పరకభాగం కూడా నల్లవాడిదై ఉంటే అటువంటి వ్యక్తిని కూడా తెల్లవాళ్ళు వివాహమాడకూడదు.

కార్మిక రంగంలో ఈ భేదం కొట్టొచ్చినట్లు కనిపిస్తుంది. కర్మాగారంలో ఓ నీగ్రో ఓ తెల్లవాడు ఒకే బల్లపై కూర్చోవడం అటుంచి, తెల్లవాని రాకపోకలపై ప్రత్యేకించబడిన ద్వారాల గుండా కూడా నల్లవాడు ప్రవేశించలేడు.

సామాజికంగా ఈ వర్ణభేదం ఎలా ఉందంటే దాదాపు 14 రాష్ట్రాల్లో రైల్లో ప్రయాణం చేస్తున్నప్పుడు చట్టరీత్యా నీగ్రోలు తెల్లవారికి వేరుగా కూర్చోవాలి. రైళ్ళలో, బస్సుల్లో, టెలిఫోన్ గదుల్లో నీగ్రోలకు వేరే ఏర్పాట్లు ఉంటాయి. ఆస్పత్రులలో నీగ్రోలకు వేరే గదులుంటాయి. ఈ జాత్యహంకారం ఎంతవరకు పోయిందంటే పిచ్చి ఆస్పత్రుల్లో కూడా నల్లవాళ్ళకు తెల్లవాళ్ళకు మధ్య భేదాన్ని పాటిస్తున్నారు.

అంతేకాదు, వాషింగ్టన్‌లోని కుక్కల సమాధుల ఇన్‌ఛార్జి చేసిన ఓ ప్రకటన ఇంతకు మించి వింతగా ఉంది. "కుక్కల యజమాని నల్లజాతి వాడయితే అలాంటి కుక్కల్ని ఇక ముందు తమ సమాధుల్లో ఖననం చేయడానికి అనుమతి లభించద"ని ప్రకటించాడు. అయితే ప్రక్కప్రక్కన లేక అన్నింటిని కలిపి ఒకే గోతిలో పాతిపెట్ట బడడంలో చనిపోయిన కుక్కలకు ఎలాంటి "ఆక్షేపణ" ఉండదని సమాధుల యజమాని అంగీకరించాడు. కాని వాటి నాగరిక యజమానులు తమ గౌరవనీయమైన కుక్కలు నల్లవాడి కుక్కల పక్కన పాతిపెట్టడానికైనా ఎలా ఇష్టపడతారు! ఈ స్థాయిలో కూడా సమానత్వం అనే "నీచ" కార్యం తమ వల్ల జరిగిపోకూడదనే వారు కోరుకుంటారు.

## కేవలం తలబిరుసుతనం

అమెరికా రాజకీయవేత్తలు ఒక్కోసారి ఈ లజ్జావిహీన పరిస్థితుల పట్ల విచారం వెలిబుచ్చుతూ, ఇంత తీవ్రమైన జాతి వివక్ష కేవలం దక్షిణాది రాష్ట్రాల్లోనే ఉందని, ఉత్తరాది రాష్ట్రాలవలె దక్షిణాది రాష్ట్రాలు, నాగరికతలో ఇంకా పూర్తిగా పరిణతి చెందలేదని వివరణ ఇస్తూ ఉంటారు. కాని ఈ సాకు కూడా క్షమించరాని నేరం, ఘోరాతి ఘోరమైన పాపం, సంఘటనలు కూడా అవే నిరూపిస్తాయి. దేశంలోని వాస్తవిక పరిస్థితులు ఆ సాకును ఖండించి వేస్తాయి. అమెరికాలోని అన్ని ఉత్తరాది పట్టణాల్లో నీగ్రోలు మురికివాడల్లో వెదురు, చెక్కలతో కట్టబడిన ఇండ్లలో నివసిస్తున్నారు. అక్కడి మురికి, కల్మషం కుప్పతెప్పలుగా పడి ఉంటుంది, ఈగలు, దోమలు ముసురుతుంటాయి. న్యూయార్క్‌లో "హార్లమ్" నీగ్రోలు నివసించే వీధి చూడండి, అక్కడ ఒక గదిలో 19 మంది నీగ్రోలు ఉండాల్సి వస్తుంది. అక్కడి ఓ వార్తాపత్రిక ఇలా వ్రాస్తోంది :

"ఒకవేళ మనం హార్లమ్ వీధిలోని క్రిక్కిరిసిన జన సంఖ్యవలె మొత్తం అమెరికా ప్రజలకు నివాసం కల్పిస్తే అమెరికా పూర్తి జనాభా ప్రస్తుత న్యూయార్కు నగరంలో అర్థభాగంలో నివసించగలదు."

వాషింగ్టన్‌లో వైట్‌హౌస్‌కు ఎదురుగా ప్రసిద్ధిగాంచిన, అబ్రహం లింకన్ విగ్రహం ఛాయల్లో వెలసిన వీధిలో రెండు లక్షల మంది నీగ్రోలు ఉంటున్నారు. అంటే రాజధాని మొత్తం జనాభాలో నాల్గవ వంతు అన్నమాట. అలా వారు పశు వుల కొట్టంలో బ్రతుకీడ్చే జంతువుల్లా జీవితం గడుపుతున్నారు. ఆ రాజధానిలో తెల్లవారికి ప్రత్యేకించబడిన పాఠశాలలు, ఆస్పత్రులు, విహారస్థలాలు, హొటళ్ళు,

రెస్టారెంట్లలో నల్లవారికి ప్రవేశం లేదు. తుదకు తెల్లవారికి ప్రత్యేకించబడిన చర్చీలోకి కూడా నల్లవారు వెళ్ళడానికి వీలు లేదు.

ఒకసారి పనామా రాష్ట్రానికి చెందిన ఓ నీగ్రో వాషింగ్టన్‌లో కేథలిక్ చర్చిలోకి ప్రవేశించాడు. సరిగ్గా అతడు ప్రార్థన చేసుకుంటున్న సమయంలో అతనికి ఓ ఫాదర్ చిన్న కాగితం ముక్కను అందించాడు. దానిపై వాషింగ్టన్‌లో నల్లజాతి వారికి ప్రత్యేకించబడిన కేథలిక్ చర్చి చిరునామా వ్రాసి ఉంది. ఇదేమిటని ఆ ఫాదర్‌ని అడగగా ఈ పట్టణంలో నీగ్రో కేథలిక్ ప్రజలకు ప్రత్యేక చర్చీలు ఉన్నాయని, అక్కడ నీగ్రోలు తమ ప్రభువును ప్రార్థించుకోవచ్చని జవాబిచ్చాడు, జీసస్ క్రైస్ట్ ప్రపంచ మానవులకు విముక్తికారుడని మానవత్వపు శుభవార్త అందించేవారి వైఖరి ఎలా ఉందో గమనించండి.

ఇంతటి నీచమైన వాతావరణంలో పేదరికం, దీనావస్థ, రకరకాల రోగాలకు లోనవుతూ దాదాపు కోటిన్నర నీగ్రో జనాభా అంటే అమెరికా మొత్తం జనాభాలో పదోవంతు అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో ఆందోళన పూరితమైన జీవితం గడుపుతున్నది. ఇంత జరుగుతున్నా ఐక్యరాజ్య సమితిలో నేనే స్వేచ్ఛా, స్వాతంత్ర్యాల రథసారథిని, సర్వజాతులకు శాంతిని, స్వేచ్ఛను కాంక్షిస్తున్నానని అమెరికా వాదిస్తున్నది.

ఇక్కడ సాక్ష్యాధారం కోసం అమెరికా రచయిత బేరిహాయివార్డు గ్రంథమయిన "నీగ్రోల స్వాతంత్ర్యం" నుండి కొన్ని ఉదాహరణలు ఇవ్వబడుతున్నాయి, అమెరికా వాదిస్తున్న ఆ స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు ఎలాంటివో వీటిద్వారా తేటతెల్లమవుతాయి. గ్రంథకర్త ఇలా వ్రాస్తున్నాడు :

"నిస్సందేహంగా దక్షిణాఫ్రికాలో తప్ప ఎక్కడా జాతి విపక్ష ప్రాతిపదికపై ఒక జాతిని బానిసగా తలచి అతి హీనంగా చూడబడలేదు. మనదేశంలో నీగ్రో ప్రజలు బానిసలుగా, నీచులుగా, చూడబడ్డారు. ఒక యజమాని తన వస్తుసామగ్రికి సర్వాధికారి అయినట్లు బానిసలకు అంత నీచంగా చూడకపోయినా ఒక వర్గ వ్యవస్థ ఉనికిలో ఉన్నందువల్ల బానిసత్వం ఇప్పుడు కూడా జీవించే ఉంది. ఆ బానిసత్వం రూపకల్పన ఎలా ఉందంటే తెల్లజాతి వారికి ప్రశాంతంగా భోగభాగ్యాల జీవితం గడిపేందుకు సకల సౌకర్యాలు ఏర్పడి ఉన్నాయి. నల్లజాతి ప్రజలు అథమ స్థానంలో ఉంచబడ్డారు. ఈ విధానం బలం పుంజుకోవడానికి అనేక మార్గాల్ని అవలంబిస్తు

న్నారు. దానికోసం కొన్ని సమయాల్లోనయితే హత్యల ద్వారా నీగ్రోజాతిని సర్వనాశనం చేసివేస్తారు. ఈ వర్ణ వ్యవస్థ కొనసాగేందుకు అధికార పీఠాన్ని అధిష్ఠించినవారు చట్టరూపంలోను, హింసాయుతమయిన, న్యాయవిరుద్ధమయిన ఆజ్ఞల రూపంలోను, మరికొన్ని సందర్భాల్లో దేవుడు ఏనాడూ అవతరింపజేయని ఆచార, సాంప్రదాయాల రూపంలోను నీగ్రోలపై అత్యాచారాలు జరుపుతూ ఉంటారు."

అమెరికాకు చెందిన సుప్రసిద్ధ ఆర్థిక శాస్త్రవేత్త మిష్టర్ నికేడ్ బేర్లో ఇలా అంటున్నారు : "ఉత్తరాది రాష్ట్రాల్లోని పారిశ్రామిక వేత్తలు అమెరికా అంతర్యుద్ధం సమయంలో ఫెడరల్ గవర్నమెంటును స్వాధీనం చేసుకున్నారన్నది నిజమే కాని నిజానికి వీరు నీగ్రో ప్రజలకు స్వేచ్ఛను ఇవ్వదలచుకోలేదు, నీగ్రో బానిసలకు సిసలైన యజమానులుగా చలామణిలో ఉన్న అమెరికా దక్షిణాది రాష్ట్రాలు వారి ద్వారా అపరిమిత లాభాలు పొందుతున్నాయి. కనుక ఒక్క ఆ రాష్ట్రాలే ఎందుకు ప్రయోజనం పొందాలి, తాము కూడా అందులో లాభం పంచుకోవాలని ఉత్తరాది రాష్ట్రాలు కూడా తలచాయి. వాస్తవం ఏమంటే, డెమోక్రటిక్ పార్టీ, సైన్యం రెండూ కలిసి దక్షిణాది రాష్ట్రాలలో బానిసల మాజీ యజమానులతో చేతులు కలిపి నల్లజాతి వారిని సరికొత్త పంథాలో బానిసలుగా చేసుకోవాలని కుట్రపన్నాయి."

ఇది కూడా చూడండి :

ఆ రచయితే ఇంకా ఇలా అంటున్నారు :

"జాత్యహంకార విషం దేశంలో సుదూర ప్రాంతాలకు విస్తరించింది. అది అమెరికా జీవన నవనాడుల్లో ప్రవహిస్తోంది. ఇప్పుడు ప్రజాస్వామ్య ప్రజలు నీగ్రోలను ఇతర అల్పసంఖ్యాక వర్గాల వారిని నీచులుగా, అథములుగా చూడ్డానికి అలవాటుపడిపోయారు. అలా చూసే ఏ అవకాశాన్నీ చేజారిపోకుండా జాగ్రత్తపడుతున్నారు. వారిని నీచులుగా, అధములుగా చేయడానికి కొత్త కొత్త పన్నాగాలు పన్నుతూ రకరకాల సూచనలు చేస్తూ ఉంటారు."

## మరో రెండు నిదర్శనాలు

మిస్టర్ జాక్‌లేట్, ఓడ్లియార్ ఇలా వ్రాస్తున్నారు :

"ప్రపంచ జాతుల్లో ఆదర్శవంతమైన స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలకు అమెరికా కలికితురాయి వంటిదని ఖ్యాతి గాంచింది. దాని భావం ఏమిటంటే కఠినమైన

హింసలు, అత్యాచారాల నుండి తప్పించుకొని పారిపోయివచ్చే లేదా హింసలకు, దుఃఖ బాధలకు దూరంగా పారిపోవాలని తలచి శరణు పొందటానికి వచ్చే ప్రతి వ్యక్తికి మన దేశం స్వాగతం పలకాలి. కాని అత్యంత విచారకరమైన విషయం ఏమంటే ఏనాడు స్వాతంత్ర్య చిహ్నమైన విగ్రహం ప్రతిష్ఠించబడిందో ఆ నాటి నుండే అమెరికాలో స్వాతంత్ర్యం, సమానత్వాలకున్న అర్థాలు అంతమయి పోయాయి."

## భయానక సంఘటన

ఈ చివరి విషయాన్ని కూడా గమనించండి. 1946లో కొలంబియా పట్టణంలో ఓ నీగ్రో యువకుడు, అతని తల్లి రేడియో బాగు చేయించుకోవడానికి రేడియో షాపుకు వెళ్ళింది. ఆ షాపు యజమానికి డబ్బులిచ్చి బాగుచేయమన్నది. బాగుచేశాక కూడా రేడియో పలకలేదు. అందుకు ఆ నీగ్రో యువకుని తల్లి, "పదిహేడు డాలర్లు తీసుకున్నావు కదా, అయినా అది పూర్వంలాగే పలకకుండా మౌనంగా ఉంది" అన్నది.

షాపు యజమాని ఆ మాటలు విన్నాడో లేదో మండిపడి ఆమెను షాపు నుండి బయటకు గెంటివేయమని నౌకర్‌ని ఆదేశించాడు. నౌకరు ఆ స్త్రీని కాలితో తన్ని బయటికి నెట్టాడు. ఆమె ముందుకు తూలి పడిపోయింది. ఆ దృశ్యం చూసి ఆమె కొడుకుకు చాలా కోపం వచ్చింది. వెంటనే అతను నౌకరును కొట్టి నేలపై పడేశాడు. ఇంకేముంది మిన్ను విరిగి మీదపడింది. ఇరుగు పొరుగు తెల్లజాతి వారంతా గుమిగూడి "ఆ నీచుణ్ణి పట్టుకోండి, చంపేయండ"ని కేకలు వేస్తూ ఆందోళన చేయసాగారు. క్షణాల్లో ఓ పెద్ద గుంపు చేరి "మేము ప్రతీకారం తీర్చుకుంటామ"ని పెద్దగా అరవసాగింది. అమెరికన్ల నోటి నుండి నీగ్రోలపై ప్రతీకారం తీర్చుకుంటామంటే కోర్టు వ్యవహారం ఏదీ లేకుండా వెంటనే వారి తల శరీరం వేరు చేయడమన్నమాట. ఇంకా వేరే శిక్ష విధించడమనే ప్రశ్న ఉదయించదు.

చివరికి ఎలాగో ఆ అల్లరి మూక నుండి వారిద్దర్నీ తప్పించి జైలుకు పంపించారు. అయినా ఆ తెల్లవారి ఆగ్రహం అంతటితో చల్లారలేదు. ఆ నీగ్రో స్త్రీ, ఆమెపై ప్రతీకారం తీర్చుకోవడానికి వారు ఓ నీగ్రో బస్తీ మీద దాడి చేశారు. దురదృష్టవశాత్తు పోలీసులు కూడా ఆ వీధిని ముట్టడించడం వల్ల పాపం ఆ నీగ్రోలు తమ ఇళ్ళ నుండి బయటకు రాలేకపోయారు. ఫలితంగా కోపోద్రేకులైన తెల్లజాతి అల్లరిమూక చేతికందినదాన్ని సర్వనాశనం చేసివేసింది. వారు ఇళ్ళకు నిప్పంటించారు.

నిస్సహాయులైన నీగ్రోలపై కాల్పులు జరిపారు. ఎందరో నీగ్రోలు హతులయ్యారు. చాలామందికి గాయాలు తగిలాయి.

ఇన్ని అత్యాచారాలు ఎందుకు జరిగిపోయాయంటే, "డబ్బు తీసుకున్నావు, కాని రేడియో మాత్రం పలకడం లేద"ని అడగడమే తెల్లవాళ్ళ దృష్టిలో మహాపరాధం అయ్యింది. ఇది నేటి 21వ శతాబ్దంలో విజ్ఞాన కాంతులీనే మేధస్సుగల పాశ్చాత్య నాగరికత ప్రదర్శిస్తున్న స్వేచ్ఛా స్వాతంత్ర్యాల బంగారు కల!

## మచ్చుతునక

ఇక ఇస్లామీయ సంస్కృతీ, సంప్రదాయాన్ని పరిశీలించండి :

14 వందల సంవత్సరాలకు పూర్వం జరిగిన ఓ సంఘటన ఫర్ఖూన అనే ఓ నల్లజాతి అమ్మాయి హజ్రత్ ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్‌కు రాసిన ఒక లేఖలో "నా ఇంటి గోడ చాలా క్రిందికి ఉంది, ప్రజలు దాని పైనుంచి లోపలికి ప్రవేశించి నా కోళ్లను దొంగిలించుకు పోతున్నార"ని ఫిర్యాదు చేసింది. హజ్రత్ ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ ఆమె చేసిన ఫిర్యాదుకు జవాబిస్తూ గోడను ఎత్తుగా కట్టించి ఇంటి పరిస్థితిని చక్కబెట్టవలసిందిగా ఈజిప్టు గవర్నర్‌కు ఆదేశాలు జారీ చేశానని ఆమెకు తెలియపరిచారు. ఆ కాలం ఈజిప్టు పాలకుడు అయ్యూబ్ బిన్ షర్జిల్ లేఖాంశం ఇలా ఉంది :

"ఫర్ఖూన జీఅస్‌బిహ్ స్వేచ్ఛనిచ్చిన బానిస. ఆమె తన వాకిలి గోడ చాలా క్రిందికి ఉన్నదని, రాత్రుల్లో దొంగలు జొరబడి కోళ్ళను దొంగిలించుకు పోతున్నారని, కనుక ఆ గోడను ఎత్తుగా దృఢంగా కట్టించమని కోరుతూ లేఖ వ్రాసింది. అందువల్ల నా లేఖ అందగానే స్వయంగా నీవే ఆమె ఊరికి వెళ్ళి ప్రత్యక్షంగా నీ ముందే ఆ గోడను ఎత్తుగా, పటిష్టంగా కట్టించు."

ఆ లేఖ అందగానే ఈజిప్టు గవర్నర్ ఫర్ఖూన ఇల్లును వెదుక్కుంటూ బయలుదేరారు. ఆమె నల్లజాతి అమ్మాయి, నిరుపేద అని తెలిసింది. గవర్నర్ స్వయంగా తన పర్యవేక్షణలో అమీరుల్ మూమినీన్ ఆజ్ఞ మేరకు పని పూర్తి చేయించారు. పదమూడు వందల సంవత్సరాలకు పూర్వమే నీగ్రోల పట్ల ముస్లింలు ప్రవర్తించిన ఈ తీరు మహోజ్వల ఇస్లామీయ సంస్కృతీ సంప్రదాయాలకు ఒక మచ్చుతునక.

## మత సహనం

ఇస్లాం నాగరికత మానవతా వికాస మార్గంలో ఓ నూతన అధ్యాయాన్ని సృష్టించింది. ఇస్లామీయ నాగరికతా సంస్కృతులకున్న ఈ విశిష్ట లక్షణాలు, విశ్వాసాలు, విధానాలు మరే చరిత్రలోనూ కానరావు. కొన్ని మత ధర్మాలు లేదా కొన్ని జాతులు కల్పించిన పూర్వపు సంస్కృతుల చరిత్రలో కూడా కానరావు. ఇస్లాం తన సంస్కృతిని సంస్థాపించే సమయంలో అది గత ధర్మాల పట్ల ఎలాంటి సంకుచిత వైఖరి అవలంబించలేదు. ఇతర మతాలు, దృక్పథాలకు విరుద్ధంగా ఎలాంటి అసూయ చూపనూ లేదు. ఈ విషయంలో ఇస్లామీయ సంస్కృతి చూపిన ఉదార భావాన్ని దివ్య ఖుర్‌ఆన్‌లోని ఈ క్రింది ఆయత్ ప్రతిబింబింపజేస్తుంది :

**"ఓ ప్రవక్తా! మాటను శ్రద్ధగా విని, అందులోని మంచి మంచి విషయాలను అనుసరించే నా దాసులకు శుభవార్త అందజెయ్యి."** ***(అజ్ జుమర్ : 18)***

## మత సహనానికి మౌలిక సూత్రాలు

మత సహనానికి ఇస్లామీయ సంస్కృతి నిర్దేశించిన మౌలిక సూత్రాలు ఏమిటో పరిశీలిద్దాం :

1. దేవుడు అవతరింపజేసిన సర్వధర్మాలు ఒకే మూలాధారం నుండి ఆవిర్భవించాయన్న వాస్తవాన్ని పవిత్ర ఖుర్‌ఆన్ ఇలా విపులీకరించింది :

**"ఆయన నూహ్ ప్రవక్తకు ఆజ్ఞాపించిన ధర్మాన్నే నీకు కూడా నిర్ణయించాడు. దానినే (ముహమ్మద్ - సఅసమ్) ఇప్పుడు నీ వైపునకు మేము వహీ ద్వారా పంపాము; దానినే మేము ఇబ్రాహీమ్‌కు, మూసాకు, ఈసాకు బోధించాము; ఈ ధర్మాన్ని స్థాపించండి అనీ, దానిని గురించి విభేదాలకు లోనుకాకండి అనీ తాకీదు చేస్తూ."** ***(అష్ షూరా : 13)***

2. ప్రవక్తలంతా దైవదౌత్యం రీత్యా సమానులు. ఈ విషయంలో ఎవరికి ఎవరిపైనా ఆధిక్యత, ఔన్నత్యాలు లేవు. విశ్వాసులకు ప్రవక్తలందరిపైనా విశ్వాసముంచడం అవసరం.

**"ఇలా ప్రకటించండి : 'మేమంతా అల్లాహ్‌నూ, ఆయన మా వైపునకు పంపిన హితోపదేశాన్నీ విశ్వసించాము. ఇంకా ఇబ్రాహీము, ఇస్మాయీలు, ఇస్‌హాఖు,**

**యాఖూబు, యాఖూబు సంతానంపై అవతరించినదానినీ మూసాకూ, ఈసాకూ ఇతర ప్రవక్తలందరికీ వారి ప్రభువు ప్రసాదించిన దానినీ మేము విశ్వసించాము. వారిలో ఏ ఒక్కరిపట్లా మేము భేదభావం చూపము."**

***(అల్ బఖర : 136)***

3. ధర్మ స్వీకరణలో బలవంతం లేదు. దానిని అవలంబించే విషయం ప్రజల అభీష్టానికే వదిలివేయబడింది.

**"లా ఇక్‌రాహఫిద్దీన్" (ధర్మం విషయంలో ఎలాంటి బలాత్కారం లేదు).**

***(అల్ బఖర : 256)***

**"నీవు ప్రజలను విశ్వాసులుగా మారండి అని బలవంతం చేస్తావా?"**

***(యూనుస్ : 99)***

4. సమస్త మతాల ఆరాధనా మందిరాలు గౌరవించతగినవి. వాటిని సంరక్షించడం, గౌరవించడం కూడా విధిగా నిర్ణయించబడింది. ఏ విధంగానైతే ముస్లింల ఆరాధనా మందిరమైన మస్జిద్‌కు భద్రత చేకూర్చడం, దాన్ని శత్రువుల నుండి కాపాడడం విధి అయి ఉన్నదో అదేవిధంగా ఇతర మతాల ఆరాధనా మందిరాల్ని కాపాడడం కూడా ముస్లింల విధే.

**"అల్లాహ్ గనక ప్రజలను ఒకరి ద్వారా మరొకరిని తొలగిస్తూ ఉండకపోతే, ఆశ్రమాలు, చర్చీలు, యూదుల ప్రార్థనాలయాలు, మశీదులు-వేటిలో అల్లాహ్ పేరు అత్యధికంగా స్మరింపబడుతుందో - అన్నీ ధ్వంసం చేయబడి ఉండేవే."**

***(అల్ హజ్ : 40)***

5. ప్రజలు కేవలం మత విభేదాల కారణంగా ఒకరినొకరు హతమార్చుకోవడం లేదా ఒకరిపై నొకరు దౌర్జన్యం చేసుకోవడం సహించరాని చర్య. అలా కాకుండా వారు మంచిని పెంచే, చెడును రూపుమాపే పనుల్లో పరస్పరం సహకరించుకోవాలి.

**"వత ఆవనూ అలల్‌బిర్రి వత్తఖ్వా వలాతఅవనూ అలల్ ఇస్మి వల్ ఉద్‌వాన్."**
**"సత్కార్యం దైవభీతి పనుల్లో పరస్పరం సహకరించుకోండి. దుష్కార్యం, దౌర్జన్యకర పనుల్లో పరస్పరం సహకరించుకోకండి."** ***(అల్ మాయిద : 2)***

అయితే ధర్మ విషయాల్లో వచ్చిన విభేదాలను ప్రళయదినాన దేవుడే పరిష్కరిస్తాడు.

**"క్రైస్తవుల వద్ద (సత్యమనేది) ఏమీలేదు అని యూదులు అంటారు. యూదుల వద్ద (సత్యమనేది) ఏమీ లేదు అని క్రైస్తవులు అంటారు - కాని వారు ఉభయులూ చదివేది దైవ గ్రంథమే! గ్రంథజ్ఞానం లేనివాళ్ళు కూడా ఇదేవిధంగా ప్రగల్భాలు పలుకుతారు. వీరందరిలో ఉన్న అభిప్రాయభేదాలను గురించి నిశ్చయంగా అల్లాహ్ ప్రళయ దినం నాడు తీర్పు చెబుతాడు."**

***(అల్ బఖర : 113)***

6. ఈ ప్రాపంచిక జీవితంలో ప్రజలకు, ఒకరిపై మరొకరికి ఇవ్వబడే ఔన్నత్యం కేవలం దైవభీతి ప్రాతిపదికపైనే ఇవ్వబడుతోంది. దైవం దృష్టిలో కూడా ఔన్నత్యానికి గీటురాయి దైవభీతే. ఎవరు ఇతరులకు సత్కార్యంలో, సన్మార్గంలో ఎంత సేవ చేశారన్న ప్రాతిపదికపైనే ఆ ఔన్నత్యం ఇవ్వబడుతుంది.

మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు: "యావత్తు ప్రజలు దేవుని కుటుంబం, ఆ కుటుంబంలో ఎవరు ఎవరికి ఎంత ప్రయోజనం చేకూర్చుతారో దేవునికి వారు అంతే ప్రీతిపాత్రులు." దివ్య ఖుర్ఆన్‌లో దేవుడు కూడా అదే అన్నాడు : "ఇన్న అక్రమకుమ్ ఇందల్లాహి అత్ఖాకుమ్" (మీలో ఎవరు ఎక్కువ దైవభీతిపరులో వారే దేవునికి అత్యంత ప్రీతిపాత్రులు).

7. సత్కార్యం, సహాయం, సంఘసేవల్లో మత విభేదాలు అడ్డు రాకూడదు.

**"ఈనాడు మీ కొరకు పరిశుభ్రమైన వస్తువులన్నీ హలాల్ చెయ్యబడ్డాయి. గ్రంథ ప్రజల భోజనం మీకు హలాల్; మీ భోజనం వారికి హలాల్. సుచరితలైన స్త్రీలు కూడా మీకు హలాల్, వారు విశ్వాసుల వర్గానికి చెందిన వారైనా సరే లేక మీకు పూర్వం గ్రంథం పొందిన జాతులకు చెందినవారైనా సరే."** ***(అల్ మాయిద : 5)***

8. ప్రజల ధర్మాలు విభిన్నమైనప్పటికీ వాటి గురించి పరస్పరం చర్చ, వాదం, సంభాషణల ద్వారా పరిశీలించవచ్చు. కాని సంస్కారవంతమైన పద్ధతి, హుందాతనం, ప్రశాంతత, మర్యాదల పరిధులను పాటించాలి. సరయిన ప్రమాణాలతో ఎదుటి వారిని సంతృప్తిపరచే ఉద్దేశ్యం కలిగి ఉండాలి.

"వలాతుజాదిలూ అహ్‌లల్ కితాబి ఇల్లా బిల్లతి హియ అహ్‌సన్" (భావం : గ్రంథం కలవారితో ఉత్తమ పద్ధతిలోనే వాదించండి). ప్రత్యర్థుల పట్ల సంస్కార రహితంగా ప్రవర్తించడాన్ని ఇస్లాం సమ్మతించదు. వారు మూఢ విశ్వాసాలు కలిగి ఉన్న వారయినా, బహుదైవారాధకులైనా సరే, వారితో మంచి పద్ధతిలోనే వాదించాలి. ఖుర్‌ఆన్‌లో దేవుడు స్పష్టంగా ముస్లింలను ఇలా ఉపదేశిస్తున్నాడు : "అల్లాహ్‌ను వదలి వారు ఆరాధిస్తున్న మిథ్యా దైవాలను దూషించకండి, ఎందుకంటే అజ్ఞానం కారణంగా, విరోధం చేత వారు అల్లాహ్‌ను దూషించవచ్చు."

9. అయితే ముస్లిం సమాజం (ఉమ్మతె ముస్లిమా) మీద దాని విశ్వాసాలు, సిద్ధాంతాల కారణంగా దాడి జరిగినప్పుడు, శత్రువుల ఆగడాలను అంతం చేసి తమ సిద్ధాంతాలను రక్షించుకోవడానికి, ఆ దౌర్జన్యానికి వ్యతిరేకంగా ముస్లింలు పోరాటం సాగించడం తప్పనిసరి అవుతుంది.

**"పీడన (ఫిత్నా) అంతమయ్యేవరకు, దైవధర్మం స్థాపించబడేవరకు మీరు వారితో యుద్ధం చేస్తూనే ఉండండి."** ***(అల్ బఖర : 193)***

**"ఎవరు మీతో ధర్మం విషయంలో యుద్ధం చేశారో, మిమ్మల్ని మీ ఇళ్ళ నుండి బహిష్కరించారో, మిమ్మల్ని బహిష్కరించటంలో పరస్పరం సహక రించుకున్నారో, వారితో మీరు స్నేహం చేయటాన్ని మాత్రం అల్లాహ్ వారిస్తున్నాడు. అటువంటి వారితో స్నేహం చేసేవారే దుర్మార్గులు."**

***(అల్ ముమ్‌తహినహ్ : 9)***

10. అయితే ముస్లింల ధర్మం లేదా స్వాతంత్ర్య హక్కుల్ని హరించేందుకు హింసాత్మక వైఖరి అవలంబించిన వారిపై గెలుపు సాధిస్తే ముస్లిం సమాజం మరలా ఆ జాతిపై ప్రతీకారం తీర్చుకోరాదు. స్వధర్మాన్ని వదిలివేయడానికి ఆ జాతిని బలవంతం చేయడంగాని, తనకిష్టమైన విశ్వాసాలు కల్గి ఉందన్న కారణంతో దానిపై ప్రతీకారం తీర్చుకునే చర్యలకు పాల్పడరాదు. జయించబడిన జాతి ఇస్లామీయ ప్రభుత్వం పట్ల విధేయత కల్గి ఉంటే చాలు. అప్పుడు వారి స్థానం ఎంత ఉన్నతంగా ఉంటుందో మహాప్రవక్త (సఅసం) ప్రవచనం ద్వారా గమనించండి: "మనకున్న హక్కులే వారూ కలిగి ఉంటారు. మనకున్న బాధ్యతలే వారికి ఉంటాయి" అన్నారు ఆయన (స). ఇవి మత సహనానికి, సఖ్యతకు ఇస్లాం చూపుతున్న మహత్తర

మౌలిక సిద్ధాంతాలు. ఈ సిద్ధాంతాల పునాదులపైనే ఇస్లామీయ సంస్కృతి సౌధం నిర్మాణమయింది.

సమాజంలో శాంతిని కాపాడే నిమిత్తం ఇస్లాం విభిన్న వర్గాల మధ్య ఒక వారధిని నిర్మించదలచుకున్నది. ప్రవక్తలందరినీ విశ్వసించాలని, అందర్నీ అత్యంత గౌరవ మర్యాదలతో ప్రస్తావించాలని, వారిలో ఏ ప్రవక్త అనుచరుల పైన అత్యాచారం జరపరాదని, వారి పట్ల సంబంధ వ్యవహారాల్లో సత్ప్రవర్తన కలిగి ఉండాలని, వారి పట్ల మృదువుగా వ్యవహరించాలని, మధుర సంభాషణ చేయాలని, మంచి పొరుగు వారిగా మెలగాలని వారి విందులను, ఆహ్వానాలను స్వీకరించాలని ఈ సిద్ధాంతాలు సూచిస్తున్నాయి. గ్రంథం గల వారి స్త్రీలతో వివాహం కూడా చేసుకోవచ్చు. ఎందుకంటే కుటుంబాల మధ్య అనురాగ బంధాలు పెంపొందాలి. రక్త సంబంధాలు నిలబడాలి. అంతేకాదు, వారి ఆరాధనా మందిరాలు రక్షించబడాలి. వారికున్న విశ్వాస నమ్మకాల్లో ఏమాత్రం జోక్యం కలిగించుకోరాదు. ఏ వ్యవహారంలోనయినా తీర్పు ఇచ్చేటప్పుడు వారిపై ఒత్తిడి చేయరాదు. సాధారణ హక్కులు, బాధ్యతల విషయంలో వారికి ముస్లింలకు మాదిరిగానే సమాన స్థాయినివ్వాలి. ఒక ముస్లిం జీవితం, గౌరవం, భవిష్యత్తుల రక్షణకు కూడా జామీను ఇచ్చినట్లుగానే వారి జీవితం, గౌరవం, భవిష్యత్తుల రక్షణకు కూడా జామీను ఇవ్వాలన్నది ఇస్లామీయ ప్రభుత్వ బాధ్యతగా నిర్దేశించబడింది.

## ప్రవక్త (సఅసం) కాలంలో...

దైవప్రవక్త (సఅసం) మదీనాకు తరలి వెళ్ళినప్పుడు అక్కడ పెద్ద సంఖ్యలో యూదులు నివసిస్తూ ఉన్నారు. ఆ నేల మీద ఇస్లామీయ ప్రభుత్వ స్థాపన జరగబోతున్న తరుణంలో ఆయన (సఅసం) ముస్లింలు, యూదుల మధ్య ఓ ఒడంబడికను ఖరారు చేశారు. ఆ ఒడంబడికను అనుసరించి యూదులకు ఉన్న మత విశ్వాసాలను గౌరవించాలని, సమస్త ఆపదల నుండి వారు రక్షించబడాలని, అందుకు బదులుగా, ఎవరయినా మదీనా మీద దాడి చేసినప్పుడు యూదులు ముస్లింలకు సహకరించాలని నిర్ణయించబడింది. ఈ ఒడంబడిక ద్వారా మహాప్రవక్త (సఅసం) మత సహనానికి గల మౌలిక సూత్రాలను ఇస్లామీయ సంస్కృతిలో మొట్టమొదటి రోజే ప్రవేశపెట్టారు.

గ్రంథం గలవారు కొందరు ప్రవక్త (సఅసం) పొరుగునే ఉండేవారు. ఆయన (సఅసం) వారి పట్ల ఎల్లప్పుడూ సత్ప్రవర్తనతో మెలిగేవారు. వారికి కానుకలు

పంపించేవారు. స్వయంగా వారి కానుకలను స్వీకరించేవారు. మహాప్రవక్త (సఅసం) చూపుతున్న ఆ సద్వర్తనం ఓ యూదు మహిళకు నచ్చలేదు. ఆమెకు గల యూదుత్వపు అలవాటును ఆచరణలో పెట్టదలచి ఒక రోజు నిప్పులో కాల్చిన మేక తొడలో విషం కలిపి ప్రవక్త (సఅసం)కు పంపించింది. తన వద్ద నుండి పంపించబడే కానుకల్ని ప్రవక్త (సఅసం) స్వీకరిస్తారని, ఆమె పట్ల మంచి పొరుగు సంబంధాలు కలిగి ఉన్నారని ఆమెకు బాగా తెలుసు. అయితే ఆమె దుష్ట పథకం పారలేదు.

అబిసీనియా నుండి కొందరు క్రైస్తవులు మదీనాకు రాగా మహాప్రవక్త (సఅసం) వారికి మస్జిదె నబవిలోనే విడిది ఏర్పాటు చేశారు. వారికి స్వయంగా ఆతిథ్యమిచ్చారు. ఆనాడు ఆయన (సఅసం) ప్రవచించిన విషయాల్లో ఈ అంశం గమనార్హం.

"వీరు మన సహచరులందరికీ గౌరవనీయులు. అందువల్లే నేను స్వయంగా వారికి అతిథి మర్యాదలు చేయడం నా బాధ్యతగా భావించాను."

ఒకసారి నజ్రాన్ నుండి ఓ క్రైస్తవ బృందం వచ్చింది. వారికి కూడా ఆయన (సఅసం) మస్జిదె నబవీలోనే విడిది ఏర్పాటు చేశారు. వారికి ప్రార్థనలను తమ ఆచారం ప్రకారం మస్జిదె నబవీలోనే చేసుకొమ్మని అనుమతించారు. వారు మస్జిదె నబవీలో ఒకవైపు ప్రార్థన చేస్తూ ఉంటే దైవప్రవక్త (సఅసం) తన సహాబీలతో రెండో వైపు నమాజు చేసేవారు. తర్వాత వారు తమ ధర్మం గురించి ప్రవక్త (సఅసం)తో చర్చించినపుడు ఆయన (సఅసం) ఎంతో శ్రద్ధాసక్తులతో వారి సంభాషణను విన్నారు. మృదువుగా, గౌరవ మర్యాదలతో వారికి సమాధానమిచ్చారు. అంతేకాదు, మఖూఖస్ రాజు పంపించిన కానుకలను స్వీకరించారు. అతడు పంపించిన దాసీని కూడా స్వీకరించి ఆమెకు దాస్య విముక్తి గావించి తన సతీమణిగా చేసుకున్నారు. ఆమెకు ఇబ్రాహీం అనే పుత్రుడు జన్మించాడు. ఆ పిల్లవాడు కొన్ని నెలలకే దివంగతుడయ్యాడు. మహాప్రవక్త (సఅసం) బోధించిన హితవుల్లో "నీగ్రో పట్ల శ్రేయోభిలాషులయి ఉండండి. ఎందుకంటే వారిలో మీ బంధుత్వాలున్నాయి" అన్న అంశం కూడా ఒకటి.

## శ్రేయస్కర ఖలీఫాల కాలంలో ...

ఖలీఫాలు కూడా దైవప్రవక్త (సఅసం) తరువాత ఆయన అడుగుజాడల్లోనే పరిపాలన సాగించారు. ప్రవక్త (సఅసం) చూపిన మహోన్నత మానవ మైత్రి,

మత సహనాల రీతినే ఖలీఫాలు కూడా పాటించారు.

హజ్రత్ ఉమర్ (రజి) బైతుల్ మఖ్దిస్‌లో విజేతగా ప్రవేశించినప్పుడు అక్కడ యూదులు ఉండరాదని క్రైస్తవులు పెట్టిన షరతును అంగీకరించారు. అస్ర్ నమాజ్ సమయం అవుతున్నప్పటికీ బైతుల్ మఖ్దిస్‌లోని పెద్ద చర్చీలో ఆయన నమాజ్ చేసుకోలేదు. అలా నమాజ్ చేయడం వల్ల అది ముస్లింల మస్జిద్‌గా మారిపోతుందని, ముస్లింలు దాన్ని తమ అధీనంలో ఉండాలని, తమకు స్వాధీనం చేయాలని ఒత్తిడి చేస్తారేమోనన్న అనుమానంతో ఆయన అక్కడ నమాజు చేసుకోలేదు.

ఈజిప్టుకు చెందిన ఓ మహిళ అక్కడి పాలకుడయిన అమ్ర్ బిన్ ఆస్ మీద ఓ ఫిర్యాదు చేసింది. తన ఇష్టం లేకుండా తన ఇంటిని మస్జిద్ భాగంలో కలిపివేశారన్నదే ఆ ఫిర్యాదు. ఖలీఫా హజ్రత్ ఉమర్ (రజి) దానికి జవాబు ఇమ్మని అమ్ర్ బిన్ ఆస్ (రజి)ను ఆదేశించారు. అందుకాయన ఇలా సమాధానమిచ్చారు : "నమాజీల సంఖ్య అధికమయింది. మస్జిద్‌లో చోటు సరిపోవడం లేదు. మస్జిద్‌ను ఆనుకొని ఆమె ఇల్లు ఉంది. ఆ ఇంటి స్థాయికి మించి ధర ఇవ్వదలచినా ఆమె తిరస్కరించింది. ఇక విధిలేక బలవంతంగా ఆ ఇంటిని పడగొట్టించి మస్జిద్‌లో కలిపివేయాల్సి వచ్చింది. ఆ ఇంటి ధరను బైతుల్ మాల్ (ప్రభుత్వ ధనాగారం)లో జమ కట్టించాము. ఆమె ఎప్పుడు వచ్చి తీసుకోవాలన్నా తీసుకోవచ్చు."

హజ్రత్ అమ్ర్ బిన్ ఆస్ తీసుకున్న నిర్ణయం సమంజసంగానే ఉంది. మనకున్న ప్రస్తుత చట్టాలు కూడా అందుకు అనుమతిస్తాయి. అయినా హజ్రత్ ఉమర్ (రజి) ఆయన వాదాన్ని అంగీకరించలేదు. వెంటనే ఆ స్త్రీకి చెందిన ఇంటి భూభాగంపై నిర్మించిన మస్జిద్ భవనాన్ని పడగొట్టి ఆ ఇల్లును పూర్వం లాగే కట్టించి ఆమెకు ఇచ్చివేయాలని ఆయన ఆజ్ఞలు జారీచేశారు.

ఇదీ ఇస్లామీయ మత సహనానికిగల సమగ్ర స్వరూపం. ఇటువంటి మహోజ్వల నిదర్శనాలు మానవ చరిత్రలో మరెక్కడా కానరావు. ఆధునిక నాగరికతా ప్రపంచంలో కూడా ఎక్కడా మచ్చుకయినా ఇలాంటి ఆదర్శాన్ని చూడలేము.

ఆనాడు ఇస్లామీయ ప్రభుత్వంలో క్రైస్తవులకు తమ మతాచారాలు అనుసరించే పూర్తి స్వేచ్ఛ ఉండేది. వారి మత నాయకులు వారి మతస్తుల పైన పూర్తి అధికారాలు కలిగి ఉండేవారు. వారి స్వవిషయాల్లో ప్రభుత్వం ఏమాత్రం జోక్యం చేసుకునేది

కాదు. స్వయంగా క్రైస్తవులే ఇస్లామీయ ప్రభుత్వం తమకు ప్రసాదించిన ఇటువంటి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు రోమన్ క్రైస్తవ సామ్రాజ్యంలో కూడా లభించలేదని గ్రహించారు.

## సుల్తాన్ ముహమ్మద్ విశాల హృదయం

ఈ విషయంలో కాన్‌స్టెంట్ నోపుల్ విజేత సుల్తాన్ ముహమ్మద్ విశాల హృదయాన్ని చరిత్ర విస్మరించజాలదు. ఆయన కాన్‌స్టెంట్ నోపుల్‌ను జయించినప్పుడు ఆ నగరంలోని వారంతా క్రైస్తవులే. ఆ నగరం తూర్పు భాగం కాథలిక్ క్రైస్తవుల పీటర్ యార్క్‌కు రాజధానిగా ఉండేది. సుల్తాన్ ప్రజలందరికి శాంతిని ప్రసాదించారు. వారి ప్రాణాలు, వస్తు సామగ్రికి, వారి మత విశ్వాసాలు, చర్చీలు, శిలువలకు పూర్తి రక్షణ ఉంటుందని హామీ ఇచ్చారు. వారిని సైన్యంలో చేర్చుకోబోమని నిర్ణయం గైకొన్నారు. వారి మతస్తుల మధ్య ఉత్పన్నమైన సమస్యల్ని, కేసుల్ని వారే పరిష్కరించుకోవచ్చని, వాటికోసం కావలసిన చట్టాలు కూడా వారే చేసుకోవచ్చని వారికి అధికారాలను ఇచ్చారు. ఈ విషయంలో ప్రభుత్వం ఏమాత్రం జోక్యం చేసుకోదని హామీ ఇచ్చారు. స్వయంగా అక్కడి క్రైస్తవులు సుల్తాన్ ముహమ్మద్ వైఖరికి, అక్కడి ఇతర పాలకుల వైఖరికి మధ్య ఎంతో భేదం ఉందని గ్రహించారు.

కాన్‌స్టెంట్ నోపుల్‌లోని కొందరు నతీని పాలకులు తరచుగా మత విభేదాల్లో జోక్యం చేసుకునేవారు. వారు తమ చర్చీ అనుయాయులను బాగా చూసుకునేవారు. ఇతర చర్చీ అనుయాయుల పట్ల చిన్నచూపు చూసేవారు. అందువల్ల క్రైస్తవులు కొత్తగా వచ్చిన ఇస్లామీయ ప్రభుత్వ విధానాన్ని అమితంగా అభిమానించేవారు. ఆ విధానంలోని మత సహనాన్ని చూసి అబ్బురపడేవారు. అలాంటి మత సహనం వారికి స్వయంగా తమ మత సోదరుల పాలనా కాలంలో మచ్చుకయినా కానరాలేదు. రోమన్ పీటర్ యార్క్‌కు సుల్తాన్ అపరిమితమయిన అధికారాలు కట్టబెట్టాడు.

ఇస్లామీయ ప్రభుత్వంలో క్రైస్తవులు అయిదు వందల సంవత్సరాలు సంపూర్ణ స్వేచ్ఛను అనుభవిస్తూ సుఖవంతమైన జీవితం గడిపారు. వారికి ఎలాంటి సైన్యం కాని, తమ స్వేచ్ఛను కాపాడుకోవడానికి ఎలాంటి పన్ను చెల్లించాల్సిన అవసరం కానీ లేకపోయింది. అయితే అత్యంత జుగుప్సాకరమైన విషయం ఏమంటే, చరిత్రలో అనుపమానమయిన ఈ మత స్వాతంత్ర్యం ద్వారా పొందిన యావత్తు హక్కుల్ని క్రైస్తవులు దారుణ దుష్ప్రయోజనాలకు వాడుకున్నారు. 20వ శతాబ్దారంభంలో

పాశ్చాత్యులు స్థానిక ప్రభుత్వాన్ని, దాని మహోన్నతమైన నిదర్శనాలను, చిహ్నాలను తుడిచిపెట్టడానికి విద్రోహ కార్యకలాపాలు సాగించారు.

## ఇతర మతాల్లో జోక్యం లేదు

ఇస్లామీయ సంస్కృతిలో ప్రపంచం పలుమార్లు తన కళ్ళతో చూసిందేమిటి? మస్జిద్, చర్చీ ప్రక్క ప్రక్కగా ఉన్నాయి. చర్చీ మత నాయకులకు తమ ప్రజల మత విషయాల్లో, చర్చీకి సంబంధించిన సమస్యల్లో సంపూర్ణ స్వేచ్ఛ, అధికారాలు ఉండేవి. ఇస్లామీయ ప్రభుత్వం వాటిలో ఏ ఒక్క దానిలోనూ జోక్యం చేసుకొనేది కాదు. పైగా వారికున్న విభేదాల వల్ల పరస్పరం కలహించుకున్నప్పుడు ఇస్లామీయ ప్రభుత్వం ముందుకు వచ్చి వారి వివాదాలు తీర్చి వారు ఎదుర్కొంటున్న బాధల్ని నివారించడంలో సహకరించేది.

ఉదాహరణకు గ్రీక్ క్రైస్తవుల "మల్కి" వర్గం రోమన్ సామ్రాజ్య కాలంలో ఈజిప్టు నీగ్రో క్రైస్తవులను ఎల్లప్పుడు హింసిస్తూ ఉండేది. ఆ వర్గం ప్రజలు నీగ్రో క్రైస్తవుల చర్చీలను లూటీ చేసేవారు. ముస్లింలు ఈజిప్టును జయించిన తర్వాత ఆ నీగ్రో క్రైస్తవుల వస్తుసామగ్రిని తిరిగి ఇప్పించి వారికి న్యాయం చేకూర్చారు.

ఆ తర్వాత నీగ్రో క్రైస్తవులు ఆ మల్కీ క్రైస్తవులపై వారు చేసిన పూర్వపు అత్యాచారాలకు బదులుగా ప్రతీకారం తీసుకోవడం ప్రారంభించారు. అప్పుడు ఆ మల్కీ క్రైస్తవులు ఖలీఫా హారూన్ రషీద్ వద్దకు వచ్చి ఫిర్యాదు చేస్తే ఆయన నీగ్రో క్రైస్తవుల అధీనంలో ఉన్న సర్వ వస్తుసామగ్రిని, చర్చీలను తిరిగి వారికి ఇప్పించారు. హారున్ రషీద్ వారి పీటర్ ఆఫ్ యార్క్‌తో సంప్రదించిన తర్వాతనే ఈ చర్య తీసు కున్నారు.

## యోహాన్ చర్చీ దృశ్యం

ముస్లింలు ఈ దేశాలను జయించిన తర్వాత అనేక చర్చీలలో ముస్లింలు, క్రైస్తవులు కలిసి నమాజు చేసుకునేవారు. స్వయంగా దైవప్రవక్త కాలంలో, ఆయన (సఅసం) నజ్రాన్ క్రైస్తవులకు మస్జిదె నబవీలో నమాజు చేసుకునే సకల సౌకర్యాలు కలుగజేశారు. మస్జిదె నబవీలో రెండవ వైపు ముస్లింలు తమ నమాజు చేసుకొనేవారు.

అలాగే ఇస్లాం డెమాస్కస్‌ను జయించిన తర్వాత అక్కడి యోహాన్ చర్చిలో (తర్వాత అది ఉమ్‌వి విశ్వవిద్యాలయం పేరుతో ప్రసిద్ధి గాంచింది) క్రైస్తవులు తమ

పద్ధతి ప్రకారం ఆరాధన చేసుకోవడాన్ని ముస్లింలు ఆటంకపరచలేదు. వారు విశాల హృదయంతో ఆ చర్చీలో క్రైస్తవులు తమ నమాజు చేసుకోవడానికి అనుమతించారు. అందుకు క్రైస్తవులు సంతోషించి స్వయంగా దానిలోని అర్థభాగాన్ని ముస్లిం ల అధీనం చేశారు. అక్కడ ముస్లింలు, క్రైస్తవులు కలిసి తమ ఆరాధనల్ని చేసుకునేవారు. రెండు విభిన్న మతాల ప్రజలు కలిసి ప్రక్క ప్రక్కనే తమ తమ ఆరాధనల్లో నిమగ్నులై ఉండడం ప్రపంచంలో మరెక్కడా కానరాదు. ముస్లింలు పడమర దశకు తిరిగి ఉంటే వారు తూర్పు దిశలో తిరిగి ఉన్నారు. చరిత్రలో ఓ మహోజ్వల దృశ్యంగా ఇది నిలిచి ఉంది. ఇస్లామీయ సంస్కృతి మత దురభిమానం, అసూయ, ద్వేషాలు వంటి మాలిన్యాలకు దూరంగా ఎంత పరిశుద్ధంగా ఉందో, మత సహనంలో అది ఎంతటి ఉన్నత శిఖరాన్ని అధిరోహించిందో దీన్నిబట్టి అర్థం చేసుకోవచ్చు.

## మత విచక్షణ లేకుండా పదవులు

ఇస్లామీయ ప్రభుత్వంలో అనన్యమైన మత సహనానికి ఇంకో సాక్ష్యాధారం ఏమంటే ముస్లింలు అత్యంత అర్హులయిన వ్యక్తుల్ని ఎంపికచేసి వారికి ప్రధానమైన పదవుల్ని కట్టబెట్టారు. ఈ విషయంలో యోగ్యుడు, అర్హత గల ఆ వ్యక్తి ఏ మతానికి చెందినవాడని చూడలేదు. అందువల్ల బనూ ఉమయ్యా, బనూ అబ్బాస్ ఖలీఫాల దర్బారుల్లో క్రైస్తవ వైద్యులు పెద్ద పెద్ద పదవుల్ని నిర్వహించారు.

ఖలీఫాల పాలనలో బగ్దాద్, డెమాస్కస్ వైద్యాలయాల్లో క్రైస్తవులు చాలా కాలం వరకు అధిపతులుగా కొనసాగారు. క్రైస్తవ వైద్యుడయిన ఇబ్నె ఆసాల్ అమీర్ మావియాకు ప్రధాన వైద్యుడుగా ఉండేవాడు. ఇంకో క్రైస్తవుడు సర్‌జోన్ ఆయనకు కార్యదర్శిగా ఉండేవాడు. మర్వాన్ ఖలీఫా అన్న సియూస్‌ను ఇస్‌హాఖ్ అనే క్రైస్తవునితో పాటు ఈజిప్టు ప్రభుత్వంలో కొన్ని ముఖ్య పదవుల్లో నియమించాడు. అలా వారు పదవిని అంచెలంచెలుగా దివాన్ ప్రధానాధికారి పదవిని సైతం అలంకరించారు.

ఈ వ్యక్తి చాలా ఉన్నత స్థానం కలవాడు. గొప్ప సంపన్నుడు కూడా. అతనికి నాలుగు వందల మంది బానిసలు ఉండేవారు. అనేక గ్రామాలకు, తోటలకు అతను యజమాని. అతని వద్ద అపార ధనరాసులు ఉండేవి. అతడు "అర్రహా"లో ఒక చర్చీని నిర్మించాడు. అతనికి నాలుగు వందల దుకాణాలపై వచ్చే ఆదాయంతో ఆ చర్చీని కట్టించాడు. అతనికి గల కీర్తి, ప్రఖ్యాతుల వల్ల అబ్దుల్ మలిక్ తన చిన్న

సోదరుడైన అబ్దుల్ అజీజ్‌కు విద్య, శిక్షణ ఇచ్చే బాధ్యతను అప్పగించారు. తర్వాత అబ్దుల్ అజీజ్ ఈజిప్టు గవర్నర్‌గా నియమితులయ్యారు. ఈ అబ్దుల్ అజీజ్ కుమారుడే ప్రముఖ ఖలీఫా హజ్రత్ ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ (ర).

## బనూ అబ్బాస్ కాలంలో

ఖలీఫాలు ఏ క్రైస్తవ వైద్యులకు పెద్ద పెద్ద పదవుల్ని ఇచ్చి సత్కరించారో వారిలో జర్‌జీస్ బిన్ బఖ్తిఘూ కూడా ఒకడు. ఇతనికి ఖలీఫా మన్సూర్ వద్ద గొప్ప స్థానముండేది. ఖలీఫా స్వయంగా అతని సుఖసౌఖ్యాల విషయంలో అత్యంత శ్రద్ధ చూపేవాడు. జర్‌జీస్‌కు వృద్ధురాలయిన ఓ భార్య ఉండేది. అందువల్ల మన్సూర్ అతనికి ముగ్గురు అందమయిన దాసీలను పంపించాడు. కానీ జర్‌జీస్ మాత్రం "ఒక భార్య ఉండగా రెండవ వివాహం చేసుకోవడానికి నా మతం అనుమతించద"ని చెప్పి తిరస్కరించాడు. అందుకు మన్సూర్ మహానందభరితుడై అతనికి పదవోన్నతి కల్పించాడు. జర్‌జీస్ రోగగ్రస్తుడయినప్పుడు మన్సూర్ అతడ్ని అతిథి గృహానికి రప్పించి పరామర్శించడానికి స్వయంగా నడిచి వెళ్ళాడు. జర్‌జీస్ తన తాతముత్తాతల వద్దే సమాధి అయిపోవాలని, స్వదేశం వెళ్ళిపోవడానికి అనుమతించాల్సిందిగా మన్సూర్‌కు విన్నవించుకున్నాడు. అప్పుడు మన్సూర్ అతనికి స్వర్గప్రాప్తి లభించడం కోసం ఇస్లాంను స్వీకరించమని కోరాడు. అందుకతడు "నా తాతముత్తాతలు స్వర్గంలో ఉన్నా, నరకంలో ఉన్నా నేనూ అక్కడే ఉంటాన"ని జవాబిచ్చాడు. అది విని మన్సూర్ మందహాసం చేసి అతని ప్రయాణానికి కావలసిన ఏర్పాట్లన్నీ సమకూర్చవలసినదిగా ఆజ్ఞలు జారీచేశాడు. పదివేల వరహాలు బహూకరించి అతడ్ని అతని స్వదేశానికి పంపించివేశాడు.

అలాగే మరో క్రైస్తవుడయిన సల్మూయ బిన్ బనాన్ ఖలీఫా ముఅతసిమ్‌కు ప్రధాన వైద్యుడు. ఇతడు మరణించినప్పుడు ముఅతసిమ్ అమితంగా దుఃఖించాడు. అతనికి సమస్త రాజలాంఛనాలతో, క్రైస్తవ మతాచారం ప్రకారం ఖననం చేయాల్సిందిగా ఆజ్ఞాపించాడు.

అలాగే బఖ్తిషూ బిన్ జిబ్రాయీల్ ఖలీఫా ముతవక్కల్‌కు ప్రధాన వైద్యుడు అతనికి అత్యంత గౌరవ స్థానముండేది. ఇతడు ఎనలేని ధనసంపత్తిలో, విలువైన

వస్త్రధారణలో, డాబూ, దర్పంలో స్వయంగా ఆనాటి ఖలీఫాతో పోటీపడుతుండేవాడు.

## ముస్లిమేతర సాహిత్యవేత్తలు

సాహిత్యవేత్తలు, కవుల పట్ల కూడా ఖలీఫాలు ఎనలేని ఆదరణ చూపారు. బనూ అబ్బాస్, బనూ ఉమయ్య తదితర ముస్లిం పాలకుల దర్బారుల్లో ఒక్క విద్యా పాండిత్యాల్లో మినహాయిస్తే కవులందరూ జాతి మత భేదాలు లేకుండా సమానంగా గౌరవం పొందేవారు. ఉమ్‌వి దర్బారులో అఖ్‌తల్ కవికి ఉన్న స్థానమేమిటో చరిత్రకారులందరికీ తెలుసు. అతడు తలచినప్పుడు ఖలీఫా వద్దకు వెళ్ళడానికి అనుమతి లభించడం వల్ల అతడు ఖలీఫా అబ్దుల్ మలిక్ వద్దకు రాత్రి పగలు అనక ఎప్పుడనుకుంటే అప్పుడు వచ్చేవాడు. పట్టు వస్త్రాలు ధరించేవాడు. బంగారు గొలుసుకు వ్రేలాడుతున్న శిలువ మెళ్ళో ఉండేది. గడ్డం నుండి సారాయి బొట్లుబొట్లుగా పడుతుండేది.

అతను ఒకసారి మదీనా అన్సారులను నిందిస్తూ ఓ కవిత వ్రాశాడు. అందులో "అవమానం, నైచ్యం అన్సారుల తలపాగాల్లో ఉన్నద"ని రాశాడు. దానిపై అన్సారులకు చాలా బాధ కలిగింది. అందువల్ల వారు తమలో అత్యంత గౌరవనీయుడు అయిన హజ్రత్ లుఖ్మాన్ బిన్ బషీర్ (రజి)ను అబ్దుల్ మలిక్ వద్దకు పంపించారు. ఆయన అబ్దుల్ మలిక్‌ను కలిశారు. తన తలపాగను తీసి, దాని లోపలి భాగాన్ని, తన తలను చూపిస్తూ "అమీరుల్ మూమినీన్! ఇక్కడ అవమానం, నైచ్యం, ఎక్కడుందో చూపండి" అని అడిగారు. అందుకు అబ్దుల్ మలిక్ బాధపడుతూ మన్నించమని ఎంతో ప్రాధేయపడ్డాడు. ఖలీఫా పలు విధాలుగా సముదాయించి ఆయన కోపాన్ని చల్లబరిచాడేకాని అఖ్‌తల్ ప్రేలిన ప్రేలాపన పట్ల పెదవి విప్పి ఒక్కమాట కూడా మాట్లాడలేదు. ముస్లిం పాలకుల మత సహనానికి ఇంతకంటే ఉదాహరణ ఇంకేం కావాలి?

## ముస్లిమేతరుల పట్ల అధికారుల ప్రవర్తన

ఈ విషయంలో ముస్లిం సమాజంలోని ప్రముఖ వ్యక్తులు, అధికారులు, షరీఅత్ పండితులు (రిజాల్) ఖలీఫాల వలె విశాల హృదయం కలిగి ఉండేవారు. వారి మైత్రి వారి మత ధర్మ పరిధి కేవలం స్వీయ మతుస్తుల వరకే పరిమితం కాలేదు. ఉదాహరణకు ఇబ్రాహీం బిన్ బిలాల్ మజూసీల (అగ్ని ఆరాధకుల) ఓ ప్రత్యేక వర్గం "సాయిబ"కు చెందినవాడు. అతను ఇస్లామీయ ప్రభుత్వంలో పెద్ద

పెద్ద పదవుల్ని అలంకరించాడు. అతడు కవులను ఆదరించి సత్కరించేవాడు. అతని జీవన కార్యకలాపాలు కూడా స్వీయ మతస్తుల వరకే పరిమితం కాలేదు. అతనికి ముస్లిం విద్యావేత్తలు, సాహితీకారుల మధ్య మంచి పలుకుబడి, సత్సంబంధాలు ఉండేవి. అందుకు ప్రత్యక్ష నిదర్శనం ఏమంటే అతడు మరణించినప్పుడు షరీఫ్ రజీ ఓ సుదీర్ఘ కావ్యం ఆలాపించాడు. అది "ఖసీద వాలియ" అనే పేరుతో ప్రసిద్ధిగాంచింది. అయితే షరీఫ్ రజీ హాష్మీలు షియాలకు నాయకుడు. అతడు తన కావ్యంలో ఇలా అంటాడు :

"అతడ్ని కట్టెలపై మోసుకుపోవడం మీరు చూశారు. ఆ అగ్ని వెలుగు ఎలా ఆరిపోయిందో కూడా మీరు చూశారు."

"నీవు ఖననం గావించబడక ముందు సమాధుల్లో పెద్ద పెద్ద పర్వతాలు కూడా సమాధి చేయబడతాయని నాకు తెలియదు."

ఆ తర్వాత కూడా షరీఫ్ రజీ అతడ్ని మరిచిపోలేదు. అవకాశం దొరికినప్పుడల్లా అతని మీద కావ్యం చెబుతుండేవాడు. ఓసారి రజీ అతని సమాధి (ఈ మజూసీలు పూర్వం తమ శవాలను ఖననం చేసేవారా? మజూసీలోని "సాయిబ" వర్గం ఈ ఆచారాన్ని పాటించిందా? ఈ అంశం పరిశీలించాల్సి ఉంది) వద్దకు వెళ్ళడం జరిగింది. అక్కడ ఆయనకు దుఃఖం పొంగిపొరలింది. ఆ తరుణంలో ఆయన పలికిన కావ్యం గమనార్హం.

"నాతోటి బాటసారుల్ని ఈ సమాధి వద్దకు రమ్మని పిలుస్తున్నాను. నేను వారికి ఔన్నత్యానికి చెందిన ఏకాంత కుహర భాగాన్ని చూపిస్తాను."

"నా మనశ్శాంతి కోసం నేను నీ గురించి దుఃఖిస్తాను. అయినా ఆవేదన ఇంకా అధికమయిపోయింది. అంటే కావ్యాలు కష్టాల్ని దూరం చేయలేవు."

"నీ గురించి దుఃఖించడం అప్రయోజనమేనని నాకు తెలుసు. కాని కోరికలు నన్ను ఆశావాదిని చేసివేశాయి."

## జ్ఞాన వేదికలు

ఖలీఫాల పాలనలో జ్ఞానవేదికలను ఎల్లప్పుడూ విభిన్న మతాల పండితులు అలంకరించేవారు. ఖలీఫా మామూనుర్రషీద్‌కు ఓ ప్రత్యేక జ్ఞానవేదిక ఉండేది. అందులో అనేక మతాల ధర్మవేత్తలు ఉండేవారు. అందుకే ఖలీఫా "మీ వాదోప

వాదాలు, విమర్శలు, విద్య, కళల వరకే పరిమితంగా ఉండాలని, ఎవరూ తమ మత గ్రంథం ద్వారా ఆధారాలు వెతకాల్సిన అవసరం లేదని, అలా చేయడం వల్ల వర్గ విభేదాలు, సమస్యలు, ఇబ్బందులు ఉత్పన్నమవుతాయ"ని అనేవాడు.

## సాధారణ సభలు

ఇలాంటి పరిస్థితే సాధారణంగా జాతీయ విద్యావేదికలకుండేవి. ఖలఫ్ బిన్ అల్ మస్నే ఇలా అంటారు :

బస్రాలో అత్యంత ప్రతిభా నైపుణ్యాలు గల పదిమంది ధర్మవేత్తలున్న ఒక జ్ఞాన పీఠంలో మేము పాల్గొన్నాము. వారికి గల ప్రత్యేక శాస్త్రాల జ్ఞాన పటిమలో వారిని ఎదిరించగలవారు దేశంలో ఒక్కడు కూడా లేడు. ఆ పదిమంది విద్యావేత్తలెవరో చూడండి :

1. ఖలీల్ బిన్ అహ్మద్ : సుప్రసిద్ధ వ్యాకరణవేత్త. ఈయన సున్నీ మతస్తుడు.
2. హమీరీ కవి : ఈయన షియా మతస్తుడు.
3. సాలెహ్ బిన్ అబ్దుల్ ఖుద్దూస్ : ఈయన ముస్లిమేతరుడు.
4. సుఫ్యాన్ బిన్ మజాష : ఈయన ఖార్జీలలోని నఫ్ని వర్గానికి చెందినవాడు.
5. బషార్ బిన్ బరూ : ఈయన షఉబి వర్గానికి చెందినవాడు.
6. హమ్మాద్ ఇబ్రూద్ : ఈయన జాతీయవాది అయిన ముస్లిమేతరుడు.
7. ఇబ్నె రాయిస్ అతాలూత్ : సుప్రసిద్ధ కవి. ఈయన మతరీత్యా యూదుడు.
8. ఇబ్నె నజీర్ : తత్వవేత్త, ఈయన మతరీత్యా క్రైస్తవుడు.
9. ఉమ్ర్ బిన్ అఖ్తల్ ముబీద్ : ఈయన అగ్ని ఆరాధకుడు.
10. ఇబ్నె సనాన్ అల్ హిరాని కవి : ఈయన సాబీ మతస్తుడు.

వీరందరు ఒకే సమావేశంలో కూర్చొని వివిధ సమస్యలపైన వాదోపవాదాలు, విమర్శలు చేసేవారు. కవిత్వం చెప్పేవారు. చారిత్రక సంఘటనలపై చర్చ జరిగేది. ఇదంతా స్నేహపూర్వక వాతావరణంలో సాగిపోయేది. వారి మధ్య పరస్పరం ఇంతటి మత విభేదాలున్నాయన్న విషయం ఎవరికి ఏమాత్రం తెలిసేది కాదు.

## కుటుంబ వాతావరణం

ఈ మత సహనం కుటుంబాల్లో, గృహాల్లో కూడా సర్వసామాన్యంగా ఉండేది. ఒకే ఇంట్లో నలుగురు సోదరులు నివసిస్తారు. ఒకరు సున్నీ, ఒకరు షియా, ఇంకొకరు మోతజలీ, మరొకరు ఖారిజీ మతానికి చెందినవారు. అయినా వారు పరిపూర్ణ సహకారం, సమైక్యత, ప్రేమానురాగాలతో సహజీవనం గడపడం పలుమార్లు చరిత్ర చూపింది. ఇంకో గృహంలో ఇద్దరు అన్నదమ్ములుంటారు. ఒకరు దైవారాధనలో నిమగ్నమై ఉండగా ఇంకొకరు త్రాగుతూ, తింటూ భోగలాలసలో నిండా మునిగి ఉండడం కూడా చరిత్ర వీక్షించింది.

## పాశ్చాత్య పరిశోధకుల ఆరోపణలు

ఇస్లామీయ నాగరికత, సంస్కృతుల్లో మత సహనం మహోన్నత శిఖరాలను అందుకున్నది. అలాంటి ప్రగతి గత చరిత్రలో ఎక్కడా కానరాదు. ఈ వాస్తవాన్ని న్యాయ ప్రియులయిన పాశ్చాత్య మేధావులు కూడా అంగీకరిస్తూ సాక్ష్యమిస్తున్నారు.

ఈ విషయానికి సంబంధించిన సాహితీ గ్రంథాల్లో ఓ ఆసక్తికరమైన సంఘటన ఉంది. ఒక ఇంట్లో ఇద్దరు సోదరులు నివసిస్తుంటారు. వారిలో ఒకడు అత్యంత దైవభీతిపరుడు. ఇంకొకడు దుష్టుడు, దుర్మార్గుడు, త్రాగుబోతు. దైవభీతిపరుడు క్రింది అంతస్తులోను, దుష్టుడు పై అంతస్తులోనూ ఉంటారు. ఓసారి ఆ త్రాగుబోతు మిత్రులు కొందరు అతని ఇంట్లో గుమిగూడారు. వారు బాగా త్రాగి తందనాలాడుతూ, అల్లరిచేస్తూ, పాపం ఆ దైవభీతిపరుడ్ని రాత్రంతా నిద్రపోనివ్వలేదు. అతడు ఇక భరించలేక లేచి వెళ్ళి తన సోదరుణ్ణి సంబోధిస్తూ "దేవుడు తమల్ని భూస్థాపితం చేస్తాడన్న భయం లేకుండా దుర్జనులు ఎంత ప్రశాంతంగా ఉన్నారు!" అని అన్నాడు. అందుకు అతని సోదరుడు వెంటనే "నీవు దుర్జనుల మధ్య ఉన్నంత వరకు దేవుడు వారిని శిక్షించడు" అని సమాధానమిచ్చాడు.

(ఇది ఖుర్ఆన్ ఆయత్ అనువాదం. దీనిలో "నీవు" అని ప్రవక్త (సఅసం) నుద్దేశించి సంబోధించబడింది. కాని ఈ సమయం అతడు ఈ ఆయత్‌ను చదవడంలో ఎంత లోతైన భావముందో గమనించాల్సి ఉంది. ఆ శ్రద్ధాసక్తి, జ్ఞాపకశక్తిని గ్రహించాల్సిన అవసరముంది. అందువల్లే సాహితీ గ్రంథాల్లో ఈ ఘటన ప్రస్తావించబడింది).

## ముస్లిమేతరుల ఉత్సవాల్లో పాల్గొనడం

అలాగే ముస్లిమేతరుల ఉత్సవాల్లో ఇతర వర్గాలతో కలిసి ముస్లింలు అత్యంత ఉత్సాహంతో పాల్గొనేవారు. ఉదాహరణకు ఉమ్‌వి పాలన తర్వాత క్రైస్తవులు రహదారులపై తమ సమావేశాలను జరుపుకునేవారు, ఊరేగింపులు తీసేవారు. ఆ సమయాల్లో కొందరు క్రైస్తవులు శిలువలను ఎత్తుకొని ఊరేగింపు ముందు నడిచేవారు. వారి మత నాయకులు ప్రత్యేక వస్త్రాలు ధరించి వారితోపాటు ఉండేవారు.

ఒకసారి పీటర్ యార్క్ మైకేయిల్ అనే అతను ఓ పెద్ద ఊరేగింపుకు నాయకత్వం వహిస్తూ అలెగ్జాండ్రియాలో ప్రవేశించాడు. అతని ముందు జనం శిలువలు, దివిటీలు, బైబిళ్ళు పట్టుకొని నడుస్తున్నారు. మరో వైపు "దేవుడు మనకోసం అభినవ మర్ఖస్ అయిన ఒక శాంతి దూతను పంపించాడు" అంటూ క్రైస్తవ సాధువులు నినాదాలు చేస్తున్నారు. ఇది ఖలీఫా హషామ్ బిన్ అబ్దుల్ మలిక్ కాలం నాటి సంఘటన.

రషీద్ పాలనా కాలంలో క్రైస్తవులు ఈస్టర్ పండుగ సందర్భంలో శిలువలను ఎత్తుకొని ఓ పెద్ద ఊరేగింపు రూపంలో బయలుదేరేవారు. అల్ ముఖద్దసీ తన గ్రంథం "అహ్సనుల్ తఖాసీమ్"లో ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ, "క్రైస్తవుల ఉత్సవాల సందర్భంలో షీరాజ్ నగర వీధులన్నీ అలంకరించబడేవి. నైలునదిలో నీరు అధికమయ్యే రుతువు రాగానే క్రైస్తవులు శిలువోత్సవం జరుపుకుంటుండగా వారితో పాటు ఈజిప్టు వాసులు కూడా ఉత్సాహంగా ఆ వేడుకల్లో పాల్గొనేవారు" అని వ్రాశాడు.

మఖ్‌రజీ తన గ్రంథం "ఖతత్"లో క్రైస్తవ పండుగలు స్వేచ్ఛాయుత వాతావరణంలో జరుగుతుండిన వైనాన్ని వర్ణిస్తూ అఖ్‌షిదీల పరిపాలనలో ప్రజలు బాప్టిస్మ్ ఉత్సవాన్ని అమితోత్సాహంతో జరుపుకునేవారు. హిజ్రీ 230వ శతాబ్దంలో బాప్టిస్మ్ ఉత్సవం అత్యంత వైభవంగా జరుపబడింది. ముహమ్మద్ బిన్ అఖ్‌షదీ నైలు ద్వీపంలోనున్న తన ప్రత్యేక భవనంలో ఉన్నాడు. అతని చుట్టూ వేయి లాంతర్లు వెలిగించబడ్డాయి. జాతి కూడా అలాగే చేసింది. అసంఖ్యాకంగా దివిటీలు, దీపాలు, లాంతర్లు వెలిగించబడ్డాయి. వేలాది ముస్లింలు, క్రైస్తవులు గుమిగూడారు. ఇండ్ల కప్పులమీద, కాలువల ఒడ్డున ఇసుకవేస్తే రాలనంతగా ఉంది ప్రజావెల్లువ. ప్రజలు అందమైన వస్త్రాలు ధరించారు. వివిధ రకాల పదార్థాలు, పానీయాలు వెండిపాత్రల్లో తీసుకురాబడ్డాయి. ఆ రాత్రి ప్రధాన ద్వారాలు మూసివేయబడలేదు. స్నానం చేయడం

ఎన్నో జబ్బులు నయమవుతాయన్న విశ్వాసంతో చాలామంది ప్రజలు చెరువుల్లో మునుగుతూ, తేలుతూ బాప్టిస్మ్ రాత్రి స్నానం చేశారు" అని రాశాడు.

## అద్భుత సహనం

అంతకంటే ఆశ్చర్యకరమైన విషయం ఏమంటే మతసహనం, ప్రేమాభిమానాల ఈ ప్రదర్శన క్రైస్తవ మత యుద్ధాలు జరుగుతున్న కాలంలో కూడా పాటించబడింది. ఆ యుద్ధాల సందర్భాల్లో కూడా దాని వైఖరిలో ఏమాత్రం మార్పు రాలేదు. ఆ యుద్ధాలలో పాశ్చాత్య శక్తులు మతం పేరు మీద నడుం బిగించి ఇస్లామీయ దేశాల మీద దండెత్తాయి. అగ్రిహాల ఇబ్నె జుబైర్ ఇలా వ్రాస్తారు :

"అన్నింటికి మించిన వింత విషయం ఏమంటే, ముస్లింలు, క్రైస్తవుల మధ్య హెూరాహెూరీగా యుద్ధం సాగుతూ ఉంది. ఇరువురి సైన్యాలు పరస్పరం పోరాడు కోవడానికి పలుమార్లు ఢీకొన్నాయి. అయినప్పటికీ క్రైస్తవ, ముస్లిం మిత్రుల ప్రతినిధి బృందాలు ఒక చోటు నుండి ఇంకోచోటికి యధేచ్ఛగా వస్తూ పోతున్నాయి. పరస్పరం కలుసుకుంటున్నారు. అందుకు ఎవరికీ ఎలాంటి అభ్యంతరం లేనేలేదు. వర్తక బృందాలు ఈజిప్టు నుండి డెమాస్కస్‌కు, అక్కడి నుండి ఆంగ్లేయ దేశాలకు స్వేచ్ఛగా పోతూ ఉండేవి. ముస్లింలు క్రైస్తవులకు వారి దేశాల్లో సహృదయంతో పన్ను చెల్లిస్తున్నారు. క్రైస్తవ వ్యాపారులు ముస్లిం దేశాల్లో తమ వస్తు సామగ్రికి పన్ను కడుతున్నారు. అందులో పూర్తి న్యాయాన్ని పాటిస్తున్నారు. మరోవైపు ఇరు సైన్యాలు యుద్ధం సలుపుతున్నాయి. ఎవరు విజేతలో వారిదే లోకం తప్ప ప్రజలు మాత్రం అతి ప్రశాంతంగా మనుగడ సాగిస్తున్నారు."

సుప్రసిద్ధ అమెరికన్ రచయిత మిస్టర్ డ్రేపర్ ఏమంటున్నాడో చూడండి:

"ఖలీఫాల కాలంలో క్రైస్తవ, యూదు విద్యావేత్తలు కేవలం గౌరవించబడే వారే కాదు, ముస్లిం ప్రభువులు వారికి పెద్ద పెద్ద పదవుల్ని కూడా కట్టబెట్టారు. వారిని కీలకమైన పదవుల్లో నియమించి గౌరవించారు. ఖలీఫా హారూన్ రషీద్, హనా బిన్ మాసూయాకు విద్యాశాఖ డైరెక్టర్ పదవినిచ్చి మొత్తం పాఠశాలల్ని, కళాశాలలను అతని అధీనం చేశాడు. హారూన్ రషీద్ ఓ విద్యావేత్త కనుక వ్యక్తి ఏ దేశస్థుడు, ఏ విశ్వాసం, ఏ మతానికి చెందినవాడని చూసేవాడు కాడు. ఆయన కేవలం విద్వాంసుని జ్ఞాన పటిమను చూడడం తప్ప వేరే దేనిపైనా దృష్టి పోనిచ్చేవాడు కాదు."

ఆధునిక యుగానికి చెందిన సుప్రసిద్ధ చరిత్రకారుడు మిస్టర్ విల్స్ ఇస్లామీయ విద్యలపై చర్చిస్తూ ఇలా వ్రాస్తున్నారు:

"ఇస్లామీయ విద్యా, శిక్షణలు ప్రపంచానికి న్యాయమైన, గౌరవనీయమైన ప్రవర్తనా సరళికి కావలసిన మహోన్నతమైన ఆచార నియమాలను ప్రసాదించాయి. అవి ప్రజల్లో గౌరవ మర్యాదలను, సామరస్య జీవామృతాన్ని చిలికిస్తాయి. అవి అత్యున్నతమైన మానవీయ విద్యా శిక్షణలు, ఆచరణ యోగ్యమైనవి. ఆ విద్య, శిక్షణలు ఓ వినూత్న సమాజాన్ని ఆవిర్భవింపజేశాయి. ఆ సమాజాన్ని, దానికి ముందున్న సమాజాలతో పోల్చిచూస్తే అందులో హృదయకాఠిన్యత, సామాజిక హింస అతి స్వల్పంగా మాత్రమే మనకు కనిపిస్తాయి."

ఆయన ఇంకా ఇలా అంటున్నాడు :

"ఇస్లాం మృదుత్వం, సామరస్యం, సత్ప్రవర్తన, సౌభ్రాతృత్వాలతో విరాజిల్లింది."

సర్ మార్క్ సొయిస్ ఖలీఫా హారూన్ రషీద్ కాలంలో ముస్లిం రాజరికపు లక్షణాలను ఉల్లేఖిస్తూ ఇలా అంటాడు :

"క్రైస్తవులు, బహు దైవారాధకులు, యూదులు, ముస్లింలు అందరూ కలిసి ఇస్లామీయ ప్రభుత్వ కార్యకర్తలుగా సమాన ప్రతిపత్తితో బాధ్యతల్ని నిర్వహించారు."

తర్నూన్ తన అభిప్రాయాన్ని ఇలా వెలిబుచ్చాడు :

"కవులు, విద్వాంసులు సంగీతకారుల విషయంలో ముస్లింల ధర్మం ఏమాత్రం జోక్యం చేసుకునేది కాదు."

లీఫీ బరంట్ సాల్ "పదవ శతాబ్దపు స్పెయిన్" అనే తన గ్రంథంలో ఇలా అంటున్నాడు :

"ఏ విధంగానైతే యూదుల్ని, క్రైస్తవుల్ని పెద్ద పెద్ద పదవుల్లో నియమించడం జరిగిందో అలాగే సంధి, ఒడంబడికల్ని వ్రాసే గౌరవం కూడా వారికి పలుమార్లు లభించింది. అంతేకాదు, వారు పాలనా నిర్వహణలో కీలకమైన శాఖల్లోను, అంతకుమించి యుద్ధ వ్యవహారాల్లోనూ, సర్వాధికారులుగా ఉండేవారు. ఇంకా చాలా మంది యూదులు ఐరోపా దేశాల్లో ఖలీఫాల రాయబారులుగా నియమించబడ్డారు.

మిస్టర్ రీనో "ఫ్రాన్స్, స్విట్జర్‌లాండ్, ఇటలీ, మధ్యధరా సముద్ర ద్వీపాల్లో అరబ్బుల యుద్ధ చరిత్ర" అనే గ్రంథంలో వ్రాస్తారు : "ఫ్రాన్స్ నగరాల్లో క్రైస్తవుల పట్ల ముస్లింలు అత్యంత ఉత్తమ రీతిలో ప్రవర్తించేవారు. అలాగే యూదులు, క్రైస్తవుల ముస్లింల భావోద్రేకాలను పూర్తిగా గౌరవించేవారు. ఉదాహరణకు వారు (యూదులు, క్రైస్తవులు) తమ పిల్లలకు "ఖత్‌నా" చేయించేవారు, పందిమాంసం భుజించేవారు కాదు.

## ఆర్నాల్డు సాక్ష్యం

మిస్టర్ ఆర్నాల్డ్ క్రైస్తవుల్లోని వివిధ తెగల ధార్మిక దృక్పథాలను చర్చిస్తూ ఇలా తెలుపుతున్నారు :

"అయితే ఇస్లాంలోని మత సహనం సూత్రాలు అలాంటి పనులు చేయడానికి అనుమతించవు. (అలాంటి పనులు అంటే క్రైస్తవ తెగల ప్రవర్తనా తీరు తెన్నులన్నమాట). అందువల్ల ముస్లింల ప్రవర్తనా సరళి ఇతర మతస్తుల వైఖరికి భిన్నంగా ఉండింది. అంతేకాదు, ఇతర మత వర్గాలు మత విద్వేషం వల్ల పరస్పరం చేసుకున్న హింసల్ని ముస్లింలు సహించలేదని మన ముందున్న చరిత్ర సాక్ష్యమిస్తున్నది. ముస్లింలతో కలసి నివశిస్తున్న క్రైస్తవుల విభిన్న తెగల మధ్య న్యాయంగా, ధర్మబద్ధంగా వ్యవహరించడంలో ముస్లింలు రవ్వంత కూడా అలక్ష్యం చేయలేదు. ఈజిప్టు జయించబడిన తర్వాత క్రైస్తవుల యాకూబి తెగకు అవకాశం చిక్కగానే మాజీ బజ్‌నతీని రాజ్యానికి చెందిన క్రైస్తవులు చేసిన అత్యాచారాలకు ప్రతీకారంగ వారి వస్తు సామగ్రిపై, చర్చీలపై దాడి జరిపారు. కాని ఇస్లామీయ ప్రభుత్వం సంప్రదాయ వాదులైన క్రైస్తవులు తమ పని చట్టబద్ధంగా రుజువు చేసిన సమస్త సామగ్రిని, చర్చీలను వారికి ఇప్పించి న్యాయం చేకూర్చింది."

మిస్టర్ ఆర్నాల్డు ఇంకా ఇలా వ్రాస్తున్నాడు :

"ఇస్లామీయ ప్రభుత్వ ప్రారంభ దశలో పాలిత జాతి ప్రజలయిన క్రైస్తవుల పట్ల ముస్లింలు ఎంతటి న్యాయం, ధర్మం, మత సహనాలను చూపారో చరిత్ర మనకు తెలుపుతున్నది. కాబట్టి ఇస్లాం ఖడ్గం ద్వారా వ్యాపించిందన్న ప్రచారం అసత్యమని, నిరాధారమని స్పష్టంగా తేలిపోయింది."

## సుదీర్ఘమైన చర్చకు కారణం

మేము ఇస్లామీయ సంస్కృతిలో మత సహనానికి, మత భావాల స్వేచ్ఛకు సంబంధించిన చర్చలో ఇంతటి సుదీర్ఘ సాక్ష్యాధారాలు, నిదర్శనాలు ఎందుకివ్వాల్సి వచ్చిందంటే - అసూయాపరుడైన పాశ్చాత్య చరిత్రకారులు ఇస్లాం ఖడ్గం ద్వారా వ్యాపించిందని, ముస్లింలు బలవంతం, ఒత్తిడి చేసి ప్రజల్ని తమ మతంలో కలిపేసుకున్నారని, ముస్లింలు ముస్లిమేతరుల పట్ల ఎల్లప్పుడూ అత్యంత నీచంగా ప్రవర్తించారని ముస్లిములపై, అపనింద మోపారు. ఆ అపనింద, అసత్య ప్రచారాన్ని ఖండించి ముస్లిమేతరుల్లో చోటుచేసుకున్న అపోహలను దూరం చేయడానికి ఇంత వివరణ ఇవ్వాల్సి వచ్చింది.

## తప్పులెన్నువారు తమ తప్పులెరుగరు

అసూయపరులైన ఈ పాశ్చాత్య చరిత్రకారులు ఇతరులపై బురదజల్లే ముందు తమ ముఖాలపై ఏముందో చూసుకుంటే చాలా బాగుండేది. ఇతరులకై పేనుతున్న త్రాడు తిరిగి తమ మెడకే బిగించి వేస్తుందేమోనన్న సంగతిని వారు విస్మరించారు. ఎందుకంటే అంధులు కూడా స్పష్టంగా చూడగల అతి ప్రకాశవంతమయిన కాంతి ఇస్లామీయ సంస్కృతిలో ఉంది. ఇతరులపై ఆరోపణలు, నీలాపనిందలు వేసే ముందు తామెంత పవిత్రంగా ఉన్నామో పరిశీలించుకోవల్సింది. ఇతర మతస్థుల పట్ల వారి ప్రవర్తనా సరళి ఎంతటి నీచాతి నీచంగా అతి భయంకరంగా ఉందో చరిత్ర మూగసాక్షిగా చెబుతోంది. ఆ వాస్తవాన్ని వారు ఎన్నటికీ కప్పిపుచ్చుకోలేరు.

## పాశ్చాత్యుల మత దురభిమానం

శిలువ యుద్ధ సమయాల్లో స్పెయిన్‌లో ముస్లింలకు వ్యతిరేకంగా పాశ్చాత్యులు మత విద్వేషం వల్ల చేసిన అత్యాచారాల పట్ల మానవతా శిరస్సు సిగ్గుతో వాలిపోయింది. పైగా వారు స్వయంగా పరస్పరం అత్యాచారాలు సాగించుకున్నారు. ప్రొటెస్టెంట్లు, కేథలిక్కులను ఊచకోత కోసి సర్వనాశనం చేసివేశారు. ముఖ్యంగా "సెంట్ బార్ తల్మి" రక్తపాత సంఘటన అత్యంత భయానకమైనది. పోపుల విధానాన్ని సమర్థించే నాయకులు, వారిని వ్యతిరేకించే ఐరోపా జాతుల మధ్య జరిగిన బీభత్సకరమైన యుద్ధాలు వారి లజ్జావిహీనతను, నీతిబాహ్యమైన నడవడికను ఎత్తి చూపిస్తున్నాయి. అలాగే మధ్య యుగంలో పాశ్చాత్య గూఢచారులు ప్రజలను ఎలా

హింసించారో, వారిపై ఎన్నెన్ని అత్యాచారాలు జరిపారో అవన్నీ నైచ్యానికి ప్రతిబింబాలుగా చరిత్రలో నిలిచి ఉన్నాయి.

ఈ దుష్టకార్యాలన్నీ ఐరోపా జాతులు ఎల్లప్పుడు కరుడుగట్టిన అసూయాపరులని, క్రూర స్వభావులని నిరూపించే ప్రత్యక్ష నిదర్శనాలు. వారు ఎన్నడూ విరుద్ధ అభిప్రాయాల్ని, విరుద్ధ విశ్వాసాల్ని సహించలేదు. తమ ప్రత్యర్థులు స్వదేశీయులైనా, తమ సంతతివారయినా సరే. వారి పూర్వ చరిత్రలో మత సహనానికి ఏ ఒక్క ఉదాహరణ కనిపించదు. ఈనాడు కూడా వారు తమ రాజకీయ ఆధిక్యత, సామ్రాజ్యవాద విధానాల వెనుక అదే మత దురభిమానం, సంకుచిత చర్యల్నే నిరాఘాటంగా సాగిస్తున్నారు.

## తుది సాక్ష్యం

ఇక ఇప్పుడు మత సహనానికి ఇస్లాం సూచిస్తున్న విధానాలేమిటో క్రైస్తవ జగత్తులో అత్యంత గౌరవనీయుడు, మహామేధావి, గొప్ప నాయకుని సాక్ష్యాన్ని ముందుంచదలిచాము. ఆయనే ఇన్‌జాకియా వర్గానికి చెందిన పీటర్ యార్క్ మెఖాయిల్, ఆయన క్రీ.శ. 12వ శతాబ్దం అర్థభాగం చివరిలో జీవించాడు. తూర్పు చర్చిలన్నీ దాదాపు 500 సంవత్సరాల వరకు ఇస్లామీయ పాలన క్రింద ఉన్న కాలమది. ఆయన (పీటర్ యార్క్ మెఖాయిల్) ముస్లింల మత సహనాన్ని, తూర్పు చర్చీల మీద రోమన్ క్రైస్తవులు జరిపిన అత్యాచారాలను ప్రస్తావిస్తూ ఇలా వ్రాశారు :

“సర్వశక్తి సంపన్నుడయిన దేవుని గుణగణాల్లో ‘అల్ మున్‌తఖిమ్’ ఒకటి. అంటే భూలోక ఆధిపత్యాన్ని తాను ఎవరికి ఇవ్వాలనుకుంటే వారికి బదిలీచేసేవాడని అర్థం. ఒక్కొక్కప్పుడు ఆయన ఓ నీచుణ్ణి కూడా అత్యంత గౌరవనీయునిగా చేస్తాడు. ఆ కారణం వల్లే దౌర్జన్యపరులైన క్రైస్తవులు శక్తివంతమైన సామ్రాజ్యాన్ని పొందిన తర్వాత మా (ఇన్‌జాకియా క్రైస్తవుల) చర్చిలను ధ్వంసం చేశారు. మా గృహాల్ని దోచుకున్నారు. ఈ దోపిడి మొత్తం దేశంలో భారీ ఎత్తున జరిగింది. దయ, జాలి, సానుభూతులను నిర్దాక్షిణ్యంగా విసర్జించారు. వారు మా పట్ల అత్యంత నీచంగా హేయాతి హేయంగా ప్రవర్తించారు. ఆ సమయంలో రోమ్ సృష్టించిన వ్యథాభరితమైన నరకాన్నుండి మమ్మల్ని విముక్తం గావించడానికి దేవుడు అరేబియా ద్వీప కల్పం

నుండి బనూ ఇస్మాయీల్‌ను పంపించాడు. వాస్తవానికి ముస్లింల ఆధిపత్యం వల్ల మాకు కొంచెం నష్టం వాటిల్లింది. అదేమంటే కేథలిక్ క్రైస్తవుల చర్చీలు మా చేతి నుండి జారిపోయి "ఖల్‌ఖిద్‌దనయ్యా" వారి చేతుల్లోకి వెళ్ళిపోయాయి. ఈ చర్చీలు చాలా కాలం వరకు వారి అధీనంలో ఉండినాయి. అయినా ముస్లింల పాలన ఏర్పడినప్పుడు పూర్వం ఎవరి అధీనంలో ఏ చర్చీ ఉండిందో దాన్ని వారి అధీనంలోనే ఉండనిచ్చారు. ఆ సమయంలో కుబ్రా చర్చీ, హెూరాన్ చర్చీ మా అధీనంలో నుంచి వెళ్ళిపోయాయి. కానీ ఈ స్వల్ప నష్టానికి బదులుగా మాకు గొప్ప ప్రయోజనం చేకూరింది. రోమన్ క్రైస్తవుల ప్రతీకారం, అసూయ, దారుణ హింసల నుండి వారు పెట్టిన కర్కశ, కఠోరమైన బాధల నుండి మేము విముక్తి పొంది ప్రశాంత జీవితం గడుపుతున్నాము.

## లీబాన్ న్యాయ ప్రియత్వం

గుస్తాఫ్ లీబాన్ ప్రకటన మీ ముందుంచుతున్నాము :

"అరబ్బుల వలె దయార్ద్ర హృదయులు, మత సహనం గల విజేతలున్న మరే జాతిని చరిత్ర ఎరుగదు. చరిత్రలో వారి ధర్మంలాంటి పరిశుద్ధమయిన, నిరాడంబరమైన, నిరపాయకరమైన ధర్మం మరొకటి కనపడదు."

ముస్లింల విషయంలో మిస్టర్ లీబాన్ పలికిన ఈ పలుకుల్లో న్యాయప్రియత్వమే కాదు, వాస్తవికత కూడా ఉంది.

ఇస్లామీయ సంస్కృతిలో ఉన్న మానవ మైత్రికి సంబంధించిన మరో కోణం – ఈ కోణం రీత్యా కూడా ఇస్లామీయ సంస్కృతికి మరొకటి సాటి లేదు. శాంతియుత పరిస్థితుల్లో సద్వర్తనం, మృదుత్వం, వృద్ధులపై జాలి, బంధువులు, ఇరుగుపొరుగు వారితో సామరస్యంతో మెలగడం ప్రతి జాతి చేయగలదు. కాని యుద్ధ పరిస్థితుల్లో మాత్రం ప్రజల పట్ల న్యాయవర్తనం, శత్రువుల పట్ల మృదుత్వం కలిగి ఉండడం, పిల్లలు, స్త్రీలు, వృద్ధుల పట్ల జాలి చూపడం, పరాజితుల పట్ల సహనం, ఉదార బుద్ధితో ప్రవర్తించడం అన్ని జాతుల వల్ల కాని పని. ప్రతీ సైన్యాధిపతిలో అలాంటి లక్షణాలు ఉండడం సాధ్యం కాదు. రక్తాన్ని చూడగానే రక్తం ఉడుకెత్తి ఉప్పొంగి పోతుంది. పగ, క్రోధం, అసూయ కట్టలు త్రెంచుకుంటుంది. విజయోన్మాదంలో పడి విజేత విజ్ఞతను కోల్పోతాడు. అలాంటి స్థితిలో అతను పాషాణ హృదయుడై

ప్రతీకారం తీర్చుకుంటాడు. తొలి మానవుడైన ఆదమ్ (అలై) కుమారుడు ఖాబిల్ తన సోదరుడు హాబిల్‌ను హతమార్చినప్పటి నుండి ఇదే జాతుల చరిత్ర. అది ప్రాచీన చరిత్ర అయినా, ఆధునిక చరిత్ర అయినా సరే.

**"వారిద్దరూ ఖుర్బానీ ఇచ్చినప్పుడు, ఒకరి ఖుర్బానీ స్వీకరించబడింది. మరొకరిది స్వీకరించబడలేదు. రెండోవాడు ఇలా అన్నాడు:"నేను నిన్ను చంపి వేస్తాను." సమాధానంగా మొదటివాడు ఇలా అన్నాడు : 'భయభక్తులు గలవారి మొక్కుబడులనే అల్లాహ్ స్వీకరిస్తాడు."** ***(అల్ మాయిద : 27)***

ఆ సందర్భంలో (శక్తి, కీర్తి, యుద్ధం) జీవన ప్రవంతి మకుటాన్ని చరిత్ర కేవలం ఇస్లామీయ సంస్కృతి సారధుల శిరస్సులపై అలంకరించింది, అతడు ఓ సాధారణ సైనికుడయినా, లేక పౌరుడైనా కావచ్చు. ఎందుకంటే యావత్తు సంస్కృతుల్లో కేవలం ఇస్లామీయ సంస్కృతిని పుణికిపుచ్చుకున్న వ్యక్తులే అతి తీవ్ర యుద్ధ సమయాల్లో కూడా అనుపమ న్యాయం, అసాధారణ వాత్సల్యంతో నిండిన మానవత్వాన్ని ప్రదర్శించారు. ముఖ్యంగా మానవుడు హింస, రక్తపాతం జరుపుతూ ప్రతీకారంతో విజృంభిస్తున్న సమయంలో కూడా ముస్లింలు ఈ యుద్ధనీతిని విడనాడలేదు. ఈ విషయాలు గనక చారిత్రక సంఘటనల వల్ల రుజువు కాకపోయినట్లయితే మేము వాటిని ప్రపంచంలో సంభవించలేని కట్టుకథలుగా భావించి కొట్టివేసేవాళ్ళం.

## ఇస్లామీయ సంస్కృతీ శుభాలు

ప్రపంచంలో ఇస్లాం ఆవిర్భవిస్తున్న తరుణంలో ప్రజల పరిస్థితి అడవిలో సంచరించే జంతువుల్లా ఉండేది. బలవంతుడు బలహీనుణ్ణి నిర్భయంగా హత మార్చేవాడు. సాయుధుడు నిరాయుధుణ్ణి నిరభ్యంతరంగా దోచుకునేవాడు. ఒక్క మాటలో చెప్పాలంటే ఆనాడు యావత్తు మతాలు, ధర్మశాస్త్రాలు, జాతులు, వర్గాల మధ్య యుద్ధం నిత్యకృత్యమై పోయింది. దానికి ఎలాంటి చట్టాలుగాని, హద్దులుగాని లేవు. ధర్మాధర్మాలు, న్యాయాన్యాయాల మధ్య ఎలాంటి భేదముండేది కాదు. ఇతర జాతుల భూభాగాలను ఆక్రమించుకోవడానికి, ఆ జాతులు స్త్రీలను దాసీలుగా, పురుషులను బానిసలుగా చేసుకోవడానికి, వాటిని వాటి మత విశ్వాసాలు విడనాడేలా బలవంతం చేయడానికి శక్తి సామర్థ్యాలు కలిగి ఉండే ఏ జాతి అయినా పాపభీతి లేకుండా నిరభ్యంతరంగా, నిరాఘాటంగా ఈ పనులన్నిటినీ చేసేది.

## యుద్ధనీతి

అయితే ఇస్లామీయ సంస్కృతి, ప్రపంచంలో మానవత్వాన్ని దానవత్వం కంటే హీనంగా దిగజార్చిన ఈ దౌర్జన్య వైఖరి కొనసాగడాన్ని ఎంతమాత్రం సహించలేదు. అది జాతుల మధ్య సంబంధాల అధ్యాయంలో అసలు విషయం, పరస్పర సహకారం పరిచయాలుండాలి తప్ప, ద్వేషం, తగాదాలు కావని ప్రకటించింది.

**"మానవులారా! మేము మిమ్మల్ని ఒకే పురుషుని నుండి, ఒకే స్త్రీ నుండి సృజించాము. తరువాత మీరు ఒకరినొకరు పరిచయం చేసుకునేందుకు మిమ్మల్ని జాతులుగానూ, తెగలుగానూ చేశాము. వాస్తవానికి మీలో అందరి కంటే ఎక్కువ భయభక్తులు కలవాడే అల్లాహ్ దృష్టిలో ఎక్కువ గౌరవపాత్రుడు."**

***(అల్ హుజురాత్ :13)***

## ఆయుధశక్తి సమకూర్చుకోవడం దేనికి?

ఏ జాతి అయినా సుఖశాంతులతో జీవించాలని కోరుకోవడంలో తప్పులేదు. అయితే సుఖశాంతుల కోసం మరో జాతితో యుద్ధం చేయడానికి అనుక్షణం సమర సన్నాహాలు చేయడమే తప్పు. అలాంటి పరిస్థితుల్లో ఆ దురాక్రమణను త్రిప్పి కొట్టడానికి సంసిద్ధంగా ఉండాల్సిన బాధ్యత రెండవ జాతిపై ఎంతైనా ఉంది. ఎందుకంటే ఒక జాతి తన స్వీయ రక్షణ కోసం ప్రతీక్షణం అప్రమత్తంగా ఉండకపోతే దురాక్రమణకు అలవాటు పడ్డ జాతి అకస్మాత్తుగా కబళించివేయడానికి చురుకుగా తన పనిలో నిమగ్నమయి ఉంటుంది.

**"మీరు మీ శక్తిమేరకు అత్యధిక బలాన్నీ, కట్టివేసి సిద్ధంగా ఉన్న గుర్రాలను వారిని ఎదుర్కోవడానికి సమాయత్తపరచుకోండి, తద్వారా అల్లాహ్ శత్రువులనూ మీ శత్రువులనూ, ఇంకా మీరు ఎరుగని, కాని అల్లాహ్ ఎరిగిన ఇతర శత్రువులనూ భయకంపితులుగా చెయ్యండి."** ***(అల్ అన్ఫాల్ : 60)***

ఒకవేళ దురాక్రమణాభిలాషి అయిన జాతి తన దుష్టాలోచన విడనాడి సంధి షరతులకు ముందుకు వస్తే, రెండో జాతి నిరభ్యంతరంగా సంధి చేసుకోవడానికి శాంతిహస్తాన్ని ముందుకు చాపాలి. అంతేకాదు, శాంతికోసం తన ఆమోదాన్ని అభిలాషను అమితంగా వ్యక్తం చేయాలి.

**"ప్రవక్తా! శత్రువు గనక సంధీ శాంతుల వైపునకు మొగ్గు చూపితే, నీవు కూడా దానికి సిద్ధపడు. అల్లాహ్‌పై భారం వెయ్యి." *(అల్ అన్‌ఫాల్ : 61)***

కాని ఒకవేళ శత్రువు యుద్ధం చేయాలనే అభిలషిస్తే శక్తిని శక్తే నిరోధిస్తుంది. ఇనుమును ఇనుమే కోస్తుంది కదా.

**"మీతో పోరాడేవారితో మీరూ అల్లాహ్ మార్గంలో పోరాడండి."**

***(అల్ బఖర : 190)***

## యుద్ధలక్ష్యాలు

ఇస్లామీయ సంస్కృతి యొక్క ఇంతటి నిర్దుష్టమైన మౌలిక సూత్రాలు యుద్ధ రంగంలో లభించే వస్తు సామగ్రి కోసం, దోపిడీలు, హత్యలు చేసి జాతుల్ని నీచంగా అవమానపరచే యుద్ధాల్ని ఎంతమాత్రం అనుమతించవు. ఎందుకంటే దాని సూత్రాలు ఇలాంటి యుద్ధాలు అధర్మం అని చెబుతున్నాయి. ఇస్లామీయ యుద్ధ నీతి కేవలం ఈ క్రింది రెండు ఆశయాల్లో మాత్రమే ఏ ఒక్కదాని కోసమైనా యుద్ధం చేయడానికి అనుమతించింది.

1. జాతి నైతికత, దాని సిద్ధాంతాల పరిరక్షణకు.
2. జాతి స్వేచ్ఛ, పటిష్టత, శాంతి భద్రతల్ని కాపాడానికి.

**"పీడన (ఫిత్నా) అంతమయ్యేవరకు, దైవధర్మం స్థాపించబడేవరకు మీరు వారితో యుద్ధం చేస్తూనే ఉండండి." *(అల్ బఖర : 193)***

యుద్ధాన్ని ప్రకటించే జాతికి కావలసింది, కేవలం తన విశ్వాసాల స్వేచ్ఛ మాత్రమే కాదు. అవిశ్వాసుల స్వేచ్ఛను కాపాడేందుకు, సమస్త మతాల ఆరాధనా లయాల్ని పరిరక్షించేందుకు కూడా హామీ ఇవ్వాల్సిన అవసరం ఉంది.

**"అల్లాహ్ గనక ప్రజలను ఒకరి ద్వారా మరొకరిని తొలగిస్తూ ఉండకపోతే, ఆశ్రమాలు, చర్చీలు, యూదుల ప్రార్థనాలయాలు, మశీదులు – వేటిలో అల్లాహ్ పేరు అత్యధికంగా స్మరింపబడుతుందో – అన్నీ ధ్వంసం చేయబడి ఉండేవే." *(అల్ హజ్ : 40)***

## మరో మహెూజ్వల అంశం

ఎలాగయితే ఇస్లామీయ సంస్కృతి ముస్లింల గౌరవ ప్రతిష్ఠలు, స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలపై అణుమాత్రం కూడా మచ్చరాకుండా కాపాడుకునే బాధ్యత వారిపై మోపిందో అదేవిధంగా పీడితులు, బలహీనులపై జరిగే అత్యాచారాలు, అన్యాయాలు, అక్రమాలను ఎదుర్కొని వారిని పరిరక్షించాలన్న బాధ్యతను కూడా మోపింది. ఇస్లాం, ముస్లింలపై మోపిన ఈ బాధ్యత ఎంత మహోన్నతమయిందో ఆలోచించండి.

> **"అసలు మీరు, నిస్సహాయులైన ఆ పురుషులు, స్త్రీలు, పిల్లల కొరకు అల్లాహ్ మార్గంలో పోరాడక పోవటానికి కారణం ఏమిటి? బలహీనులవటంచేత అణచబడి, వారు, "మా ప్రభూ! దుర్మార్గులైన ఈ నగరవాసుల నుండి మాకు విమోచనం కలిగించు. మా కొరకు నీ తరఫు నుండి ఒక సహాయకుణ్ణి, ఒక రక్షకుణ్ణి పంపించు" అని ఫిర్యాదు చేస్తున్నారే!"** ***(అన్ నిసా : 75)***

ఇటువంటి పటిష్టమయిన కట్టుబాట్లతో జరిగేదే అసలు సిసలైన యుద్ధం. విశ్వాసం, వాక్, క్రియల స్వాతంత్ర్యం, శాంతి సౌభాగ్యాలపై జరిగే దౌర్జన్యం, అత్యాచారం, తిరుగుబాటును ఎదుర్కోవడానికి కదన రంగానికి కదిలి రావాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఇలాంటి యుద్ధమే ఇస్లాంలో ధర్మసమ్మతమయింది. ఆ లక్ష్యం కోసం పోరాడే వారే దేవుని సాన్నిహిత్యాన్ని పొందగలరు. వారికే స్వర్గం ప్రాప్తిస్తుంది. దైవమార్గంలో పోరాటం అంటే ఇదేనని, అది తప్ప మరెలాంటి యుద్ధాలు చేయబడినా సర్వనాశనానికి, పుడమిపై ఉపద్రవం, కల్లోలాలు జరపడానికే చేయబడతాయని ఇస్లామీయ సంస్కృతి అంటుంది. ఇస్లామీయ సంస్కృతి సూచించిన ఈ ధర్మ యుద్ధానికి, ప్రపంచ జాతుల మధ్య జరిగే యుద్ధాలకు గల భేదాన్ని ఈ క్రింది ఆయత్‌లో అతి స్పష్టంగా విశదీకరించబడింది :

> **"విశ్వాస మార్గాన్ని ఎన్నుకున్న వారు అల్లాహ్ మార్గంలో పోరాడతారు. అవిశ్వాస మార్గాన్ని ఎన్నుకున్నవారు తాగూత్ మార్గంలో పోరాడతారు. కనుక షైతాన్ సహచరులతో పోరాడండి. వాస్తవంగా షైతాన్ ఎత్తులు ఎంతో బలహీనమైనవని నమ్మండి."** **(అన్ నిసా : 76)**

## యుద్ధం ఎవరితో? ఎంతవరకు?

ఇస్లామీయ సంస్కృతి దేవుని సత్యవాక్యాన్ని ఉన్నతం చేసేందుకు దైవం

నిర్దేశించిన జీవిత విధానాన్ని సంస్థాపించడానికి యుద్ధాన్ని ప్రకటిస్తుంది. ఆ విధానమే సత్య జీవన విధానం. ఇదే శ్రేయస్కరమయినది. ఇదే గౌరవ ప్రదమైన వైఖరి. దీనికి విరుద్ధంగా ఇతరులు ప్రకటించే యుద్ధం ఇతరులపై బలప్రయోగం, పైశాచికత్వం, ప్రపంచంలో అరాచకత్వం, అల్లకల్లోలం జరిపేందుకే జరుగుతుంది. అంతా రక్తపుటేరులతో ముంచివేయబడుంది. చెడు, తిరుగుబాటు, కల్లోలాలకు మారుపేరే పైశాచికత్వం. అందువల్ల మహోన్నతమైన ఇస్లామీయ సంస్కృతి యుద్ధాల లక్ష్యం ఇదయినప్పుడు సత్యమార్గంలో మంచికోసం చేసే యుద్ధం అధర్మానికి, చెడుకు సాధనం ఎన్నటికీ కాజాలదు. ఈ కారణం వల్లే కేవలం మనతో యుద్ధం చేసే వారితో, మనల్ని హింసించే వారితోనే పోరాడాలన్నది ఇస్లామీయ యుద్ధనీతి అధ్యాయంలో ఒక మౌలిక సూత్రమయిపోయింది.

**"మీపై ఎవడన్నా దాడిచేస్తే, మీరూ వారిపై అదేవిధంగా దాడి చేయండి."**
***(అల్ బఖర : 194)***

ఇస్లాం సూచించిన హద్దులను ఉల్లంఘించి యుద్ధానికి సన్నద్ధం కాని వారితో పోరుకు దిగడం, దౌర్జన్యం చేయనివారిపై దౌర్జన్యానికి ఒడిగట్టడం ముస్లింల పని కాదు. అలా చేస్తే మానవత్వంగల యుద్ధానికి మహోన్నత ఆశయాలను ముస్లిములు కాలరాసినవారవుతారు.

**"మీతో పోరాడే వారితో మీరూ అల్లాహ్ మార్గంలో పోరాడండి. కాని హద్దులు అతిక్రమించకండి, హద్దులు అతిక్రమించేవారిని అల్లాహ్ ప్రేమించడు."**
***(అల్ బఖర : 190)***

ఇంకోచోట అల్లాహ్ ఇలా ఆజ్ఞాపించాడు :

**"తమకు అపకారం జరిగినప్పుడు ఎవరైనా ప్రతీకారం చేస్తే, వారిని నిందించటానికి వీలులేదు. అసలు నిందార్హులు ఇతరులకు అన్యాయం చేసేవారే, భూమిపై అన్యాయంగా దౌర్జన్యాలు చేసేవారే. అటువంటి వారికి వ్యథాపూరితమైన శిక్షపడుతుంది."** ***(అష్ షూర : 41, 43)***

కాబట్టి ఎప్పుడైనా యుద్ధాగ్ని ప్రజ్వరిల్లితే ముస్లింలు ఇస్లామీయ యుద్ధనీతిని అనుక్షణం దృష్టిలో పెట్టుకోవాల్సి ఉంటుంది. లేకపోతే వారు అరాచకం, వినాశనానికి కారకులుగా, కఠిన హృదయులుగా పరిగణింపబడతారు. ఎందుకంటే స్వచ్ఛంగా

దేవుని మార్గంలో పోరాడే యుద్ధం అది ఎంత భయంకరమైనదైనా సరే, ఎల్లప్పుడూ మానవత్వపు పరిధుల్లోనే ఉండితీరాలి.

## యుద్ధం గురించి కొన్ని హితవులు

ఈ కారణం వల్ల యుద్ధం గురించి ఇస్లాం నిర్దేశించిన హితవులు మరే ఇతర నాగరికత, సంస్కృతుల చరిత్రల్లో గోచరించవు. ఉదాహరణకు హజ్రత్ అబూబక్ర్ (రజి), హబష్ ఉసామాకు చేసిన హితవులు గమనించండి :

"ప్రజల కాళ్ళు చేతులు నరికి అంగవిహీనుల్ని చేయరాదు. చిన్న పిల్లలను హతమార్చరాదు. యుద్ధం చేయలేని వృద్ధుల్ని చంపకూడదు. స్త్రీల జోలికి పోకూడదు. తోటలను నరికివేయడం గాని, కాల్చివేయడం గాని చేయకూడదు. ఫల వృక్షాలను నరికివేయరాదు. భుజించడానికి అవసరమున్నంత వరకే తప్ప జంతువులను జిబహ్ చేయరాదు. మఠాలు, చర్చీలలో ఆరాధన చేసుకోవడానికి పరిమితమైపోయిన ప్రజల వద్దకు కూడా మీరు వెళ్లినట్లయితే వారి మానాన వారిని వదిలివేయాలి."

చెడు, అత్యాచారం, అరాచకాలను అరికట్టేందుకు కాకుండా కేవలం దైవమార్గంలో జరుపబడే ఇస్లామీయ యుద్ధ రూపు రేఖలు ఎలాంటివో మీరు గమనించారు. ఇస్లాం ఎల్లప్పుడు మానవుల పట్ల కారుణ్యం చూపే సూత్రాల్ని, పద్ధతుల్నే అనుసరిస్తుంది. అది చివరికి శత్రువులతో ఒప్పందం చేసుకోవడమో, లేక విజయం సాధించడమో అనే రెండు ఫలితాల్లో ఏదో ఒక దాన్నే ఎన్నుకుంటుంది. ఒకవేళ ఒడంబడిక జరిగితే అందులోని షరతులను ఖచ్చితంగా పాటిస్తుంది. ఇరుపక్షాల మధ్య జరిగే సంధి షరతులను పూర్తిగా పాటించటానికి ఒత్తిడి చేస్తుంది. ఎందుకంటే ఇక్కడ ఒప్పందం చేసుకోవడమంటే దానిని పాటిస్తామని దైవంతో వాగ్దానం చేసినట్లే.

**"మీరు అల్లాహ్‌తో ఏదైనా వాగ్దానం చేసివుంటే ఆ వాగ్దానాన్ని నెరవేర్చండి. అల్లాహ్ సాక్షిగా చేసిన ప్రమాణాలను దృఢపరచిన తరువాత భంగపరచకండి. అల్లాహ్ మీ పనులన్నింటినీ ఎరుగును."** **(అన్ నహ్ల్ : *91*)**

ఒకవేళ దైవమార్గంలో పోరాడి విజయం సాధిస్తే అది సమాజ విజయం. అమరగతి పొందిన ఆ సమాజ విజయం సత్యధర్మాన్ని స్థాపించి అన్యాయాలను, దౌర్జన్యాలను అరికడుతుంది.

**"మేము గనక వారికి భూమిపై అధికారాన్ని ప్రసాదిస్తే, వారు నమాజ్‌ను స్థాపిస్తారు, జకాత్ ఇస్తారు, మంచి చేయమని ఆజ్ఞాపిస్తారు, చెడు నుండి నిరోధిస్తారు. సకల వ్యవహారాల అంతిమ నిర్ణయం అల్లాహ్ చేతులలో ఉంది." *(అల్ హజ్ : 41)***

విజయం సాధించిన తరువాత ఈ హద్దుల్లో మాత్రమే విజేత తన కార్యకలాపాలను సాగించాలని ఇస్లామీయ సంస్కృతి నిర్దేశిస్తూ, ఉన్నతమయిన ఆధ్యాత్మికత, సామాజిక న్యాయం, ఉత్తమ ప్రవర్తనా సరళి, ప్రజా సంక్షేమ కార్యాల్లో పరస్పర సహకారం, భూభాగంపై అరాచకాన్ని అంతమొందించడం.

ఇవీ ఇస్లామీయ యుద్ధ సూత్రాలు, యుద్ధనీతి. వీటన్నింటిని సమీకరించి న్యాయం, దయ, ప్రమాణ పాలన అని మూడు భాగాలుగా విభజించవచ్చు.

## మాటలే కాదు, చేతలు కూడా

యుద్ధ సమయంలో, ఇస్లామీయ సంస్కృతి సూచించే ఒడంబడిక దాని విధానాల విస్తృత భావాన్ని వ్యక్తం చేయడానికి ఒకటి రెండు వాక్యాలు చెబితే సరిపోదు, ఎందుకంటే కేవలం సూత్రాలను వ్యక్తం చేసి వాటిని బహిరంగంగా ప్రకటించినంత మాత్రాన అది ఒక జాతి వైభవానికి, దాని మానవతా మైత్రికి నిదర్శనం కాజాలదు. ఎన్నో జాతులు ప్రారంభంలో మహోన్నతమైన ఆశయాలతో ప్రజల ముందుకు వచ్చాయి. కాని అవి ఇతర జాతుల పట్ల అత్యంత నీచంగా, కఠిన వైఖరికలిగి మానవతా ప్రమాణాలైన నీతి, న్యాయం, దయాదాక్షిణ్యాలకు బహుదూరంగా వెళ్ళిపోయాయి. ఇది మనం అనాది నుండి గమనిస్తున్న విషయమే. పాశ్చాత్య సామ్రాజ్యవాదం మన దేశంలో ఆడిన నాటకం అందరికీ తెలిసిందే. పాషాణ హృదయంతో అది జరిపిన అకృత్యాల చరిత్ర మన కళ్ళముందుంది. అందువల్ల ఇస్లామీయ సంస్కృతి ఉచ్ఛస్థితిలో ఉన్నప్పుడు దాని సూత్రాల ఆచరణ ఎలా వ్యక్తమయిందో విశదపరచడం చాలా అవసరం.

## ప్రవక్త (సఅసం) కాలం నాటి నిదర్శనాలు

మొట్టమొదట మేము మహాప్రవక్త (సఅసం) జీవిత కాలంలోని కొన్ని ఘట్టాలను వ్యక్తపరుస్తాము. ఎందుకంటే ఆయనే (దేవుని ఆజ్ఞానుసారం) ఇస్లామీయ సంస్కృతి

మూల సూత్రాలను స్థాపించారు. దాని చట్టాలు, నియమ నిబంధనల నిర్మాత కూడా ఆయనే. ఆయనే ఇస్లామీయ సంస్కృతి యొక్క ఆశయాలు, లక్ష్యాలు, నియమాలు, శాసనాలకు సరయిన నిర్వచనం చెప్పగలరు. మహాప్రవక్త (సఅసం) 13 సంవత్సరాల మక్కా జీవితం మీ ముందున్నది. ఈ పూర్తి కాలంలో ప్రవక్త (సఅసం), ఆయన అనుచరులు నిరంతరం ప్రత్యర్థుల అసూయాగ్ని జ్వాలల్ని, వారు పెట్టిన కఠోర బాధల్ని, హింసా కృత్యాల్ని సహించాల్సి వచ్చింది. చివరకు దైవ తిరస్కారులు వారి ప్రాణాల్ని అంతమొందించడానికి కూడా కుట్రలు పన్నారు.

ఆ తరువాత పది సంవత్సరాల మదీనా జీవితాన్ని పరిశీలించండి. ఈ కాలమంతా ఎడతెగని కృషి, నిరంతర పోరాటంలోనే గడిచి పోయింది. ఆ పదేళ్ళ కాలంలో మొత్తం అరబ్ దేశం అధీనమయ్యే వరకు దైవప్రవక్త (సఅసం)కు యుద్ధ దుస్తులు విప్పడానికి అవకాశమే చిక్కలేదు. సాధారణంగా ఈ ప్రపంచంలో ఎల్లప్పుడూ హింసా, దౌర్జన్యాలు, కుట్రలు, కుతంత్రాలతో గడిపే మనిషి హృదయం పాషాణమయిపోతుంది. అలాంటి వ్యక్తి యుద్ధరంగంలో దూకి, ఒకసారి కరవాలం ఎత్తి ప్రత్యర్థిని హతమార్చితే అతని స్వభావమే రక్తమయమైపోతుంది. కాని దైవప్రవక్త (సఅసం) అన్ని యుద్ధాలు జరిపినా, ఆయన నైతిక ప్రవర్తన ఎలా ఉండిందో, ఆయన ఎలాంటి సంస్కృతికి పునాదులు వేశారో గమనించాల్సి ఉంది.

ఉహుద్ యుద్ధంలో దైవప్రవక్త (సఅసం) ఆదేశించిన కొన్ని హితవులకు విరుద్ధంగా ప్రవర్తించడం వల్ల ముస్లింలు ప్రారంభంలో ఓటమిని చవిచూశారు. ఆయన్ని శత్రువులు చుట్టుముట్టి అంతం చేయడానికి మూకుమ్మడిగా దాడి చేశారు. ఆ సమయంలో ఆయన గాయపడ్డారు. ఆయన పవిత్ర దంతమొకటి విరిగిపోయింది. ముఖమంతా లోతయిన గాయాలతో నిండిపోయింది. చివరికి సహాబాలు ప్రాణాలు తెగించి శత్రువుల వలయాన్ని ఛేదించి ఆయనను కాపాడారు. అప్పుడు కొందరు సహాబాలు ఆ దైవతిరస్కారుల్ని శపించమని కోరారు. కాని అలాంటి రక్త పిపాసకుల విషయంలోనూ దైవప్రవక్త (సఅసం) ఏమన్నారో చూడండి :

“దేవుడు నన్ను శపించేవానిగా పంపించలేదు. సందేశకునిగా, కారుణ్యమూర్తిగా పంపించాడు. దేవా! నా జాతి ప్రజలకు ఏమీ తెలియదు, వారికి సద్బుద్ధి ప్రసాదించు” అన్నారాయన.

ఇదీ సత్యప్రియత్వం. అది కొన్ని సమయాల్లో గత్యంతరం లేక యుద్ధం చేస్తుందే కానీ రక్తదాహం తీర్చుకోవడానికి మాత్రం యుద్ధం చేయదు. యుద్ధ మైదానంలో దైవప్రవక్త (సఅసం) నోట వెలువడిన ఈ అమృత పలుకులు రక్త ప్రవాహం ద్వారా రాజ్యాన్ని విస్తరింప చేసుకోవడం ఆయన ఉద్దేశ్యం కాదని, మార్గభ్రష్టులైన మానవులకు రుజుమార్గం చూపించడమే ఆయన ధ్యేయమని సాక్ష్యమిస్తున్నాయి.

ఉహుద్ యుద్ధంలో అగ్రగణ్యుడైన హజ్రత్ హమ్జా (రజి) అమరగతి పొందారు. ఆయన దైవప్రవక్త (సఅసం) పినతండ్రి. అరేబియాలో గుర్రపు స్వారి నిపుణుల్లో ఒకరుగా పరిగణించబడేవారు. అలాంటి హమ్జాను ఉహుద్ యుద్ధంలో వహ్షి అనే బానిస హతమార్చివేశాడు. ఈ హత్య ముందుగా నిర్ణయించబడిన ఒక పథకం ప్రకారం జరిగింది. అబూ సుఫ్యాన్ భార్య హిందా ప్రోత్సాహం, ప్రోద్బలంతో అది జరిగింది.

హజ్రత్ హమ్జా సవారి నుండి క్రింద పడిపోయిన తర్వాత హిందా అమరగతుల శవాలలో ఆయన శవాన్ని వెదకి బయటికి లాగింది. తర్వాత ఆయన గుండెను, కాలేయాల్ని పళ్ళతో నమలి ప్రతీకారం తీర్చుకుంది.

ఇక చూడండి, కాలచక్రం తెచ్చిన విప్లవం. వహ్షి, హిందా ఇద్దరూ ముస్లింలయి మహాప్రవక్త (సఅసం) సమక్షంలో నిలబడ్డారు. ఆయన (సఅసం) వారిద్దరి ఇస్లాం స్వీకారాన్ని అంగీకరించారు. హిందాను క్షమించమని దైవాన్ని వేడుకున్నారు. వహ్షితో "నీవు మాకు దూరంగా జీవితం గడిపితే బాగుంటుంద"ని మాత్రమే అన్నారు.

ఇది తన పినతండ్రి హంతకుని పట్ల, ఆయన గుండెను నమలిన స్త్రీ పట్ల మహాప్రవక్త (సఅసం) ప్రవర్తనా తీరు.

మరొక యుద్ధంలో దైవప్రవక్త (సఅసం) శత్రువర్గంలోని ఓ స్త్రీ పడి ఉండడం చూసి చాలా బాధపడతారు. అప్పుడు ఆయన దైవమార్గంలో పోరాడే వీరుల్ని తీవ్రంగా మందలిస్తూ, "నేను మీకు స్త్రీలను వధించరాదని చెప్పలేదా? ఈమె మీతో పోరాడ్డానికి రాలేదు కదా?" అన్నారు.

చూశారా! ఇస్లామీయ ఉద్యమ సారధి భీకర యుద్ధంలో నిమగ్నులయి ఉండి కూడా తన అనుచరులకు మానవత్వపు విలువల్ని ఎలా నూరి పోస్తున్నారో!

తను రూపొందించిన యుద్ధ నీతిని ఆచరించి చూపిస్తున్న ఈ ఆదర్శ సేనాపతి ఎవరు? ఆయనే అంతిమ దైవప్రవక్త హజ్రత్ ముహమ్మద్ (సఅసం).

ఆయన మక్కాను జయించారు. పదివేల మంది వీరులతో అత్యంత వినయ విధేయతలతో నగరంలో ప్రవేశించారు. పదకొండు సంవత్సరాలుగా ఆయనను అనేక రీతులుగా హింసించి, దూషించి ఓడించిన కుట్రదారులు, అసూయాపరులైన ఖురైషీయులు ఓటమితో, లజ్జాభారంతో ఆయన ముందు తలలు వంచి నిలబడ్డారు. తమ పట్ల ఎలాంటి తీర్పు ఇవ్వబడుతుందోనని ఆందోళన చెందారు. కాని అఖండ విజయం సాధించిన ఆ మహనీయులు ఏమన్నారో వినండి :

"ఖురైష్ వంశస్థులారా! మీపట్ల నేను ఎలా ప్రవర్తించబోతున్నానని మీరు అనుకుంటున్నారు?" అని ఆయన ప్రశ్నించగా దానికి వారు "మీరు మాపట్ల ఉత్తమ రీతిలో ప్రవర్తిస్తారని ఆశిస్తున్నాము. మీరు మంచి సోదరులు. ఓ గౌరవనీయుడైన సోదరుని కుమారులు" అని పలికారు. అప్పుడు ఆయన ఇలా అన్నారు : "ఆనాడు యూసుఫ్ (అలైహిస్సలాం) తన సోదరులతో అన్నట్లుగానే ఈ రోజు నేను మీతో అంటున్నాను. ఈ రోజు మీపై ఎలాంటి నిర్బంధం లేదు. దేవుడు మిమ్మల్ని క్షమించుగాక! ఆయన అపార కృపాశీలుడు, వెళ్ళండి మీరు సర్వస్వతంత్రులు."

ఇదీ దైవప్రవక్త (సఅసం) చూపిన క్రియాత్మక యుద్ధనీతి. అధికారం, పేరు, ప్రతిష్ఠల కోసం యుద్ధంలో రక్తపుటేరులు ప్రవహింపజేసి విజయ గర్వంతో విర్రవీగే జనరల్ కాదాయన. ఆయన ప్రపంచ మానవాళికి మంచిని, ప్రవర్తనా సరళిని ప్రబోధించే విశ్వప్రవక్త హజ్రత్ ముహమ్మద్ (సఅసం).

## శ్రేయస్కర ఖలీఫాల ప్రవర్తనా సరళి

దైవప్రవక్త (సఅసం) తదనంతరం ఆయన ఖలీఫాలు సహాబాలు అన్ని యుద్ధాల్లో, విజయాల్లో అదే ప్రవర్తనా సరళిని అనుసరించారు. వారందరూ దైవప్రవక్త (సఅసం) వెలిగించిన దివ్య జ్యోతితోనే తమ దివ్వెలను వెలిగించుకున్నారు. ఆయన మార్గాన్నే పయనించారు. ఇస్లామీయ సంస్కృతీ సూత్రాల్ని, నియమాల్ని ఆచరిస్తూ పోయారు. కఠినాతి కఠిన పరిస్థితుల్లో, దుర్భర బాధల్లో కూడా వారు తమ

సర్వేంద్రియాలను తమ అధీనంలో ఉంచుకున్నారు. గొప్ప గొప్ప విజయాలు సాధించి కూడా వారు తమ సిద్ధాంతాల్ని మరువలేదు.

## గవర్నర్ తన నిర్ణయాన్ని మార్చుకోవాల్సి వచ్చింది

లెబనాన్‌లోని కొందరు దౌర్జన్యపరులు అక్కడి గవర్నరు అలీ బిన్ అబ్దుల్లా బిన్ అబ్బాస్‌పై తిరుగుబాటు చేశారు. ఆయన వారితో యుద్ధం చేసి వారిని ఓడించారు. వారందరూ మళ్ళీ ఓ బలమైన వర్గంగా సమీకృతులయి దౌర్జన్యం, అల్లరి, తిరుగుబాటు చేయడానికి అవకాశం లేకుండా వారిని విభజించాలని, వారిలో కొందర్ని దేశ బహిష్కరణ చేయాలని భావించారు. అది కనీస శిక్ష. ఈనాడు కూడా అత్యంత నాగరిక దేశాల అధినేతలు అతి సులభంగా ఈ మాత్రం శిక్ష ఇస్తారు, ఇస్తున్నారు కూడా.

ఒకవేళ అలా చేస్తే ఆ పని షరీఅత్‌కు విరుద్ధంగా ఉంటుంది. తిరుగుబాటులో క్రియాత్మకంగా పాల్గొన్న వారితో పాటు ఇతర జిమ్మీలను శిక్షించడం, వారిని దేశం నుండి వెడలగొట్టడం ఏ విధంగాను ధర్మసమ్మతం కాదు. ఎవరు దోషులుగా రుజువైతే వారిని శిక్షించవచ్చు అన్నారు. ఆయన లెబనాన్ గవర్నర్‌కు వ్రాసిన లేఖలోని ఈ అంశం పరిశీలించదగినది :

కాని ఆనాటి ఓ ప్రఖ్యాత ధర్మవేత్త ఇమామ్ ఔజాయి, గవర్నర్‌కు లేఖ వ్రాస్తూ "మీరు లెబనాన్ పర్వత ప్రాంతపు జిమ్మీలలో కొందర్ని హతమార్చారని, మరికొందర్ని దేశం నుండి బహిష్కరించారని తెలిసింది. కాని ఆ బహిష్కరించబడిన వారిలో కొందరు తిరుగుబాటుదారులకు ఎలాంటి సహకారం అందజేయలేదు. ఒక ప్రత్యేక వ్యక్తి లేదా వర్గం చేసిన పాపానికి సామాన్య ప్రజానీకాన్ని ఏ సూత్రం ప్రకారం శిక్ష విధిస్తారో మీరే చెప్పండి. వారిని మీరు దేశం నుండి, వారి ఆస్తుల నుండి దూరం చేస్తున్నారు. దేవుడు "లా తజిరు వాజిరతున్ తిజ్‌ర ఉఖ్‌రా" అని స్పష్టం చేశాడు. ఇదొక చక్కని దృక్పథం. దీన్ని అనుసరించాలి. ఇంకా సంధి చేసుకున్న వారిపై ఏదైనా హింసగాని, భరించరాని భారం వేయడం గాని జరిగితే తీర్పుదినాన వారి తరఫున నేను ముద్దాయిని అవుతాను అన్న దైవప్రవక్త (సఅసం) హితవును ఎల్లప్పుడు గుర్తుంచుకోవడం చాలా అవసరం."

ఈ లేఖతో లెబనాన్ గవర్నరుకు వారందరిని గౌరవ మర్యాదలతో వారి వారి గృహాలకు తిరిగి రప్పించక తప్పలేదు.

## పాశ్చాత్యుల వైఖరి

ఫ్రెంచి వారు మన దేశాన్ని ఆక్రమించి మన పట్ల ఎలా ప్రవర్తించారో వివరించనవసరం లేదు. అదే వైఖరిని వారీనాడు ఉత్తర ఆఫ్రికా అరబ్ ప్రజల పట్ల కూడా ప్రదర్శిస్తున్నారు. అక్కడ లక్షలాదిమందిని హతమార్చారు. ఎన్నో నగరాల్ని నేలమట్టం చేశారు. పాలస్తీనా అరబ్బుల స్వాతంత్ర్య పోరాటంలో ఆంగ్లేయులు వారి పట్ల చూపిన వైఖరి కూడా మన కళ్ళ ముందుంది. విజయాలు పొందిన తర్వాత యుద్ధాలు జరుగుతున్న సమయాన కూడా ఇస్లామీయ సంస్కృతి మానవుల పట్ల చూపిన ఉదార స్వభావం, కారుణ్య వైఖరుల విలువ ఏమిటో గ్రహించడానికి, ఎంతో నాగరికులమని చెప్పుకునే నేటి జాతుల వైఖరి గురించి సూచన ప్రాయంగా చెబితే చాలు.

## ఇలాంటి ఆదర్శం ఏ సంస్కృతిలోనైనా ఉందా?

హజ్రత్ ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ (రహ్మాలై) ఖిలాఫత్ కాలమది. సమర్ ఖంద్ నుండి ఓ ప్రతినిధి బృందం ఆయన వద్దకు వచ్చి, అక్కడి ఇస్లామీయ సైన్యాధికారి ఖైతబ ఎలాంటి కారణం లేకుండానే వారి నగరాన్ని స్వాధీనం చేసుకొని అక్కడి జనావాసంలో ముస్లింలకు పునరావాసం కల్పించాడని ఫిర్యాదు చేసింది. అది విని హజ్రత్ ఉమర్ (రహ్మాలై) సమర్ ఖంద్ వాసుల కేసును, ఓ ప్రత్యేక న్యాయమూర్తి చేత విచారణ జరిపించాలని, అతను ముస్లింలను ఆ నగరం నుండి వెళ్ళిపోవాలని తీర్పు ఇస్తే తక్షణమే వారిని అక్కణ్ణుండి ఖాళీ చేసి పంపివేయాలని గవర్నర్‌కు ఆదేశాలు జారీ చేశారు.

గవర్నరు, జమీ బిన్ హాజిరుల్ బాబీని ప్రత్యేక న్యాయమూర్తిగా నియమించాడు. ఆయన కేసును నిశితంగా పరిశీలించిన తర్వాత ముస్లింలు అక్కడి నుండి ఖాళీ చేసి వెళ్ళిపోవాల్సిందేనని నిర్ణయించారు. అంతేకాదు, "ఇస్లామీయ సేనాని యుద్ధ ఒడంబడికలన్నీ రద్దుచేసి యుద్ధానికి సిద్ధం కమ్మని సమర్ ఖంద్ వాసులకు మొదట అల్టిమేటం ఇచ్చి ఉండవలసింది. దానివల్ల సమర్ ఖంద్ వాసులకు ముస్లింలతో తలపడేందుకు యుద్ధ సన్నాహాలు చేసుకునే అవకాశముండేది. అలా చేయడానికి బదులు "ఆయన వారిపై అకస్మాత్తుగా దాడిచేశాడు. ఇది అక్రమం" అని నివేదిక రూపొందించాడు.

సమర్ ఖంద్ వాసులు ఆ నివేదిక విని అవాక్కయిపోయారు. ఒక ప్రభుత్వం యావత్తు మిలటరీని, మిలటరీ జనరల్‌ని ఇలాంటి నిబంధనల్లో బంధించి ఉంచగలిగిన నిదర్శనం చరిత్రలో మరెక్కడా లేదని వారు గ్రహించారు. అలాంటి జాతితో యుద్ధం చేయడం నిరర్థకమని, ఆ జాతి పాలనాధిపత్యం తమ పాలిట వరప్రసాదమని భావించారు. అందువల్ల వారు ముస్లింలను తమ మధ్య ఉండనివ్వడానికే నిశ్చయించుకున్నారు.

ఆలోచించండి! ఓ సైన్యం ఓ నగరాన్ని జయించి అందులో ప్రవేశిస్తుంది. ప్రజలు విజేత ప్రభుత్వంపై అభియోగం మోపుతారు. అప్పుడు న్యాయమూర్తులు విజేత నగరం విడిచి వెళ్ళిపోవాల్సిందిగా తీర్పు ఇస్తారు. ప్రజాభీష్టానికి వ్యతిరేకంగా అక్కడ ఉండకూడదని నిర్ణయం గైకొంటారు. ఇస్లామీయ సంస్కృతి ముద్దుబిడ్డలు పాటించిన నిజాయితి మానవుల గత చరిత్రలోగాని, ఆధునిక చరిత్రలోగాని ఒక్క నిదర్శనమైనా మాకు కానరాదు.

## వాగ్దాన పాలన

ఇస్లామీయ సైన్యం డెమాస్కస్, హమస్, సిరియాలకు చెందిన ఇతర నగరాల్ని జయిస్తుంది. ఒడంబడిక ప్రకారం అక్కడి ప్రజల ధన, ప్రాణ రక్షణ, దేశ రక్షణకై కొద్దిగా పన్ను వసూలు చేస్తుంది. అయితే రోమ్ చక్రవర్తి ఓ పెద్ద సైన్యాన్ని సమీకరిస్తున్నాడనీ, అతడు ముస్లింలతో తలపడి అటో ఇటో తేల్చివేయాలన్న తలంపుతో ఉన్నాడని ముస్లిం నాయకులకు తెలుస్తుంది. అందువల్ల వారు జయించిన అన్ని నగరాల్ని ఖాళీ చేసి ఒకే ప్రదేశంలో సమీకృతులై సైన్యాన్ని రోమ్ చక్రవర్తిని అందరూ కలిసి ఎదుర్కోవాలని నిర్ణయం తీసుకుంటారు. ఆ తీర్మానం ప్రకారం ఇస్లామీయ సైన్యాలు హమస్, డెమాస్కస్, ఇతర నగరాలను ఖాళీ చేస్తారు. హజ్రత్ ఖాలిద్ (రజి) హమస్ వాసులను, అబూ ఉబేద (రజి) డెమాస్కస్ ప్రజలను, ఇతర కమాండర్లు తత్సంబంధిత నగర వాసులను సమీకరించి వారితో ఇలా అంటారు :

“మేము మీ ధన ప్రాణాల కోసం, విదేశీయుల దాడి నుండి మిమ్మల్ని రక్షించడానికి మీ వద్ద డబ్బు వసూలు చేశాము. కాని ఇప్పుడు మేము మిమ్మల్ని వీడిపోతున్నామని చెప్పడానికి చింతిస్తున్నాము. మిమ్మల్ని కాపాడే బాధ్యత నిర్వహించలేము. అందువల్ల ఇదిగో మీరిచ్చిన డబ్బు మీకు తిరిగి ఇచ్చివేస్తున్నాము.”

అందుకు వారన్నారు :

“దేవుడు మీకు విజయం చేకూర్చి మీరు ఇక్కడికి మళ్ళీ తిరిగి వచ్చేలా చేయుగాక! మీ ప్రభుత్వం, మీ న్యాయం, ధర్మం మమ్మల్ని మంత్రముగ్ధుల్ని చేసింది. మేము, రోమన్‌లు ఒకే మతానికి చెందిన వారమైనా వారి దౌర్జన్యం, విధ్వంసకాండను మేము చవి చూశాము. దైవసాక్షి! మీ స్థానంలో వారే గనక ఉంటే మా నుండి వసూలు చేసిన ధనంలో చిల్లిగవ్వ కూడా తిరిగి ఇచ్చేవారు కాదు, పైగా ఆ ధనంతోపాటు ఇక్కడి సమస్త వస్తు సామగ్రిని కూడా వారు మోయగలిగినంత తీసుకు వెళ్ళిపోయేవారు.”

ఈనాడు మన నాగరిక యుగంలో కూడా అలాగే జరుగుతుంది. ఒకవేళ ఏదయినా సైన్యం ఓ ప్రదేశాన్ని ఖాళీ చేయాల్సి వస్తే అది తన శత్రువుకు ఉపయోగ పడే ఏ వస్తువును వదలి వెళ్ళదు. కాని విజేత అయిన ఇస్లామీయ సైన్యం ధన ప్రాణ రక్షణకై ప్రజల నుండి వసూలు చేసిన ట్యాక్సు వారికి తిరిగి అప్పజెప్పి యావత్తు ప్రపంచ జాతుల ముందు ఓ చక్కని ఆదర్శాన్ని నిలబెట్టింది.

## ఇబ్నె తైమియా ఔదార్యం

తాతారీలు సిరియా ప్రాంతాల మీద దండయాత్ర జరిపినప్పుడు అసంఖ్యాక ముస్లింలు, యూదులు, క్రైస్తవులను బందీలుగా పట్టుకున్నారు. షేఖుల్ ఇస్లాం ఇబ్నె తైమియా తాతారీల నాయకునితో ఖైదీలను విడిపించే విషయంలో చర్చలు జరిపారు. అందుకా నాయకుడు కేవలం ముస్లిం ఖైదీల్ని మాత్రమే విడుదల చేయడానికి ఒప్పుకున్నాడు. కానీ షేఖుల్ ఇస్లాం అందుకు ఒప్పుకోలేదు. “మా అధీనంలో జిమ్మీలుగా ఉన్న మొత్తం క్రైస్తవులను, యూదులను కూడా విడుదల చేయవలసిన అవసరముందని, మా (ముస్లిం) సమాజానికి చెందినవాడయినా లేక మాకు జిమ్మీగా ఉన్న వాడయినా ఏ ఒక్క వ్యక్తి కూడా బందీగా ఉండడాన్ని కూడా మేము సహించమ”ని ఖండితంగా చెప్పివేశారు.

## మేలు మరచిన క్రైస్తవులు

అయితే ముస్లింలు చేసిన ఈ మేలుకు బదులుగా శిలువ యుద్ధాల్లో క్రైస్తవ సైనికులు కీడుకు తలపడ్డారు. మధ్యయుగంలో ఈ యుద్ధాలు జరుగుతున్నప్పుడు ఇచ్చిన మాట తప్పకుండా ముస్లింలు పాటించారు. కాని క్రైస్తవ సైనికులు మాత్రం

మోసం కుట్రలకే పాల్పడ్డారు. వాటిని ముస్లింలు క్షమిస్తూ వస్తే, వారు మాత్రం ముస్లింలపై దాడి చేశారు. ముస్లింలు మానవుల ప్రాణాలు కాపాడుతుండగా క్రైస్తవులు జరిపిన హింసాకాండ వల్ల రోడ్లమీద మోకాళ్ళ వరకు రక్తం ప్రవహించింది.

ఈ శిలువ యుద్ధవీరులు తమ రెండవ దాడిలో 'మారున్నామాన్' చేరుకున్న తర్వాత మారా వాసులు తమ ఆయుధాల్ని దించాల్సి వచ్చింది. అయితే వారు నగరాన్ని శత్రువులపరం చేసేముందు దాడి జరిపినవారి అగ్రనాయకులతో తమ ధన, మాన, ప్రాణ రక్షణ కోసం పటిష్టమయిన సంధి షరతులు చేసుకున్నారు. తర్వాత ఏమయింది? ఆ కిరాతకులు నగరంలో ప్రవేశించగానే వారు చేసిన ఘాతు కాలు, భీకరకృత్యాలు, భయానక విధ్వంసకాండ అంతా ఇంతా కాదు. ఆ యుద్ధంలో పాల్గొన్న కొందరు ఆంగ్లేయ చరిత్రకారులు అక్కడ ఊచకోత కోయబడినవారి సంఖ్య ఒక లక్షని స్వయంగా ఒప్పుకున్నారు. అందులో పురుషులు, స్త్రీలు, పిల్లలు, వృద్ధులు అందరూ ఉన్నారు.

తర్వాత ఈ సైనికులు బైతుల్ మఖ్దిస్ దిశకు మళ్ళారు. అక్కడ జనాన్ని చుట్టుముట్టి దిగ్బంధించారు. ఇక తప్పకుండా ఓడిపోతామని గ్రహించిన ఆ ప్రజలు సైన్యాధిపతి టన్‌కర్డుతో తమ ధన, ప్రాణాల రక్షణ కోసం ఒప్పందం చేసుకున్నారు. అతడు వారికి ఓ తెల్ల జెండా ఇచ్చి అఖ్సా మస్జిద్‌పై ఎగురవేసి లోనికి ప్రవేశించండని, అన్ని విషయాల్లో మీకు శాంతి ప్రసాదించబడుతుందని అన్నాడు. తర్వాత ఆ దుర్మార్గులు వారు నగరంలో ప్రవేశించి పవిత్ర నగరాన్ని ఘోరాతి ఘోరంగా అగౌరవపరిచారు. అందులో వారు చేసిన పాపకార్యాలు వర్ణనాతీతం.

నగరవాసులు ఒప్పందం ప్రకారం అఖ్సా మస్జిద్‌లో తలదాచుకున్నారు. దానిపై వారు టింకర్డు ఇచ్చిన తెల్లజెండా ఎగురవేశారు. వృద్ధులు, పిల్లలు, స్త్రీలతో మస్జిద్ నిండిపోయింది. వారి ధన, మాన, ప్రాణాలను రక్షిస్తామని వాగ్దానం చేసి శాంతి ప్రతాకం ఇచ్చిన క్రైస్తవ సైనికులు మస్జిద్‌లో ప్రవేశించారు. ఇంకేముంది శరణుపొందిన వారందర్నీ గొర్రెలు, మేకల్లా ఊచకోత కోశారు. మస్జిద్‌లో రక్తం కాలువలై ప్రవహిం చింది. అందులో తలదాచుకున్న వారినేగాక ఇతర ప్రజల్ని కూడా హతమార్చారు. నగరంలోని రోడ్లన్నీ మానవ కళేబరాలతో నిండిపోయాయి. ఎటు చూసినా మానవ అవయవాలు చెల్లాచెదురుగా పడిపోయాయి. కేవలం ఒక్క మస్జిద్‌లోనే 70 వేల ప్రాణాల్ని బలిగొన్నారు. అందులో సాధారణ ప్రజలు కాకుండా గొప్ప గొప్ప ధర్మవేత్తలు,

మేధావులు, దైవభక్తులు కూడా ఎంతోమంది ఉన్నారని ఇస్లామీయ సైనికులు తెలియజేశారు. ఖుద్దుగా ఆంగ్లేయ చరిత్రకారులు లజ్జా విహీనమైన ఆ ఘాతుకాల్ని తిరస్కరించలేకపోయారు. పైగా వారు ఆ ఘాతుక కృత్యాల్ని గురించి గర్వంగా చెప్పుకున్నారు.

## సలాహుద్దీన్ అయ్యూబి

భీభత్సకరమైన ఈ హత్యాకాండ జరిగిన 90 సంవత్సరాల తర్వాత సలాహుద్దీన్ అయ్యూబి బైతుల్ మఖ్దిస్‌ను జయించారు. మీకు తెలుసా, ఆయన అక్కడి ప్రజల పట్ల ఎలా ప్రవర్తించారో? అక్కడ దాదాపు లక్షమంది పాశ్చాత్యులు నివాసమున్నారు. ఆయన వారి ధన, మాన, ప్రాణాలకు భద్రత ప్రసాదించారు. సంపన్నుల నుండి మాత్రమే కొంత డబ్బు (ఫిదియ) వసూలుచేసి అందర్నీ అక్కడి నుండి వెళ్ళిపోవడానికి అనుమతిస్తూ వారు వెళ్ళిపోవడానికి 40 రోజుల గడువు కూడా ఇచ్చారు. అలా అక్కడి నుండి 84 వేల మంది ప్రశాంతంగా "జుఅకా" మొదలగు ప్రాంతాల్లో ఉన్న వారి సంబంధీకుల వద్దకు వెళ్ళిపోయారు. ఆయన తమ్ముడు మలిక్ ఆదిల్ 2 వేల మంది పేదలకు స్వయంగా తన డబ్బు నుండి ప్రయాణ ఖర్చులు ఇచ్చి పంపివేశాడు.

స్త్రీల పట్ల సలాహుద్దీన్ అయ్యూబి ప్రదర్శించిన ప్రవర్తనా తీరు ఈనాటి నాగరిక విజేత నుండి ఆశించడం అలా ఉంచి, కనీసం మనసులో ఆ ఆలోచన కూడా రాదు. ఇక "పీటర్ ఆఫ్ యార్క్" అనే క్రైస్తవ మతాధిపతి అక్కడి నుండి వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నప్పుడు అందుకు అయ్యూబి సంతోషంగా అనుమతించారు. అప్పుడు అతని వద్ద అంతులేని ధనరాసులున్నాయి. వాటి విలువ ఎంతో దైవానికే తెలుసు. కొందరు సైనిక సలహాదారులు అతని ఆస్తిని జప్తు చేసుకోవాలని సలాఉద్దీన్‌కు సూచించారు. కాని "నేను ఎట్టి పరిస్థితుల్లోను వాగ్దాన భంగం చేయజాలన"ని ఆయన వారికి సమాధానమిచ్చారు. పీటర్ ఆఫ్ యార్క్ నుండి కూడా ఓ సామాన్యుని వద్ద తీసుకున్నంత డబ్బే వసూలు చేశారు. అంతేకాదు, ఆ ప్రాంతాన్ని ఖాళీచేసి వెళ్ళిపోతున్న క్రైస్తవులకు తోడుగా తన అంగరక్షకుల్ని పంపిస్తూ "సూరీ" "సయీద" ప్రాంతాలలో ఉన్న వారి సోదరులు, బంధువుల వద్దకు క్షేమంగా, భద్రంగా చేర్చాలని కూడా ఆజ్ఞలు జారీ చేశారాయన.

సుల్తాన్ సలాఉద్దీన్ అయ్యూబి యుద్ధం ముగిసిన తరువాత శత్రువులపై పగ తీర్చుకోలేదు. పైగా వారిని బైతుల్ మఖ్దిస్ నుండి సగౌరవంగా సాగనంపారు. జిజ్‌యా డబ్బు చెల్లించిన ఎందరో స్త్రీలు సుల్తాన్ వద్దకు వచ్చి తమ భర్తలు, తండ్రులు, కొడుకులు అనేకమంది యుద్ధంలో చనిపోయారని, కొందరు ఖైదు చేయబడ్డారని, ఇక తమ దుస్థితిని గురించి అడిగే నాధుడేలేడని ఎటువెళ్ళాలో దిక్కు తోచడం లేదని చెప్పుకొని గొల్లున ఏడ్చారు. వారి కన్నీటి ధారలకు మృదుహృదయుడైన సుల్తాన్ కరిగిపోయి ఆయన కూడా దుఃఖించాడు.

తర్వాత మహిళల భర్తలు, తండ్రులు, కొడుకులు ఎవరో గుర్తించి వారిని విడుదల చేయమని ఆయన అధికారులకు ఆజ్ఞాపించారు. ఏ స్త్రీల సంరక్షకులు హతులయ్యారో ఆ స్త్రీలకు పెద్ద మొత్తంలో ఆర్థిక సహాయాన్ని అందజేశారు. తత్ఫలితంగా ఆ స్త్రీలు ఏ చోటికి వెళ్ళినా సుల్తాన్‌లోని మహోన్నత మానవత్వాన్ని శ్లాఘించారు. విడుదలైన ఖైదీలందరికి తమ భార్యాపిల్లలతో సహా "సూర్" "అకా" మొదలగు ప్రాంతాల్లో ఉన్న వారి బంధువుల వద్దకు వెళ్ళిపోవడానికి అనుమతి నిచ్చారాయన.

బైతుల్ మఖ్దిస్ నుండి వెళ్ళిపోయిన కొందరి క్రైస్తవుల పట్ల వారి సోదర క్రైస్తవులు ఎలా ప్రవర్తించారు? వారిలో కొందరు "ఇన్‌తాకియ"కు వెళితే అక్కడి అమీరు వారిని నగరంలోకి ప్రవేశించనీయలేదు. పాపం వారు దిక్కు తోచక ఎక్కడెక్కడో తిరుగుతూ ఉంటే చివరికి ముస్లింలే వారికి ఆశ్రయమిచ్చారు. ఇంకో బృందం టెరాబ్లస్ దిశగా పయనించింది. అది అప్పుడు ఇటలీ అధీనంలోనే ఉంది. కాని అక్కడి అధికారులు కూడా వారిని లోనికి రానివ్వలేదు. పైగా ముస్లింలు వారి వెంట తీసుకెళ్ళడానికి అనుమతించిన వస్తు సామగ్రిని లూటీ చేసి వారిని అక్కడ నుండి తరిమేశారు.

శిలువ యుద్ధాల్లో పాశ్చాత్య క్రైస్తవుల పట్ల సలాహుద్దీన్ అయ్యూబి ప్రదర్శించిన ఈ ప్రవర్తనా తీరు పైకి ఓ కల్పిత గాధగా కనబడుతుంది. అయితే ఇస్లాం ప్రసాదించిన ఈ పుత్ర రత్నం యొక్క మంచితనం, ఉన్నత నైతికత స్వయంగా పాశ్చాత్య రచయితల్ని ఆశ్చర్యంలో పడవేయకపోతే ఇదంతా ఇస్లాం చరిత్రకారుల ఊహాగానం, అతిశయోక్తి మాత్రమేనని ఆరోపించేందుకు, వారికి అవకాశం చిక్కేది. కానీ ఖుద్దుగా పాశ్చాత్యులే ఏమంటున్నారో వినండి :

"శిలువ యుద్ధాలు చేసే వారిలో గొప్పవాడు, పరాక్రమవంతుడు అయిన జనరల్ రిచర్డ్ రోగగ్రస్తుడయ్యాడని సలాహుద్దీన్ అయ్యూబికి వార్త అందింది. వెంటనే ఆయన అతని చికిత్సకై తన ప్రధాన వైద్యుడ్ని పంపించారు. ఆ సమయం అతనికి అక్కడ లభ్యంకాని పండ్లు ఫలాలు కూడా పంపించాడు. ఇద్దరి మధ్య జ్వాలలు రగుల్కొని ఇరువురి సైన్యాలు ఢీ కొంటున్న తరుణంలో ఇదంతా జరిగింది."

ఆ పాశ్చాత్య రచయితలు ఇంకా ఇలా వ్రాస్తున్నారు : ఒక స్త్రీ సలాఉద్దీన్ సైనిక శిబిరం వద్దకు వెళ్ళి ఇద్దరు నీగ్రో సిపాయిలు తన పిల్లవాడ్ని లాక్కుపోయారని ఫిర్యాదు చేస్తూ గోడుగోడున విలపించింది. అది విని ఆయన కూడా దుఃఖించారు. వెంటనే ఒక విచారణాధికారిని నియమిస్తే అతడు ఆ పిల్లవాడ్ని వెదకి తీసుకొచ్చి ఆ క్రైస్తవ స్త్రీకి అప్పగించాడు. సుల్తాన్ ఆ స్త్రీని కొందరు సైనికుల రక్షణలో ఆమె పోవలసిన చోటికి భద్రంగా చేర్పించారు. ఇదీ ముస్లింలకు ఇస్లాం ఇచ్చిన శిక్షణ. ఇస్లామీయ సంస్కృతిలోని యుద్ధనీతిలో మానవత్వంలేదని ఎవరైనా అనగలరా?

## సుల్తాన్ ముహమ్మద్ ఔన్నత్యం

రెండవ సుల్తాన్ ముహమ్మద్ కానిస్టాంటినోపుల్‌ను జయించినప్పుడు ఆయన అక్కడి పాదరీలందరు తలదాచుకున్న చర్చిలో ప్రవేశించారు. వారందరినీ కలుసుకొని సాదరంగా పలకరించారు. న్యాయమయిన కోరికల్ని మన్నిస్తానని, అందువల్ల ఏమాత్రం భయపడాల్సిన అవసరం లేదని హామీ ఇచ్చారు. యుద్ధ భయంతో ఇక్కడ తలదాచుకున్న క్రైస్తవులంతా నిర్భయంగా, ప్రశాంతంగా తమ తమ ఇళ్ళకు తిరిగి పోవచ్చని ప్రకటించారు.

సుల్తాన్ ముహమ్మద్ సాని కానిస్టాంటినోపుల్‌ని జయించిన తరువాత ఆయన క్రైస్తవుల విభిన్న సమస్యలపై ఆలోచించి వాటి పరిష్కారానికి ఏర్పాట్లు చేశారు. క్రైస్తవులు తమ వ్యక్తిగత చట్టాలను, మత ధర్మాలను, తమ ప్రత్యేక చర్చీలు నిర్ణయించిన ఆచార నియమాలను స్వేచ్ఛగా పాటించవచ్చని తీర్మానించారు. అంతేకాదు, తమ కొరకు ఎవరినైనా సరే స్వేచ్ఛగా పేట్రిక్ ఆఫ్ యార్క్‌గా ఎన్నుకోవచ్చని క్రైస్తవులకు అధికారమిచ్చారు. అప్పుడు వారు జునాద్ యూస్‌ను ఎన్నుకున్నారు. ఇలాంటి సందర్భంలో సాధారణంగా "బేజ్‌నత్‌ని" కాలంలో జరిగే విధంగా అత్యంత ఆడంబరంగా ఉత్సవం జరుపుకోవడానికి సుల్తాన్ కూడా తగిన ఏర్పాట్లు చేశారు.

ఉత్సవ సందర్భంలో ఆయన కొత్త పేట్రిక్ ఆఫ్ యార్క్‌ని అభినందిస్తూ "మీరు ఎల్లవేళల, అన్ని చోట్లా పేట్రిక్ ఆఫ్ యార్క్ హోదాలో నాకు మిత్రులు. మీకు పూర్వమున్న పేట్రిక్ ఆఫ్ యార్క్‌కు గల సర్వాధికారాలు, హక్కులను మీరు అనుభవించవచ్చు" అని చెప్పారు. తర్వాత సుల్తాన్ అతనికి ఓ అందమైన గుర్రాన్ని బహూకరించారు. దాని సంరక్షణకయి తనకు గల ప్రత్యేక బాడీగార్డుల్లో ఒకర్ని నియమించారు. ప్రభుత్వ ఉన్నతాధికారులు వెంట రాగా సుల్తాన్ పేట్రిక్ ఆఫ్ యార్క్ కోసం కట్టించిన భవనం వద్దకు వెళ్ళారు. అక్కడ తమ ఆర్థోడక్స్ చట్టాల్ని మంజూరు చేశానని, ఆ చట్టాల్ని పరిరక్షించే బాధ్యత పేట్రిక్ ఆఫ్ యార్క్‌దేనని ప్రకటించారు. యుద్ధ సమయంలో ప్రజలు స్వాధీనం చేసుకున్న క్రైస్తవుల పురావస్తు కళాఖండాలు, ఇతర సామగ్రిని సుల్తాన్ కొని వాటిని తిరిగి చర్చీలకు, సంబంధిత సంస్థలకు ఇచ్చివేశారు.

విజేత సుల్తాన్ ముహమ్మద్ క్రైస్తవుల పట్ల ఈ ఉదార ప్రవర్తన ఏ పరిస్థితుల్లో ప్రదర్శించారు? కానిస్టేంట్ నోపుల్ జయిస్తున్న తరుణంలో ఆయనకు, క్రైస్తవులకు మధ్య ఎలాంటి ఒప్పందం జరగలేదు. ఇంతటి సామరస్యానికి సదవకాశం, ప్రోత్సాహమిచ్చింది ఆయన నిర్మలమైన, ఉన్నత ప్రవర్తనా సరళియే. ఆ ప్రవర్తన కారణం వల్లే కానిస్టేంట్ నోపుల్ వాసులు పూర్వం తమను పాలించిన కొందరు "నతీని" ప్రభువుల కంటే ఈ నూతన ఇస్లామీయ ప్రభుత్వం ఛాయల్లో మత సహనం, స్వేచ్ఛతో ఎంతో ప్రశాంతంగా జీవితం సాగిస్తున్నామని భావించారు.

## ఉస్మానీ పాలకుల ప్రవర్తన

అలాగే ఉస్మానీ పాలకులు తాము జయించిన బల్గేరియా, గ్రీస్ దేశాల్లోని క్రైస్తవుల పట్ల చూపిన ఉత్తమ ప్రవర్తన అనుపమానమైనది. క్రైస్తవుల పట్ల అలాంటి ప్రవర్తన అప్పుడు యావత్ ఐరోపాలో ఎవరూ ప్రదర్శించలేకపోయారు. చివరికి హంగేరి, ట్రాన్స్‌ఫానియాలోని "కెల్ఫిన్" సహచరులు, ట్రాన్స్‌ఫానియాలోని ఏకేశ్వరోపాసకులయిన క్రైస్తవులు మత దురభిమానం గల "హైబర్గ్" వర్గం యొక్క క్రూర పాలన క్రింద లొంగి ఉండడానికి బదులు దీర్ఘ కాలంగా టర్కీ పాలకులకు లోబడి ఉండడానికే ఇష్టపడ్డారు. "సేల్స్‌యా"కు చెందిన ప్రొటెస్టెంట్ వర్గాలు ముస్లింలకు విధేయులుగా ఉండి మత స్వేచ్ఛను పొందాలని అభిలషించారు.

## ఐరోపా క్రైస్తవ పాలకులు

టర్కీ ఖిలాఫత్ పాలనలో క్రైస్తవుల పట్ల ఈ ఉత్తమ ప్రవర్తన ప్రదర్శిస్తున్న తరుణంలోనే ఐరోపాలో మత దురభిమానం తీవ్రస్థానంలో ఉంది. సంకుచిత భావాలు గల ఆ పాలకులు తమ ప్రత్యర్థి వర్గాల్ని ఊపిరి పీల్చుకోనివ్వడం లేదు. సాధారణ మత వర్గాలు కూడా పరస్పరం కలహించుకుంటూ రక్తపాతం జరుపుకుంటున్నాయి. ఎవరి ప్రాణానికి రక్షణా లేదు.

7వ శతాబ్దంలో ఇంతాకియాలోని పేట్రిక్ ఆఫ్ యార్క్ మిస్టర్ మెఖారియోస్ పోలెండ్‌లోని సనాతన క్రైస్తవులపై రోమన్ కేథలిక్ వర్గాలు జరిపిన అత్యాచారాల్ని ఇలా ఉటంకించారు :

"నలభై, యాభై సంవత్సరాల కాలంలో దౌర్జన్యపరులైన రోమన్ కేథలిక్కుల చేతుల్లో హతులైన వేలాది ప్రజల పట్ల మేము రక్త కన్నీటిని కారుస్తున్నాము. ఆ కాలంలో దాదాపు 70 వేల మంది హతులయినారు. ఓ విద్రోహులారా! కిరాతకులారా! ఓ పాషాణ హృదయులారా! చర్చీల్లో ఆరాధన సలుపుతున్న సన్యాసినులు చేసిన తప్పేమిటి? సాధారణ స్త్రీ జనం ఏం పాపం చేశారు. పసిపిల్లలు చేసిన తప్పేమిటి? మీరెందుకు వారిని కత్తికి ఎర గావించారు? పోలెండ్‌ను పట్టి పీడించిన అంటు వ్యాధియని వారిని నేనెందుకు అనకూడదు? క్రైస్తవుల పట్ల కఠిన హృదయంతో ప్రవర్తించి కల్లోలం సృష్టించే విగ్రహారాధకులకంటే కూడా ఘోరంగా దిగజారిన నీచులమని, హృదయ రహితులమని స్వయంగా వారే రుజువు చేసుకున్నారు. తోటి క్రైస్తవుల పైన అత్యాచారాలు జరిపి ఆర్థోడెక్స్ చర్చీని నామరూపాల్లేకుండా నాశనం చేయవచ్చని వారు భావించారు. దేవుడు టర్కీ ప్రభుత్వాన్ని ప్రళయం వరకు నిలబెట్టుగాక! ఆ పాలకులు కొంచెం పన్ను తీసుకుంటారే తప్ప ఇతర ప్రజల ధర్మాల పట్ల వారికి ఎలాంటి విరోధం లేదు. ఆ ప్రజలు క్రైస్తవులయినా, యూదులైనా, సామరీయులైనా సరే. కాని పోలెండ్ కిరాతకులు క్రైస్తవ సోదరుల నుండి కేవలం పన్ను తీసుకొని ఊరుకోలేదు. వారితో ఊడిగం చేయించుకున్నారు. అంతేకాదు, క్రైస్తవుల్ని క్రీస్తుకు ఆగర్భ శత్రువులయిన యూదుల పరం గావించారు. ఆ యూదులు ఒక్క చర్చీ కూడా కట్టుకోవడానికి అనుమతించలేదు. ప్రజలకు ధర్మ బోధ చేయడానికి ఒక్క పాదరీని కూడా మిగల్చకుండా హతమార్చారు.

## మరికొన్ని అమానుష కృత్యాలు

విజేత సుల్తాన్ ముహమ్మద్ కానిస్టెంట్‌నోపుల్ క్రైస్తవుల హక్కులను సంరక్షించేందుకు ఎంతటి ఔదార్యాన్ని ప్రదర్శించారో క్లుప్తంగా చదివారు. దీనికి భిన్నంగా ఐరోపా క్రైస్తవులు క్రీ.శ. 1204లో కానిస్టెంట్ నోపుల్‌ను స్వాధీనం చేసుకున్న తర్వాత స్వయాన తమ సోదరులయిన సనాతన క్రైస్తవుల పట్ల ఎలా ప్రవర్తించారో కొంచెం చదవండి. అది కూడా రోమన్ పోప్ అయిన ఇన్నెంట్ సోయం మాటల్లోనే ఇలా అంటాడు:

"క్రీస్తును నమ్మి, ఆయన ధర్మాన్ని అనుసరించే వారు తమ ఖడ్గాలను క్రైస్తవం బద్ధ శత్రువు (ఇస్లాం) మీద ఝుళిపించాలి. ఇది వారి కర్తవ్యం. కాని విచారకరమైన విషయం ఏమంటే, వారే స్వయంగా క్రైస్తవం రక్తాన్ని ప్రవహింపజేశారు. అలా చేయడం అధర్మం. మతరీత్యా నిషేధం. అయినా వారు దాన్ని ఖాతరు చేయలేదు. రక్తపుటేరులు ప్రవహింపజేశారు. వారు ధర్మాన్ని గౌరవించలేదు, స్త్రీ పురుషులనే విచక్షణ చూపలేదు. (పిల్లలు, యువకులు, వృద్ధులు) అన్న వయో భేదాన్ని పాటించ లేదు. పట్టపగలే వ్యభిచారం సాగించారు. సన్యాసినులు, పిల్లల తల్లులు, యువతులు ఆ భయంకర మృగాల ముందు నిస్సహాయులయ్యారు. ఆ పశుప్రాయమైన వారి కామ వాంఛలకు బలైపోయారు. వారు రాజులు, ఇతర అధికారుల ధన సంపత్తినే కాకుండా చర్చీల ఆస్తుల్ని కూడా నిరాఘాటంగా దోచుకున్నారు. చర్చీలను అగౌరవపరిచారు. వాటిలోనున్న పవిత్రమైన చిత్రపటాలు, శిలువలు, పురావస్తు సామగ్రిని కూడా లూటీ చేశారు.

సుప్రసిద్ధ చరిత్రకారుడు షారల్‌డీల్ ఇలా వ్రాస్తాడు : "ఈ సైనిక ముష్కరులు చర్చిలోకి చొరబడి భక్తుల సమూహంలోకి వెళ్ళి పవిత్ర గ్రంథాన్ని నాశనం చేశారు. దైవమార్గంలో మరణించిన వారి చిత్ర పటాన్ని క్రింద పడేసి కాళ్ళతో తొక్కివేశారు. దుర్నడత గల ఓ స్త్రీ అక్కడున్న పేట్రిక్ ఆఫ్ యార్క్ ఆసనం మీద కూర్చుని బిగ్గరగా కేకలు వేస్తూ పాడసాగింది, నగరంలోని మత విద్యా చిహ్నాలన్నీ తుడిచివేయబడ్డాయి. వెండి, బంగారంతో చేయబడిన విగ్రహాలన్నీ ధ్వంసం చేయబడ్డాయి. ఇక ఇప్పుడు వాటితో నాణాలు చేయబడతాయి."

ఆ విషాదకర దృశ్యాల్ని కళ్ళారా చూసిన క్రైస్తవ సన్యాసులు ఇలా సాక్ష్య మిస్తున్నారు :

"వాస్తవం ఏమంటే ఆ నగరం పట్ల క్రీస్తును నమ్మి, ఆయన నామాన్ని జపించే సన్యాసులు ప్రవర్తించే విధంగా ముహమ్మద్ (సఅసం) అనుచరులు కూడా ప్రవర్తించలేదు."

అవును, ముస్లింలు ఆ నగరాన్ని జయించినా వారు అలా చేయలేదు. అందుకు ప్రత్యక్ష నిదర్శనం విజేత సుల్తాన్ ముహమ్మద్ వైఖరి అందరి ముందూ ఉంది. ముస్లింలు ముస్లింలుగా ఉన్నంత వరకు వారు సనాతన క్రైస్తవుల పట్ల రోమన్ కేథలిక్కులు చూపిన నీచాతి నీచమైన సంకుచిత బుద్ధిని మాత్రం ప్రదర్శించలేదు; మానవత్వం ఆక్రోశించే కిరాతకాలు చేయలేదు.

## ఒప్పందం ఉల్లంఘన

మేము ఈ సందర్భంలో స్పెయిన్ విజేతలైన ముస్లింలు చూపిన ఉదాత్తమయిన వైఖరి, ఉన్నతమైన ఉదారబుద్ధి, వారి భావోద్రేకాలను అపరిమితంగా గౌరవించిన గాథలను వినిపించదలచుకోలేదు. అందుకు భిన్నంగా స్పెయిన్ వాసులు ముస్లింలపై జరిపిన దారుణ హింసాకాండను గురించి కూడా చెప్పదలచుకోలేదు. అక్కడి అల్పసంఖ్యాక వర్గాల పట్ల వారు ముస్లింల ఆఖరు రాజ్యమైన గర్నాతను ఆక్రమించి నప్పుడు ముస్లింలతో దాదాపు 60 అంశాలు గల ఒడంబడిక చేసుకున్న తర్వాతనే ఆ అత్యాచారాలన్నీ చేసివేశారు. అందులో ముస్లింల ధర్మాన్ని, మస్జిద్‌లను, వారి గౌరవ ప్రతిష్ఠలను, వస్తు సామగ్రిని పరిరక్షించే అంశాలు కూడా చేరి ఉన్నాయి. అయినా వారు చేసిన ఏ ఒక్క వాగ్దానాన్నీ నిలబెట్టుకోలేదు. ఏ ఒక్క బాధ్యతనూ నిర్వర్తించలేదు. తుదకు రక్తపాతాన్ని అరికట్టకపోగా అసంఖ్యాక అమాయకుల్ని హతమార్చి వారి ఆస్తిపాస్తుల్ని దోచుకున్నారు. తర్వాత క్రీ.శ. 1534లో ఐరోపా 32 సంవత్సరాల్లో గర్నాతలోని మస్జిద్ లన్నింటినీ చర్చీలుగా మార్చివేయాలని ప్రకటించింది. ఈ ప్రకటన వెలువడిన 4 సంవత్సరాలలో స్పెయిన్‌లోని ముస్లింలను నామరూపాలు లేకుండా చేశారు. ఇది క్రైస్తవుల వాగ్దానానికి ప్రతీక. అది ముస్లింల వాగ్దానానికి నిదర్శనం.

## అమానుష నైజాన్ని మార్చేదెవరు?

ఇచ్చిన వాగ్దానాన్ని నిలబెట్టుకోకపోవడంలో ఆశ్చర్యం లేదు. స్వమతస్థుల పట్ల వారు ప్రదర్శించిన కఠినాతి కఠిన వారి వైఖరి వాగ్దాన భంగం గురించే

ఆశ్చర్యపడాలి. వారిపై జరిపిన అత్యాచారాలు ముస్లింలపై జరిపిన అత్యాచారాలకంటే తక్కువేమీ కావు. వారు ఏ దేశాన్ని జయించినా అక్కడ తమ పాషాణ హృదయ ప్రవృత్తి, దారుణ హింసాకాండను ప్రదర్శిస్తూ వచ్చారు. వారికి ఎదురుపడిన వారు వృద్ధ ముస్లిమయినా లేక క్రైస్తవుడయినా సరే హతమార్చడమే వారి పని. వారి జాతీయ శీలం పట్ల వారి రచయితలే కన్నీరు కురిపించారు.

7వ లూయీ ఆస్థాన ప్రధాన ఫాదరీ ఔడూద్‌వేవి స్వయంగా లూయీతో రెండవ శిలువ యుద్ధంలో పాల్గొన్నాడు. అతడు తను చూసిన దృశ్యాల్ని ఇలా వ్రాశాడు:

“క్రైస్తవులు ఆసియా మైనర్ మార్గం గుండ బైతుల్ మఖ్దిస్ వెళుతున్నారు. అయితే వారు “ఫ్రీజియా” పర్వత మార్గాల్లో టర్కీ వారిచేత ఎన్నో ఉపద్రవాల్ని ఎదుర్కోవలసి వచ్చింది. అది క్రీ.శ. 1148లో జరిగిన సంఘటన. వారు అతి కష్టం మీద ఇటలీ తీర నగరానికి చేరుకున్నారు. గ్రీకులు కోరిన భారమైన పన్నులు (సైన్యాన్ని సముద్రం ఆవలకు చేర్చడానికి తీసుకునే పన్నులు) చెల్లించి సముద్ర మార్గాన “ఇకాంకియా” చేరుకున్నారు. కాని రోగుల్ని, క్షతగాత్రుల్ని, సామాన్య ప్రజల్ని మాత్రం తమకు నమ్మకద్రోహులయిన గ్రీకుల వద్దే వదలి వెళ్ళిపోయారు. వారి రక్షణకు, గాయపడ్డవారికి చికిత్స చేసి బాగయిన తరువాత తిరిగి వెళ్ళి తమవార్ని కలుసుకునేందుకు లూయీ గ్రీకులకు 500 మార్కులు పైకం ఇచ్చాడు. కాని అతని సైన్యం ఇటలీని వదలిపెట్టిందో లేదో గ్రీకులు నిరాయుధులైన శిలువ దళాల గురించి టర్కీ వారికి తెలియజేసి మౌనంగా తమాషా చూస్తూ కూర్చున్నారు. గ్రీకులు అందించిన ఈ సమాచారంతో టర్కీ (ముస్లిం) సైనికులు సంపూర్ణ విజయం సాధించడానికి క్రైస్తవ స్థావరాలపై మళ్ళీ దాడి చేశారు.

ఈ దాడి నుండి బ్రతికి బయటపడ్డవారు తమ ప్రాణాలపై ఆశలు వదులు కున్నారు. కాని ముస్లింల హృదయం వారి దీనావస్థను చూసి కరిగిపోయింది. ఇప్పుడు విరోధానికి బదులు వారి హృదయంలో కరుణ పెల్లుబికింది. మరుక్షణమే వారు రోగుల్ని పరామర్శించి చికిత్స చేశారు. కొన ఊపిరితో ఉన్న అన్నార్తులను, అనాథలను ఆదుకున్నారు. గ్రీకులు బలవంతంగానో లేక మోసం చేసో ప్రయాణీకుల వద్ద నుండి లాక్కున్న వస్తు సామగ్రిని కొందరు ముస్లింలు కొని ప్రయాణీకులకు తిరిగి ఇచ్చివేశారు. ఆ ప్రయాణీకుల పట్ల స్వయంగా గ్రీక్ సోదర క్రైస్తవులైనప్పటికీ

గ్రీకుల అమానుష ప్రవర్తన - ముస్లిమేతరుల పట్ల ముస్లిముల కారుణ్యపూరితమైన ప్రవర్తనకు మధ్య ఎంతో గొప్ప భేదముంది! గ్రీకులు వారిని అవహేళన చేశారు. వారి కోసం లూయీ ఇచ్చిన ధనాన్ని దోచుకున్నారు. ఫలితంగా వారిలో కొందరు తమ ధర్మాన్నీ విడనాడి తమ (విముక్తికారుల) ముస్లింల ధర్మాన్ని స్వీకరించారు. ఓ ప్రాచీన చరిత్రకారుడు ఉటంకించినట్లు "పాషాణ హృదయులైన వారి సోదరులు వారిని చిత్రహింసలకు గురిచేశారు. కాని ముస్లింల వద్ద వారికి రక్షణ లభించింది. వెనుకకు మరలి వచ్చిన వారిలో మూడువేల మందికి పైగా జనం టర్కీ వారిలో కలిసిపోయారు. ఆహా! ఈ దయ, సానుభూతులు విద్రోహం కంటే కూడా సహించరానివయ్యాయి! వారు ఆ ప్రయాణీకులకు రొట్టె అయితే ఇచ్చారు కాని విశ్వాసాన్ని మార్చివేశారు. అయితే ఎవరినీ తమ మతాన్ని మార్చుకొమ్మని వత్తిడి చేయలేదు. వారికి సేవ చేయడంతోనే సరిపెట్టుకున్నారు."

## ఇక నాగరిక ప్రపంచంలో

సత్యాన్వేషణకు అంతదూరం వెళ్ళనవసరం లేదు. కడచిన రెండు ప్రపంచ సంగ్రామాల్లో పాశ్చాత్య జాతుల కఠిన హృదయాలు వదలిన రక్తసిక్త చిహ్నాలు, మధ్య ప్రాచ్యంలో ఇస్లామీయ ప్రదర్శించిన ఆచరణ, గుణగణాలకు ప్రతిగా, వారి ప్రవృత్తిని, దౌర్జన్య వైఖరిని చాటుతున్నాయి. పరిపాలనా రంగంలో, యుద్ధ మైదానంలో వారు అవలంబించిన వైఖరి వారి అమానుషత్వానికి, పైశాచిక ప్రవృత్తికి ప్రతీకలుగా నిలిచిపోయాయి. ఇప్పుడు వారి కుటిలత, కాపట్యం ప్రపంచం ముందు బహిర్గతమైపోయాయి.

ఈనాడు వారు ప్రతి అంతర్జాతీయ సమావేశంలో తమ నాగరికత, సంస్కృతి, మానవమైత్రి, ప్రేమానురాగాల్ని ప్రచారం చేసుకుంటారు. కాని తాము చేస్తున్న యుద్ధాల్లో తమ దురాక్రమణ ప్రాంతాల్లో, తమ వలస రాజ్యాల్లో వారు తమలోని పశుప్రవృత్తిని, రక్తదాహాన్ని బహిరంగంగానే ప్రదర్శిస్తుంటారు. పాశ్చాత్య జాతులు ప్రదర్శించిన ఈ పైశాచిక వైఖరికి కొందరు సాకులు చెబుతుంటారు. అదేమంటే మధ్య యుగాల్లో ఆ ప్రజలు అంతగా నాగరికులు, సంస్కారవంతులు కారని, అందువల్ల వారి నుండి మరో వైఖరిని ఆశించడం సమంజసం కాదని అంటారు. అయితే ఇప్పుడు వారు నాగరికులే కాదు, నాగరికతా పీఠాన్ని అలంకరించి యావత్

ప్రపంచానికి విద్యలు, కళలు, నూతన ఆవిష్కరణలు అందించగలుగుతున్నారు కదా! మరి ఇప్పటికీ వారి ప్రవృత్తిలో మార్పు ఎందుకు రాలేదు?

అసలు విషయం అది కాదు, ప్రతీ కపట నాటకంలోనూ విజయం సాధిస్తున్న ఆ జాతుల అసలు నైజం ఏమిటన్నదే ప్రశ్న. వాస్తవం ఏమంటే పాశ్చాత్య దేశాల్లో ఒకప్పుడున్న లక్షణాలు, అలవాట్లు ఇప్పటికీ మార్పు చెందకుండా ఉన్నాయి. పూర్వం వారు పశులక్షణాలు, బహుదైవారాధకుల గుణాలు కలిగి ఉండేవారు. మధ్య యుగాల్లో ఆ అలవాట్లు, లక్షణాలు, మత దురభిమానం రూపాన్ని దాల్చాయి. అందువల్ల వారి పశు లక్షణాల బాధ్యతను ధర్మం మోయాల్సి వచ్చింది. నేడు వారి హృదయ కాఠిన్యత, పశు ప్రవృత్తులు నాగరికతా సంస్కృతులు అనే తెరల వెనుక యధాప్రకారం తమ పనిని నిర్వహిస్తూనే ఉన్నాయి. అందువల్ల ఇప్పుడు ఈ శాంతి, శ్రేయస్కరం, సంస్కృతి, నాగరికతలు వారి హృదయ కాఠిన్యత, రాక్షస ప్రవృత్తుల భారాల్ని మోయాల్సి వస్తున్నది.

ప్రతీ కాలంలోనూ ఈ జాతులు, దుర్మార్గం, దౌర్జన్యం, దురభిమానం, రక్తపాతం, బలప్రయోగం వంటి పశు లక్షణాలే కలిగి ఉన్నాయి. అయినా లజ్జా రహితులైన ఈ ప్రజలు ఇస్లామీయ విజయగాధల్ని గురించి ఏ నోటితో పాషాణ హృదయుల కథలని ఆరోపిస్తున్నారు? అసలు వారి ఆరోపణలన్నీ ఓ అబద్ధాల పుట్ట. వారు తమ అసహ్యకరమైన సామ్రాజ్యవాదాన్ని కారుణ్యం, కనికరాల రూపంలో ప్రదర్శిస్తారు. అసలు ముస్లింలకు, వారికి మధ్యగల వాస్తవిక పరిస్థితిని ఓ కవి ఇలా చెప్పాడు :

"మేము పాలకులమయినప్పుడు క్షమ, కారుణ్యం మా ప్రత్యేక ప్రాణప్రదమైన లక్షణమై ఉండింది. కాని మీరు పాలకులయినప్పుడు రక్తపుటేరుల్ని ప్రవహింపజేశారు."

"మీకూ మాకూగల ఈ భేదం పట్ల ఆశ్చర్యపడాల్సిన అవసరం లేదు. ఎందు కంటే పాత్రలో ఏముంటే అదే బయటికి ఒలుకుతుంది."

## భూతదయ

ఇస్లామీయ సంస్కృతికిగల మనోహర కోణాల విషయంలో ఇదొక విచిత్ర శీర్షిక. మన ప్రస్తుత కాలంలో ఇది అద్భుత విషయమని అనిపించదు. కారణమేమంటే గత కొంతకాలం వరకు జంతువులు కూడా న్యాయం, దయ, సానుభూతులకు

పాత్రులవుతాయని మానవ ప్రపంచం భావించలేదు. ఇప్పటికీ కొన్ని జాతుల్లో వ్యాయామ సందర్భాల్లో, సంతోష సమయాల్లో, జాతీయ ఉత్సవాల్లో ఉల్లాసం కోసం జంతువుల్ని చంపే రివాజు ఉంది. కాని ఈ అధ్యాయంలో కూడ ఇస్లామీయ సంస్కృతి తన సిద్ధాంతాలు, ఆచరణ రీతుల దృష్ట్యా కారుణ్య రూపంలోనే ప్రత్యక్షమైంది. అలాంటి దృష్టాంతం గతించిన నాగరికతలో మనకు ఎక్కడా కానరాదు. ఇస్లామీయ సంస్కృతి ఆవిర్భవించిన తర్వాత కూడ ఈనాటి వరకు ఏ జాతికీ ఆ అదృష్టం దక్కలేదు. అంటే జంతువుల పట్ల దయ, జాలి, చూపటం అన్నమాట. దీన్ని గురించి కొన్ని విశేషాలు చదవండి.

## జంతులోకం కూడా ఓ జగత్తే!

జంతులోకం కూడ మానవలోకం వలే ఓ జగత్తు అని మొట్టమొదట ప్రకటించింది ఇస్లామీయ సంస్కృతే. జంతు ప్రపంచానికి కొన్ని లక్షణాలు ఉన్నాయి. దానిది ఓ ప్రత్యేకమైన నైజం.

**"భూమిపై సంచరించే ఏ జంతువునైనా, గాలిలో రెక్కలతో ఎగిరే ఏ పక్షినైనా చూడండి. ఇవన్నీ మీ వంటి జీవరాసులే."** ***(అల్ అన్ ఆమ్ : 38)***

కాబట్టి జాలి, దయాదాక్షిణ్యాలకు మానవుడు ఎలాగైతే అర్హుడో అలాగే జంతువులు కూడా అర్హులే.

ఒక హదీసులో ఉంది :

"నేలపై ఉన్నవారిపై మీరు దయచూపండి, నింగినున్న వాడు మీపై కరుణిస్తాడు." (ఎవరికి మృదు స్వభావం ప్రసాదించబడిందో వారికి అంతిమ దినాన మేలులోంచి ఓ భాగం ఇవ్వబడింది). (ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్, అబూదావూద్, తిర్మిజి, హాకిం)

## రక్ష, శిక్ష

భూతదయ కొన్ని సమయాల్లో మానవుని స్వర్గ ప్రవేశానికి కూడా కారణభూతమవుతుంది. ఉదాహరణకు, దైవప్రవక్త (సఅసం) తెలిపిన ఈ ప్రవచనాన్ని వినండి. "ఒక వ్యక్తి ఎటో వెళుతున్నాడు, అతనికి చాలా దప్పికయింది, వెదకగా ఓ బావి కనిపించింది. అందులోకి దిగి నీళ్ళు త్రాగి బయటికొచ్చాడు. అంతలో ఓ కుక్క రొప్పుతూ, తీవ్రమైన దప్పికతో మట్టి నాకడం కనిపించింది. ఆ వ్యక్తి, నా వలెనే ఈ

కుక్క కూడా దాహాన్ని భరించలేక పోతోందని గ్రహించి మళ్ళీ బావిలోకి దిగి, తన తోలు సంచిలో నీళ్ళు నింపి దానిని పళ్ళతో పట్టుకొని పైకి వచ్చి కుక్కకు త్రాపించాడు. ఆ సత్కార్యానికి దేవుడు ప్రసన్నుడయి ఆ వ్యక్తిని మన్నించాడు. అప్పుడు ఆయన అనుచరులలో ఒకరు దైవప్రవక్తా! జంతువుల పట్ల జాలి చూపడం వల్ల కూడ మనకు పుణ్యఫలం ప్రాప్తిస్తుందా?" అని ప్రశ్నించారు.

"మేత మేసే ప్రతి జంతువుల పట్ల హృదయముండి, చూపే జాలికి పుణ్యఫలం లభిస్తుంద"న్నారు మహాప్రవక్త (సఅసం). (బుఖారి, ముస్లిం, మాలిక్, అహ్మద్, అబూదావూద్)

కొన్ని సమయాల్లో జంతువుపట్ల చూపే కఠినవైఖరి మనిషిని నరకానికి కూడ గొనిపోతుంది.

"ఓ స్త్రీ కేవలం ఒక పిల్లివల్ల నరక శిక్షకు అర్హురాలవుతుంది. ఆమె దాన్ని కట్టివేసి ఇటు తిండిపెట్టలేదు, అటు నేలపై ప్రాకే ప్రాణుల్ని తినడానికి స్వేచ్ఛగా వదలిపెట్టనూలేదు" అని ప్రవచించారు దైవప్రవక్త (సఅసం). (బుఖారి)

కేవలం ప్రోత్సహించడం, ఆసక్తి చూపడంతో సరిపెట్టుకోలేదు ఇస్లామీయ సంస్కృతి. భూతదయను అది చట్టబద్ధం కూడా చేసింది. సవారి చేసే జంతువు వీపుపై కూర్చుండి ఎవరితోనైనా సంభాషించదలచుకుంటే జంతువును అలా చాలా సేపు నిలబెట్టడం ధర్మ సమ్మతం కాదని ఆదేశించింది.

"మీ జంతువుల వీపులకు కుర్చీలుగా చేయకండ"ని మహాప్రవక్త (సఅసం) బోధించారు. (అహ్మద్, హాకిం)

అలాగే జంతువును ఆకలితో ఉంచడం, బలహీనంగా, నిస్సత్తువగా ఉంచడం నిషేధించబడింది.

ఓసారి దైవప్రవక్త (సఅసం) ఆకలివల్ల కడుపు వీపుకు అంటుకుపోయి ఉన్న ఒక ఒంటెను చూడటం తటస్థించింది. అప్పుడాయన (సఅసం) అన్నారు : "నోరులేని ఈ జంతువుల విషయంలో దేవునికి భయపడండి. (మిమ్మల్ని మోయగల) మంచిస్థితిలో ఉన్నప్పుడు వాటిపై స్వారీ చేయండి. మంచి స్థితిలోనే వాటిని వదలి వేయండి." (అబూదావూద్)

జంతువుల మీద మోయలేనంత భారాన్ని వేయడం ధర్మసమ్మతం కాదు.

అలాగే జంతువులతో వాటి శక్తికి మించిన పని తీసుకోవడం కూడా ధర్మసమ్మతం కాదు.

ఒకసారి దైవప్రవక్త (సఅసం) ఓ అన్సారీ తోటలోకి వెళ్ళారు. అక్కడ ఆయన (సఅసం) ఒక ఒంటెను చూశారు. ఆ ఒంటె ప్రవక్త (సఅసం)ను చూడగానే బాధతో ఎగిరిపడుతూ ఆవేదనతో కన్నీరు కార్చింది. దైవప్రవక్త (సఅసం) ఆ ఒంటె వద్దకు వచ్చి దాని కన్నీళ్ళు తుడిచారు. తర్వాత ఈ ఒంటె యజమాని ఎవరని అడిగారు.

"దైవప్రవక్తా! నేనే దాని యజమానిన"ని అన్సారీ అన్నాడు. అప్పుడాయన, ఆ వ్యక్తి నుద్దేశించి ఈ జంతువు విషయంలో నీవు దేవునికి భయపడ్డం లేదా? దేవుడు దీన్ని నీ అధీనం చేశాడు. నీవు దానితో పని తీసుకుంటున్నావేకాని, దాన్ని ఆకలితో ఉంచుతున్నావని ఈ ఒంటె ఫిర్యాదు చేస్తున్నది." (ఇమామ్ అహ్మద్)

అలాగే అనవసరంగా లేదా కేవలం వినోదం కోసం జంతువుల్ని వేటాడటం కూడా ఇస్లాంలో నిషేధించబడింది.

"ఎవరైనా వినోదం కోసం ఒక్క పిచ్చుకనైనా చంపితే ప్రళయదినాన అది దేవునితో, 'ఓ ప్రభూ! అతడు నన్ను వినోదం కోసం చంపాడు. నావల్ల ప్రయోజనం పొందడానికి మాత్రం నన్ను చంపలేదు' అని ఫిర్యాదు చేస్తుందన్నారు మహాప్రవక్త (సఅసం)." (నిసాయి, ఇబ్నె హిబ్బాన్)

అలాగే గురిచూసి కొట్టే అభ్యాసం కోసం జంతువుల్ని ఉపయోగించడం కూడా నిషేధించబడింది.

"ఎవరయితే కేవలం గురిని అభ్యసించడం కోసం ప్రాణుల్ని ఉపయోగిస్తారో వారిని దైవప్రవక్త (సఅసం) శపించారు." (బుఖారి, ముస్లిం)

## నిషేధించబడిన విషయాలు

మహాప్రవక్త (సఅసం) జంతువుల్ని పరస్పరం పోట్లాడించడాన్ని కూడా నిషేధించారు. ఉదాహరణకు కోడి పందేలు, పొటేళ్ళ పందేలు వగైరా. గుర్తింపు కోసం జంతువుల ముఖాల్ని అగ్నితో కాల్చడం లేదా కాలే ఇనుపకడ్డీలతో వాతలు పెట్టడం కూడా నిషేధించారు. (వాతలు పెట్టడం వల్ల మచ్చలు ఏర్పడి అవి ఇతర జంతువుల కంటే ప్రత్యేకంగా కనిపిస్తాయని కొందరు ఇలా చేస్తారు). ఓసారి దైవప్రవక్త (సఅసం) ముఖంపై వాతలు పెట్టబడిన ఒక గాడిదను చూశారు. అప్పుడాయన "ఈ పని చేసిన వ్యక్తిని దేవుడు శపించుగాక!" అన్నారు.

ఏ జంతువు మాంసం తినవచ్చో దానిపై జాలి చూపడం అంటే జిబహ్ చేసేముందు కత్తిని పదును పెట్టడం. దానికి నీళ్ళు త్రాగించడం. చర్మాన్ని ఒలిచే ముందు ప్రాణాన్ని పూర్తిగా పోనిచ్చి చల్లబడనివ్వడం. ఈ విషయంలో ప్రవక్త (సఅసం) ఇలా బోధించారు :

"ప్రతి ప్రాణిపట్ల తప్పనిసరిగా ఉపకార భావం కలిగి ఉండాలని దేవుడు ఆజ్ఞాపించాడు. కాబట్టి ఏ జంతువునైనా చంపాల్సివస్తే మంచి రీతిలో చంపండి. జిబహ్ చేయాల్సివస్తే సరిఅయిన పద్ధతిలో జిబహ్ చేయాలి. జిబహ్ చేసేవారు తన కత్తికి పదును పెట్టాలి. జిబహ్ చేయబడిన జంతువు చల్లబడేవరకు వేచి ఉండాలి." (ముస్లిం)

## అపురూప బోధనలు

జంతువును జిబహ్ చేసే విషయంలో ఎంతో జాగ్రత్త తీసుకోవలసి ఉంటుంది. ముందుగా కత్తిని పదును చేయకుండా జంతువును క్రిందపడవేయడం కూడా నిర్దయగల రాతి గుండెగా అభివర్ణించబడింది.

ఒక వ్యక్తి తన మేకను క్రింద పడవేసి కత్తిని పదును చేస్తున్నాడు. అది చూసి మహాప్రవక్త (సఅసం) "దాన్ని నీవు మర్డార్ చేయాలనుకుంటున్నావా? దాన్ని క్రింద పడవేసే ముందు కత్తిని ఎందుకు పదును చేయలేదు" అని మందలించారు.

ఇంకా వినండి, భూతదయ అధ్యాయంలో ఇస్లామీయ సంస్కృతీ లక్ష్యాన్ని దేదీప్యమానంగా ప్రకాశింపజేసే ప్రభావవంతమైన ఓ సంఘటన ;

హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి) అంటారు :

"ఒక ప్రయాణంలో మేము దైవప్రవక్త (సఅసం)తో కలసి వెళుతున్నాము. ఒకచోట మేము హుమ్ర (పిచ్చుకలాంటి ఓ చిన్న పక్షి)ని చూశాము. దానికి రెండు పిల్లలు ఉన్నాయి. మేము ఆ రెండు పిల్లల్ని పట్టుకున్నాము. హుమ్ర వచ్చి మా తలలపై ఆందోళన పడుతూ ఎగురుతోంది. దైవప్రవక్త (సఅసం) మా వద్దకు వచ్చి: "దాని పిల్లల్ని లాక్కొని దాన్ని ఎవరు బాధపెట్టారు? దాని పిల్లల్ని దానికి తిరిగి ఇచ్చివేయండి" అన్నారు.

## ఆ ప్రయాణంలోని ఇంకో సంఘటన

చీమలపుట్ట కాలిపోయి ఉండడాన్ని మహాప్రవక్త (సఅసం) చూశారు. అప్పుడాయన, "దాన్ని ఎవరు తగులబెట్టార"ని అడిగారు. "మేమే" అని హజ్రత్

మస్‌ఊద్ (రజి) జవాబిచ్చారు. అందుకాయన "ఒకర్ని అగ్నిలో కాల్చి శిక్షించే హక్కు దేవునికి తప్ప ఇంకెవరికీ లేద"న్నారు. (అబూదావూద్)

## కొన్ని ఫిఖ్‌హ్ ఆజ్ఞలు

ఈ బోధనల ద్వారా ఇస్లామీయ ఫిఖ్‌హీలు (ఇస్లామీయ ధర్మశాస్త్రజ్ఞులు) జంతువుల పట్ల దయ, జాలికి ఉత్తమ ఆజ్ఞలను రూపొందించారు. వారంటారు: జంతువుల అవసరాన్ని తీర్చవలసిన బాధ్యత యజమానిపై ఉంది. అతడు వాటి అవసరాల్ని తీర్చలేకపోతే, వాటి సంరక్షణ, వాటి అవసరాల్ని తీర్చడానికిగాని లేక వాటిని అమ్మి వేసేందుకు గాని లేక వాటికి మేత, నీడ లభించే అడవుల్లో స్వేచ్ఛగా వదలి వేసేందుకుగాని చట్టరీత్యా అతనిపై చర్య తీసుకోబడుతుంది. ఒకవేళ అవి హలాల్ జంతువులయి ఉండి, వాటి మాంసం తినడానికి యోగ్యమయినదయి ఉంటే వాటిని జిబహ్ చేసివేయాలి.

ఇంకొందరు ధర్మశాస్త్ర నిపుణులు అంతకంటే కూడా కఠిన వైఖరి అవలంబించారు. వారంటారు – "ఒకవేళ ఓ గ్రుడ్డి పిల్లి ఎవరింట్లోకైనా పోయి ఇక ఎటూ వెళ్ళలేకపోతే దానికి ఆహారమిచ్చే బాధ్యత ఆ ఇంటి వారిపై పడుతుంది." అంతేకాదు, ధర్మశాసన కర్తలు జంతువులపై వాటి శక్తికి మించిన భారాన్ని వేయడాన్ని కూడా నిషేధించారు. ఈ సూత్రం ఆధారంగా వారు ఎన్నో చట్టపరమైన హక్కుల్ని రూపొందించారు. ఒకవేళ ఎవరైనా ఒక జంతువును బాడుగకు తీసుకొని దానిపై దాని శక్తికి మించిన భారాన్ని వేయడంవల్ల అది మరణిస్తే దాని ఖరీదును దాని యజమానికి ఇచ్చే బాధ్యత ఆ వ్యక్తిపై ఉంటుంది.

అలాగే ఇస్లామీయ ధర్మశాసన కర్తలు గాడిదలు, కంచర గాడిదలపై వేసే బరువు పరిమాణాన్ని కూడా నిర్ణయించారు. విచిత్రం ఏమిటంటే ఒక ఫిఖ్‌హ్ వర్గం గాడిదకు, కంచర గాడిదకు ఒకే పరిమాణం నిర్ణయించగా, రెండవ ఫిఖ్‌హ్ వర్గం వారి అభిప్రాయంతో ఏకీభవించలేదు. ఇలాంటి పరిమాణం నిర్ణయించి కంచర గాడిదకు న్యాయం చేశారు కాని, గాడిదపట్ల మాత్రం అన్యాయం జరిగింద"న్నారు వారు.

ఒక జంతువు ఇంకో జంతువును బాధిస్తే అది "తప్పు". అందుకు "దోషి" అయిన జంతువును, అది చేసిన దోషానికి శిక్ష ఇవ్వబడదు. కాని దాని యజమాని

దాన్ని కట్టివేసి తగు జాగ్రత్తలు తీసుకోవడంలో నిర్లక్ష్యం చేశాడని రుజువయితే మాత్రం అతనికి శిక్ష విధించవచ్చు."

ఇవీ ఇస్లామీయ సంస్కృతి, ఇస్లామీయ షరీఅత్‌లో భూతదయకు సంబంధించిన అపూర్వ సూత్రాలు. ఇక ఈ సూత్రాల్ని ఆచరణలో పెట్టి చూపించబడ్డాయా? అన్న ప్రశ్న మిగులుతుంది.

## సద్వర్తనకు మరికొన్ని నిదర్శనాలు

"మహాప్రవక్త (సఅసం) ఓసారి ప్రయాణమై (ఎక్కడికో) వెళుతున్నారు. ఆ సమయంలో ఓ అన్సారి మహిళ ఒక ఒంటెకు "నీకు శాపం తగులుగాక" అని అంది. ఆమె దానిపై సవారి చేస్తుంది కూడా. ఆ మహిళ పలికిన మాటలు ప్రవక్త (సఅసం) విని చాలా బాధపడుతూ, "ఆ ఒంటె మీద ఉన్న సామానులన్నీ తీసుకొని దాన్ని వదలివేయండి. ఎందుకంటే అది శాపగ్రస్తురాలయింది" అని ఆజ్ఞాపించారు. వెంటనే ఆ ఒంటెను వదలివేయడం జరిగింది. అది స్వేచ్ఛగా అందరి మధ్య తిరిగేది. దాన్ని ఎవరూ ఏమీ అనేవారు కాదు." (ముస్లిం)

ఒక వ్యక్తి ఓ మేకను జిబహ్ చేసేందుకు దాని కాళ్ళు పట్టుకొని నేలపై ఈడ్చుకుంటూ వెళ్ళడం హజ్రత్ ఉమర్ (రజి) చూశారు. అప్పుడాయన "నీవు నాశనమయి పోదువు గాక, దాన్ని చంపటానికి మంచి పద్ధతితో తీసుకు వెళ్ళు" అన్నారు ఆ వ్యక్తితో.

## ఇస్లామీయ ప్రభుత్వ బాధ్యతలు

ఖలీఫాలు తరచుగా ప్రజలకు సాధారణ హితవులు జారీ చేస్తుండేవారు. జంతువులను బాధించి దుఃఖపెట్టరాదని, వాటి పట్ల మృదువర్తన కలిగి ఉండాలని నొక్కి చెబుతుండేవారు. ఇస్లామీయ ప్రభుత్వం జంతువులపట్ల చూపే జాగ్రత్తలకు ఎంతటి ప్రాధాన్యతనిచ్చిందో ఇంతకంటే మించి నిదర్శనం ఇంకేముంటుంది?

హజ్రత్ ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ (రజి) తన లేఖలో గవర్నర్లందరికి "గుర్రాల్ని అనవసరంగా కొట్టి బాధించరాదని, కళ్ళాలు వేసి అలాగే ఉంచరాద"ని హితవు చేశారు. ఆయన నికక్ శాఖ (ట్రాఫిక్ మరియు గస్తీ పోలీసు వంటి శాఖ)కు ఇలా వ్రాశారు: "గుర్రాల నోట్లో బరువైన కళ్ళాలు వేసేందుకు గాని, కొనకు లోహం అమర్చిన కొరడాను ఉపయోగించేందుకు గాని ఏ వ్యక్తికి అనుమతించరాదు."

ఇంకా హజ్రత్ ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ (రహ్మాలై) కాలంలో ప్రజలు జంతువుల మీద అధిక భారాన్ని వేయకుండా చూడటం, జంతువులకు అతిగా శిక్షించడం, ప్రయాణ సమయాల్లో విచక్షణా రహితంగా కొట్టడం లాంటి పనులు జరుగకుండా చూడటం మొదలైన విషయాలన్నీ తనిఖీ అధికారి బాధ్యతల్లో చేరి ఉండేవి. ఎవరన్నా అలా చేయడం చూస్తే, వారిని శిక్షించి, సక్రమ మార్గంలో పెట్టాల్సిన బాధ్యత ఆ అధికారిదే.

జంతువుల్ని బాధించే వారి విషయంలో షరీఅత్ చట్టం ఇలా అంటోంది:

"ప్రజలు అలా చేయకుండా వారిని నిరోధించడం పోలీసు అధికారికి హక్కు ఉంది. అందులో ప్రజా శ్రేయస్సు దాగి ఉంది. వాటి శక్తికి మించిన బరువు వేసేందుకుగాని, వాటిపై బరువు ఉండగా, వేగంగా నడిపేందుకుగాని, గట్టిగా కొట్టేం దుకుగాని అనుమతి ఉండేది కాదు. బరువులు మోస్తున్న జంతువుల్ని పబ్లిక్ పార్కుల్లో నిలబెట్టడం ధర్మసమ్మతం కాదు. ఈ పనులన్నీ ఇస్లామీయ షరీఅత్‌కు పూర్తిగా విరుద్ధమయినవి. జంతువుల ఆహార విషయంలో యజమానులు దేవునికి భయపడాలి. జంతువులు తినేంత మేత వేయాలి. ఆ మేత చెత్తగాను, తక్కువగాను ఉండరాదు."

## జంతు రక్షణ సంస్థలు

జంతు రక్షణ సంస్థలు కూడా ఆనాడు అధిక సంఖ్యలో ఉండేవి. అందుకు చక్కని నిదర్శనం పూర్వకాల సంస్థలు దస్తావేజులే. వాటిని క్షుణ్ణంగా పరిశీలిస్తే రోగపీడిత జంతువులకు ప్రత్యేక చికాత్సాలయాలు ఉండేవని తెలుస్తుంది. ఇంకా ముసలి జంతువులు మేయడానికి పచ్చిక మైదానాలు ప్రత్యేకించబడి ఉండేవి. అలాంటిది డెమాస్కస్‌లోని "మర్జె అహ్జర్" ఒకటి. అక్కడ ఇప్పుడు మున్సిపాలిటి వారు క్రీడా మైదానాన్ని ఏర్పాటు చేశారు. ఈ పచ్చిక మైదానం, అప్పట్లో పనికిరాని ముసలి గుర్రాలు మేయడానికి ప్రత్యేకించబడింది.

డెమాస్కస్‌లోని పచ్చిక మైదానాల్లో ఆనాడు పిల్లులకు కూడా ఓ మైదానం ఉండేది. ఆ పిల్లులు అక్కడ తింటూ, త్రాగుతూ గడిపేవి. ప్రతి రోజూ వాటికి ఆహారం సరఫరా చేస్తుండేవారు. అక్కడ అవి గెంతుతూ, పరుగులెత్తుతూ విహరించడం తప్ప ఇంకెక్కడికీ వెళ్ళేవి కావు.

జంతువుల పట్ల అనన్యమయిన జాలి, కరుణ చూపే జాతి యొక్క హృదయం

ఎంత పరిణతి చెందిందో తెలియజేసే అనుపమానమైన ఈ నిదర్శనాలు యావత్తు మానవ చరిత్రలో మనకు కానరావు.

## అనన్యమయిన నిదర్శనం

జంతువుల పట్ల దయార్ద్రవర్తనకు ఓ అద్భుత నిదర్శనాన్ని ప్రముఖ సహాబీ హజ్రత్ అబూ దర్దా (రజి) ప్రదర్శించారు. ఆయన తన మరణ సమయంలో తన ఒంటెను సంబోధిస్తూ ఇలా అన్నారు:

"ఓ ఒంటే! ప్రళయ దినాన నీవు నీ ప్రభువు సమక్షంలో నాతో జగడ మాడకూడదు. ఎందుకంటే నీ శక్తికి మించిన బరువును నీపై నేను ఎన్నడూ వేయలేదు."

ఇంకో సహాబీ హజ్రత్ అదీ బిన్ హాతిమ్ చీమల కోసం రొట్టెను విరుస్తూ, "ఇవి మా పొరుగువారు. అందుకే వాటికి మాపై హక్కు ఉంది" అని అన్నారు.

ఇమామ్ కబీర్ అబూ ఇస్‌హాఖ్ షిరాజీ తమ అనుయాయులతో కలిసి ఎటో వెళ్తున్నారు. అంతలో వారి ముందు ఓ కుక్క వచ్చి నిలబడింది. దాని యజమాని దాన్ని వెళ్ళగొట్టాడు. అందుకు ఇమామ్ వెంటనే అతణ్ణి ఉద్దేశించి, "మనకు, కుక్కలకు మధ్య ఉన్న మార్గం ఉమ్మడి మార్గం అన్న సంగతి నీకు తెలియదా?" అని మందలించారు."

## ప్రాచీన కాలంలో ప్రజల వైఖరి

పురాతన మరియు మధ్య యుగాల్లో జంతువుల పట్ల మానవుని ప్రవర్తన ఎలా ఉండిందో, జంతువుల్ని చంపే, హింసించే విషయాల్లో ఇతర జాతుల వైఖరి ఎలా ఉండేదో తెలుసుకోనంత వరకు ఇస్లామీయ సంస్కృతి, జంతువుల పట్ల ప్రదర్శించిన కారుణ్య వైఖరి ఎంతటి విలువైనదో మనం అంచనా వేయలేము. ఈ విషయంలో మొట్టమొదట పరిశీలించాల్సిన విషయం - ఇతర జాతుల సంస్కృతీ బోధనల్లో జంతువుల పట్ల మృదువైఖరి కలిగి ఉండాలన్న హితవులు వాటిపై తప్పనిసరిగా జాలి చూపాలన్న హితవులు అసలు మనకు కానరావు. అందువల్లే ఆ జాతుల వద్ద జంతువుల పోషణ, వాటి పట్ల జాగ్రత్తలకు సంబంధించిన ఏ బాధ్యతలూ వాటి యజమానులపై ఉన్నట్లు కానరావు.

అందుకు భిన్నంగా మధ్య యుగాల నుండి 19వ శతాబ్దం వరకు గడిచిన కాలంలో కొన్ని వింత పరిస్థితులు మన ముందుకు వస్తాయి. ఆనాడు స్వయంగా జంతువు చేసిన నేరానికి లేక దాని యజమాని చేసిన నేరానికి శిక్ష విధించడం జరుగుతుండేది. విచక్షణ కలిగి, ఆలోచించగల మానవుడు దోషి అయితే అతని పట్ల ఎలా ప్రవర్తిస్తామో అలాగే జంతువుల పట్ల కూడా ప్రవర్తించేవారు. మనుషులకు ఎలా శిక్షలు పడేవో అలాగే జంతువులకు కూడా శిక్షలు పడేవి. వాటిని ఖైదు చేసేవారు, బహిష్కరించేవారు. తుదకు నేరం రుజువైన మనిషికి వలె మరణ శిక్ష కూడా విధించబడేది.

## యూదుల ధర్మశాస్త్రంలోని కొన్ని నియమాలు

ఒక ఎద్దు పురుషుడ్ని లేక స్త్రీని కొమ్ములతో పొడవగా ఆ వ్యక్తి మరణిస్తే ఆ ఎద్దును రాళ్ళతో కొట్టి చంపాలి. ఒకవేళ ఆ జంతువుకు కొమ్ములతో పొడిచే అలవాటు లేకుండా కేవలం కాకతాళీయంగా పొడవగా మనిషి మరణిస్తే దాని యజమానిని ఏమీ అనరాదు. కాని దానికి పొడిచే అలవాటు ఉండి, అది ఇలా చేస్తుందని ప్రజలు యజమానిని హెచ్చరించినప్పటికీ అతడు తగు జాగ్రత్తలు తీసుకోకుండా ఉంటే, దాని వల్ల పురుషుడు లేక స్త్రీ మరణిస్తే అప్పుడు ఆ జంతువును రాళ్ళతో కొట్టి చంపవలసి ఉంది. దాని యజమానికి మరణశిక్ష విధించబడుతుంది. యూదుల ధర్మశాస్త్రంలో జంతువును శిక్షించే పద్ధతి కూడా ఉంది. ఉదాహరణకు ఏ వ్యక్తిఅయినా ఏదైనా జంతువుతో సంగమిస్తే ఆ వ్యక్తినీ, ఆ జంతువుని ఇద్దర్నీ హతమార్చడం జరుగుతుంది.

## ప్రాచీన గ్రీక్‌లో

ప్రాచీన కాలంలో గ్రీకుల వద్ద మనిషి మరణానికి కారణమయ్యే జంతువులను శిక్షించడానికి ఓ ప్రత్యేక శాఖ ఉండేది. అంతేకాదు, మనిషి మృత్యువుకు కారణమయ్యే వృక్షాలకు కూడా శిక్షలు వధించబడేవి. ఆ శాఖ పేరు "బ్రీతానియూన్". నేరం చేసిన జంతువృక్షాలను పరిశీలించి తీర్పు ఇచ్చేందుకు సమావేశాలు జరిగే ప్రదేశమది. అఫ్లాతూన్ తన గ్రంథం "శాసనం"లో ఇలా వ్రాశాడు :

"ఏ జంతువునైనా ఒక మనిషిని చంపితే ఆ జంతువుకు వ్యతిరేకంగా న్యాయస్థానంలో కేసు నమోదు చేసే హక్కు మృతుని కుటుంబీకులకు ఉండేది.

మృతుని సంబంధీకులకు జమీందారుల్లో ఒక న్యాయమూర్తిని ఎన్నుకొనే హక్కు ఉండేది. నేరం రుజువైతే విధిగా ఆ జంతువు చంపబడేది. దాని మృత శరీరం దేశానికి ఆవల విసరివేయబడేది. కానీ మానవునితో పోరాడ్డం కోసం పెంచబడే జంతువులు ఈ చట్టం పరిధిలోకి రావు. క్రీడలు, ఉత్సవాల సమయాల్లో ఆ జంతువులకు, మానవులకు మధ్య పోటీ జరిగేది. అప్పుడా జంతువు మనిషిని చంపివేస్తే అది దోషిగా పరిగణించబడేది కాదు. ఒకవేళ ఏదయినా ఘనపదార్థం మనిషి మీద పడి మరణిస్తే మృతుని పొరుగునున్న సమీప బంధువుల్లో ఒకర్ని తీర్పు ఇచ్చేవానిగా నిర్ణయించబడేది, అతడు ఆ ఘన పదార్థాన్ని దేశానికి బయట విసరిపారవేయండని తీర్పు ఇచ్చేవాడు. కేవలం మనిషి మరణానికి కారణమయినందుకు శిక్షయే కాకుండా అది ఇంకా ఏ నేరం చేసినా శిక్షపడేది. ఉదాహరణకు ఒక కుక్క మనిషిని కరిస్తే దానికి నేరస్తునిలా త్రాళ్ళతో బంధించి దాని కాటుకు గురైన వ్యక్తి ముందు నిలబెట్టాల్సిన బాధ్యత దాని యజమానికుంది. ఆ మనిషి ఎలా ప్రతీకారం తీసుకోవాలన్నా అతనికా హక్కు ఉంది. దాన్ని చంపడం, శిక్షించడమే కాకుండా ఇంకే విధంగానయినా ప్రవర్తించవచ్చు.

అలాగే కొన్ని సమయాల్లో జంతువు యొక్క యజమాని కుటుంబంలోని వ్యక్తి నేరం చేసినందుకు ఏ శిక్ష అయితే పడుతుందో ఆ కుటుంబంలోని జంతువుకు కూడా ఆ శిక్ష పడుతుంది. ఉదాహరణకు ఒక వ్యక్తి మతానికి లేక ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఏదైనా పెద్ద నేరం చేస్తే అందుకుగాను అతనికి మరణశిక్ష విధించబడితే అతని జంతువులను, ఆస్తులను, సేవకులను కూడా చంపివేయడం, కాల్చివేయడం, దేశ బహిష్కరణ వంటి శిక్షలు విధించబడేవి.

## పూర్వపు రోమన్ల శాసనం

పూర్వపు రోమన్ల శాసనంలో ఈ అంశం చేరి ఉంది : ఒక వ్యవసాయదారుని ఎద్దు వ్యవసాయం సాగుతున్న తన పొలానికి, దాని ప్రక్కనున్న పొరుగు వాని పొలానికి మధ్య గల హద్దులను దాటితే ఆ ఎద్దుకు, దాని యజమానికి మరణశిక్ష విధించేవారు. మనిషిని కాటు వేసిన కుక్కకు కనీస శిక్ష ఏమంటే అది కాటు వేసిన వ్యక్తికి దాన్ని అప్పగించే వారు. అతడు దాన్ని తన ఇష్టమొచ్చినట్లు శిక్షించవచ్చు. అలాగే ఒక జంతువు తన యజమాని పొలంలో కాకుండ ఇతరుల పొలాల్లో మేస్తే దాన్ని ఆ పొలం యజమానికి అప్పగించేవారు.

పూర్వపు జర్మనుల్లో కూడా రోమన్లు, గ్రీకుల శాసనాల వలెనే జంతువులకు శిక్షలు విధించేవారు.

## పూర్వపు పర్షియాలో

పూర్వపు పర్షియాలో ఇంతకంటే వింత శిక్షలు అమలులో ఉండేవి. ఒక పిచ్చి కుక్క మేక పిల్లను కరవగా అది మరణిస్తే లేక, మనిషిని కరవగా అతడు గాయపడితే ఆ కుక్క కుడి చెవిని కోసివేసేవారు. ఇది రెండవ సారి కూడా అలా కరిస్తే దాని ఎడమ చెవిని కోసివేసేవారు. మూడవసారి కూడా అలా చేస్తే దాని కుడి కాలు, నాల్గవసారి కరిస్తే దాని ఎడమ కాలు కోసివేసేవారు. అది అలా ఐదవ సారి కరిస్తే దాని తోక మొదలును కోసివేసేవారు.

## ఐరోపా జాతుల దృక్పథం

మధ్య యుగాల్లో ఐరోపా జాతుల్లో 13వ శతాబ్దంలో జంతువు చేసిన నేరానికి శిక్ష విధించాలని నిర్ణయించిన మొట్టమొదటి దేశం ఫ్రాన్స్ అక్కడి ప్రత్యేక న్యాయ స్థానాల్లో మనిషిపై కేసు నడిపించే లాగానే జంతువుపై కూడా చర్యలు గైకొనేవారు. ఏ శాసనాల ద్వారా మానవునికి శిక్ష విధించేవారో ఆ శాసనాలే జంతువుకు కూడా వర్తించేవి. తరువాత 14వ శతాబ్దం చివరి కాలంలో సర్వీనియా కూడా ఈ శాసనాన్ని ప్రవేశపెట్టింది. 15వ శతాబ్దం చివరి కాలంలో బెల్జియం ఆ శాసనాన్ని తమ దేశంలో ప్రవేశపెట్టింది. 16వ శతాబ్దం మధ్య కాలంలో హాలెండ్, జర్మనీ, ఇటలీ, స్వీడన్‌లు కూడా ఆ శాసనాన్ని తమ దేశాల్లో ప్రవేశపెట్టుకున్నారు. సఖ్లియాలోని కొన్ని జాతుల్లో 19వ శతాబ్దం వరకు ఈ శాసనం అమల్లో ఉండేది.

హింసకు గురైన వ్యక్తి కోరికపై గాని లేదా స్వయంగా ప్రభుత్వం నిర్ణయం మేరకుగాని జంతువులపై కేసు నడుపబడేది. తర్వాత నేరం చేసిన జంతువు తరఫున న్యాయవాది వాదించేవాడు.

కొన్ని సమయాలందు జాగ్రత్త కోసం న్యాయస్థానం ఆ జంతువుల్ని లాకప్‌లోకి పంపిస్తుంది. తర్వాత మానవులకు విధించే శిక్షలాగానే బహిరంగంగా వాటికి శిక్ష అమలుజరిపేది. కొన్ని సందర్భాలలో జంతువును రాళ్ళతో కొట్టి చంపేందుకు, తల నరికేందుకు, కాల్చివేసేందుకు లేక చంపడానికి ముందు దాని కొన్ని అవయవాలను కోసేవారు.

ఇలా ఈ కేసులు కేవలం వినోదం కోసం, ఏదో తృప్తికోసం ఏర్పాటు చేసేవారేమోనని పాఠకులు తలచరాదు సుమా! ప్రశాంతంగా పరిశీలించి, ఆలోచించే కేసులు నిర్ణయించేవారు. ఎందుకంటే శాసనాలు అమలుపరచడానికి, తీర్పు ఇచ్చే నివేదిక తయారీ విషయంలో ఎంతో విజ్ఞతతో నిర్ణయం గైకొనబడేది. ఉదాహరణకు తీర్పు ఇచ్చే పదజాలం ఇలా ఉండేది : "న్యాయానికిగల లక్ష్యాలు పూర్తికాగలందులకు జంతువుకు మరణశిక్ష విధించబడుతుంది" లేదా "అది అమానుషమైన, క్రూరమైన నేరం చేసినందుకు గాను దానికి ఉరి శిక్ష ఇవ్వబడుతుంది."

## మరికొన్ని వింత శిక్షలు

ఈ విషయంలో వింత వింత ఆచారాలు అమల్లో ఉండేవి. వారి అభిప్రాయంలో జంతువులు ప్రకృతి శాసనాలకు, ప్రవృత్తి నియమాలకు భంగం కలిగించే విధంగా ప్రవర్తించాయన్న నేరం మీద వాటికి వ్యతిరేకంగా కేసులు నడిపేవారు. జంతువులు చేతబడులు మంత్రాలు చేస్తాయని కూడా వాటిపై నేరం మోపేవారు. ఈ చేతబడి అనేది వారివద్ద క్షమించరాని నేరం. ఆ నేరం చేసే జంతువుల్ని అగ్నిలో కాల్చివేసేవారు. జంతువులకు శిక్షలు అమలు జరిపేటప్పుడు పెద్ద పెద్ద ఉత్సవాలు ఏర్పాటు చేసేవారు. తలారి కట్టె ముక్కలు తెచ్చి మైదానంలో పేర్చేవాడు. శిక్షలు పడ్డ పిల్లులు అక్కడకు తేబడేవి. పిల్లి ఇనుప బోనులో బంధించబడేది. శిక్ష అమలుజరిపే సమయంలో కొందరు సన్యాసులు వచ్చేవారు. వారి వెంట కొందరు అధికారులు కూడా ఉండేవారు. వారిలో ఒకరి చేతిలో నిప్పంటించడానికి రెండు దివిటీలు ఉండేవి. అధికారులు పిల్లుల్ని మంటల్లో పడవేసి బుగ్గయి పోవడానికి ఆజ్ఞలు జారీచేసేవారు. ఎందుకంటే అవి చేతబడి కంటే నీచమైన నేరం చేశాయి కనుక.

## ఇంకొన్ని కేసుల వివరాలు

మధ్య యుగాల్లో జంతువులపై మోపిన కేసుల వివరాలు పాఠకుల ముందుంచడం సమంజసమనుకుంటున్నాము. అలాంటి కేసుల్లో ప్రసిద్ధిగాంచిన కేసు ఫ్రాన్సు నగరమైన ఊటోన్‌లో ఎలుకలకు వ్యతిరేకంగా ఇచ్చినది. ఇది 15వ శతాబ్దపు సంఘటన. ఎలుకలు అధిక సంఖ్యలో వీధుల్లో, సందుల్లో అతి భయంకరంగా సంచరించడం వల్ల ప్రజల సుఖ, శాంతులకు భంగం కల్గుతోందని వాటిపై నేరారోపణ చేయబడింది.

వాటిని కాపాడ్డానికి ఫ్రాన్సులోని ప్రఖ్యాత న్యాయవాది షాసానియా రంగంలోకి దిగాడు. ఆ సమయంలో ఎలుకలు కోర్టుకు హాజరుకాలేకపోయాయి. ఎందుకంటే వాటిలో పిల్లలు, వృద్ధులు, రోగులు కూడా ఉన్నాయి. ఆ న్యాయవాది కొంచెం గడువు ఇప్పించమని కోర్టును కోరాడు. న్యాయస్థానం పరిమితమైన గడువు ఇచ్చింది. కాని గడువు పూర్తి అయిపోయినా ఎలుకలు కోర్టుకు హాజరుకాలేదు. అప్పుడు ఆ ఎలుకల న్యాయవాది ఇలా వాదించాడు:

"గౌరవనీయమైన న్యాయస్థానం ఆజ్ఞల్ని పాటించటానికి ఎలుకలు సిద్ధంగా ఉన్నాయి. కానీ అవి ఇక్కడకు వచ్చే మార్గంలో పిల్లులు బాధించి, హింసిస్తాయన్న భయం ఉంది. అందువల్ల ముద్దాయిల శాంతి, భద్రతలకు భంగం వాటిల్లకుండా కోర్టుకు హాజరు పరచాల్సిన బాధ్యత ప్రధాన న్యాయమూర్తి వహించాల్సి ఉంది."

ముద్దాయిలు కోర్టుకు వస్తున్నప్పుడు వాటికి ప్రాణాపాయం కలుగకుండా పిల్లుల్ని బంధించి వేయడానికి ఆజ్ఞలు జారీచేయాలని ఆయన కోర్టుకు కోరాడు. కోర్టు ఆయన దరఖాస్తును మంజూరు చేసింది. ఎలుకలు కోర్టుకు వస్తున్న సమయంలో వాటిని భయకంపితుల్ని చేయకుండా పిల్లుల్ని, కుక్కల్ని రోడ్లపై తిరుగనివ్వరాదని చీఫ్ జస్టిస్ ఆజ్ఞలు జారీచేశాడు. కాని నగర ప్రజలు ఆ ఆజ్ఞల్ని పాటించలేదు. అంటే పిల్లుల్ని, కుక్కల్ని రోడ్లవెంట తిరగడాన్ని ఆపలేకపోయారు. అందువల్ల ఎలుకల మీద మోపబడిన నేరాన్ని కోర్టు కొట్టివేసింది. ఎందుకంటే ప్రతివారు తన కేసును వాదించుకోడానికి అన్ని సౌకర్యాలు కలిగి ఉండాలి. ఎలుకలు అలాంటి సౌకర్యాలు కలిగిలేవు. కనుక వాటిని వదిలేయడం జరుగుతున్నదని కోర్టు తీర్పు ఇచ్చింది. ఈ చిత్ర విచిత్ర కేసును వాదించి విజయం సాధించినందుకు ఆ న్యాయవాది ఎంతో ఖ్యాతి పొందాడు. అయితే ఆ వకీలు కేసు వాదించినందుకు ఎలుకల నుండి ఫీజు వసూలు చేశాడో లేదో చెప్పలేముగానీ, ఆనాటి నుండి ఎలుకలు వకీలుగారి గ్రంథాలు, ఇతర కాగితాలు కొరికివేయడం మానివేసి ఉండవచ్చేమో!

ఇంతకంటే కూడా ఇంకా వింతయిన కేసు గుడ్డుపెట్టే కోడి, పుంజుకు సంబంధించింది! ఇది కూడా మధ్య యుగాల్లో జరిగిన అత్యంత విచిత్రమైన కేసు. స్విట్జరులాండ్‌లోని "బాల్" నగరంలో 1474లో ఈ కేసు నడిచింది. కోడిపుంజు గ్రుడ్డు పెట్టిన నేరం అది.

మాంత్రికులకు కోడిపుంజు గ్రుడ్డు అవసరమయి ఉంటుంది! ఆ గ్రుడ్డును వారు తమ నీచమైన లక్ష్యాలు సాధించడానికి చేతబడి పనుల్లో దాన్ని ప్రయోగించేవారు. అందువల్ల న్యాయమూర్తుల దృష్టిలో అది నేరం. కోడిపుంజు న్యాయస్థానానికి తీసుకు రాబడింది.

(కోడిపుంజు గుడ్డు ఎలా పెట్టగల్గిందని మీరు ఆశ్చర్యపడనక్కర్లేదు. ఎందుకంటే మన వద్ద దున్నపోతు గ్రుడ్డు పెట్టకల్గినప్పుడు సిట్జర్‌లాండ్‌లో కోడిపుంజు గ్రుడ్డు ఎందుకు పెట్టలేదు? మాంత్రికునికి కోడిపుంజు గ్రుడ్డు అవసరం అయి ఉండవచ్చు నేమో గాని, ఇసుకతో తైలం తీయలేము. కుందేటి కొమ్ము సాధించలేమన్నది పరమసత్యం, ఎవరో మహానుభావులు కోడిపుంజు గ్రుడ్డు పెట్టిందని చెప్పగానే గ్రుడ్డు పెట్టేటప్పుడు ఎవరైనా చూశారో లేదో గాని మొత్తానికి పాపం కోడి పుంజు మాత్రం మధ్యలో ఇరుక్కుపోయింది)

కోడిపుంజు తరపున న్యాయవాది ఇలా వాదించాడు, "ఈ విషయంలో కోడిపుంజు నిస్సహాయురాలు, నిర్దోషి, దానికి ఈ నీచకార్యం నుండి తప్పించుకోడానికి ఎలాంటి మార్గాలు లేవు. అయినా న్యాయస్థానం ఆ వాదాన్ని కొట్టిపారేసి కోడిపుంజుకు మరణశిక్ష విధించింది. ఈ శిక్ష ద్వారా ఇతర కోడి పుంజులకు గుణపాఠం కలగాలని కోర్టు తన తీర్పులో పేర్కొన్నది.

జంతువుల కేసుల్లో ఇంకో వింతయిన కేసు 1494లో ఫ్రాన్సులో ప్రారంభ మైంది. పాంజూలియా రాష్ట్రంలో ద్రాక్షపండ్లు పండించే రైతులు కీటకాలు, పురుగులకు వ్యతిరేకంగా ఒక కేసును బనాయించారు. అవి ద్రాక్ష పండ్లను తినేసి, దాని చెట్టుకొమ్మల్ని అధికంగా కొరికివేసి అపార నష్టాన్ని కలిగించాయని, అందువల్ల వారి పరిశ్రమకు వ్యాపారానికి ఎనలేని నష్టం వాటిల్లిందని ఆ కేసు సారాంశం.

ఈ కేసులో ఇద్దరు న్యాయశాస్త్ర నిపుణులు న్యాయవాదులుగా పని చేశారు. ఈ కేసు దాదాపు నలభై సంవత్సరాలు నడిచింది. ఇంతటి సుదీర్ఘ కాలం వల్ల కేసు పెట్టినవారు విసుగెత్తిపోయారు. అందువల్ల పురుగులకు, కీటకాలకు కొంత భూమిని కేటాయించాలని, అందులో అవి తమ ఇష్టమొచ్చిన చెట్లను, పంటను తినవచ్చని, వారు ఒక నిర్ణయానికి వచ్చారు.

## తుది మాట

మేము భూతదయ విషయంలో ఇస్లామీయ సంస్కృతి యొక్క దృక్పథానికి, ఇతర జాతుల సంస్కృతి యొక్క దృక్పథాలకు మధ్యనున్న వ్యత్యాసాన్ని ఇతర అంశాలను మీ ముందుంచాము. అందువల్ల ముస్లిం సమాజం ప్రాచీన, ఆధునిక జాతులతో పోల్చితే రెండు విషయాల్లో అత్యున్నత స్థానంలో ఉందని దీన్నిబట్టి తెలుస్తోంది. అవి ఇతర సంస్కృతుల్లో కానరావు.

మొట్టమొదటి విషయం ఏమంటే, సామూహిక సంస్థలు స్థాపించి ముస్లింలు జంతువుల బలహీనత, వృద్ధాప్యం, రోగాల సమయాల్లో వాటి రక్షణకు అన్ని సౌకర్యాలను ఏర్పాటు చేశారు.

రెండో విషయం ఏమంటే, ఇస్లామీయ సంస్కృతి 15 వందల సంవత్సరాలకు పూర్వమే జంతువుల్ని నేరాల పరిధి నుండి విముక్తం చేయగా ఇప్పుడిదే విషయాన్ని ఆధునిక సంస్కృతి లేవనెత్తింది. ఎంత విడ్డూరం!

ఇస్లామీయ సంస్కృతికి సంబంధించిన చరిత్రలో జంతువులు నేరాలు చేయడం, వాటికి శిక్షలు విధించడం అనే ప్రస్తావనే కానరాదు. అంతేకాకుండా జంతువుల్ని పరస్పరం పోట్లాడించడం కూడా అమానుష క్రీడలని ఇస్లాం నొక్కి చెబుతూ దాన్ని తీవ్రంగా గర్హించింది. కాగా, అటు గ్రీకుల్లోనూ, రోమనుల్లోనూ ఈ అమానుష క్రీడ చట్టరీత్యా సమ్మతం చేయబడింది.

స్పెయిన్‌లో ఈ క్రీడ ఈ నాటికీ చట్టరీత్యా సమ్మతమైనదిగా వినోద క్రీడగా కొనసాగుతోంది. స్పెయిన్‌లో ఇప్పటికీ పెద్ద పెద్ద ఉత్సవాలు జరిగే ప్రతి చోటా రెండు ఎద్దుల్నో, మేకలనో పరస్పరం పోట్లాడించడం జరుగుతోంది. ఇది పాశ్చాత్య జాతుల ప్రాచీన, మధ్య యుగాల అమానుషానికి నిదర్శనమనడంలో ఏమాత్రం సందేహం లేదు. ఇస్లామీయ సంస్కృతిలో ఈ చెడు కించిత్తయినా లేదు. ఇస్లామీయ సంస్కృతి సౌధం దయ, జాలి, కరుణ, కనికరం అనే పునాదులపై నిర్మించబడింది.

## ప్రజా సంక్షేమ సంస్థలు

ఏదైనా ఓ జాతిని సజీవమైన జాతి అనడానికి, ప్రగతి పథంలో అది నిరాఘాటంగా సాగిపోతుందనడానికి అతి పెద్ద ప్రమాణం ఏమంటే ఆ జాతి ప్రజల హృదయాలు మానవ సౌభ్రాతృత్వం వంటి మహోన్నత భావోద్రేకాలతో తొణికిసలాడు

తాయి. ఆ భావోద్రేకాలే ఆ జాతి ప్రపంచ ఆధిపత్యానికి అర్హమయిందనడానికి పటిష్ఠమైన నిదర్శనాలు కూడా. అలాంటి భావోద్రేకాలు, గుణగణాలు కేవలం సమాజం మీద మాత్రమే మంచి, శ్రేయస్సు, కనికరం, కారుణ్యాలను కురిపించవు. వాటివల్ల ఈ భూమిపై జీవించే సర్వప్రాణులు ప్రయోజనం పొందుతాయి. ఈ ప్రామాణికం మీదే జాతుల నాగరికతా జీవితం అమరమయి నిలిచిపోతాయి.

## ఆ మహోన్నత స్థానం ఎవరికి ప్రాప్తమయింది?

ఈ రంగంలో కూడా ఆ మహాదృష్టం ఇస్లామీయ సమాజాన్నే వరించింది. నిస్సంశయంగా పూర్వం ఏ జాతి కూడ అందుకోలేని మహోన్నతను ఇస్లామీయ సమాజం అందుకుంది. ఆ తర్వాత ఈనాటి వరకు ఏ జాతి కూడ ఆ ఔన్నత్యానికి చేరుకోలేకపోయింది.

పూర్వపు జాతుల్లో, సంస్కృతుల్లో మంచి పనులు పుణ్యకార్యాలనబడేవన్నీ ఆరాధనాలయాల్లో, విద్యా సంస్థల్లో పరిమితమయి ఉండేవి. ప్రస్తుతం పాశ్చాత్య జాతులు సాంఘిక సేవా సంస్థల ద్వారా సమాజ అవసరాల్ని పూర్తి చేసే విషయంలో ఎంతో పురోగమించాయి.

అయితే ముస్లిం సమాజం ప్రగతి పథంలో, ఉన్నత స్థానంలో ఉండి కేవలం దేవుని అభీష్టాన్ని పొందడం కోసం మానవతా సేవలో మహోన్నత శిఖరాలకు చేరుకున్నంతగా అవి చేరుకోలేకపోయాయని నిస్సందేహంగా చెప్పవచ్చు. అంతేకాదు, ముస్లిం సమాజ పతనావస్థ కాలంలోనూ మానవ సౌభ్రాతృత్వం విషయంలో అవి సాటిరాలేకపోయాయి. వాస్తవానికి పాశ్చాత్య జాతుల సేవానిరతి వెనుక ఎల్లప్పుడూ స్వలాభం, కీర్తి, ప్రచారం, పేరు ప్రఖ్యాతుల్ని పొందాలన్న అపేక్షలే ఉన్నాయి. వాటి మూలంగా ఆ జాతులు మానవ సంక్షేమంలో కొత్త కొత్త పుంతలు తొక్కాయి. కానీ ముస్లిం సమాజం ఏ మంచి కార్యం చేసినా దైవాభీష్టాన్ని చూరగొనడమే దాని లక్ష్యం. చేసిన సత్కార్యాలు ప్రజానీకానికి తెలిసినా తెలియకపోయినా సరే.

ఈ విషయంలో సలాహుద్దీన్ అయ్యూబి (రహ్మాలై) జీవితం గొప్ప ఆదర్శం, ఆయన తన ధన సంపత్తినంతా ప్రజా సంక్షేమ కార్యాలకే వినియోగించారు. ఇప్పటి ఈజిప్టు, సిరియా ప్రాంతాల్లో ప్రజా సంక్షేమ సంస్థలు, మస్జిద్‌లు, పాఠశాలలు, సత్రాలు మొదలయిన వాటితో నింపేశారు. కాని వాటిలో ఏ ఒక్క దానికి ఆయన

తన పేరు పెట్టుకోలేదు. అలాంటి సంస్థలకు ఆయన తన సైనికాధికారులు, మంత్రులు, సహాయకులు, మిత్రుల పేర్లు పెట్టేవారు. ఇది దైవాభీష్టానికి గల మహోన్నత ప్రామాణికం. ఇందులో ప్రదర్శనా బుద్ధికి ఏ కాస్త చోటూ లేదు.

## మరో అంశం

మరొక కోణంలోంచి చూడాల్సిన విషయం ఏమంటే, పాశ్చాత్య దేశాల్లో ఏర్పాటయ్యే సంస్థల ద్వారా కేవలం ఆ దేశవాసులో, ఆ ప్రాంతంలో నివసించే వారు మాత్రమే ప్రయోజనం పొందగలుగుతారు. కాని ఇస్లామీయ సమాజం స్థాపించిన సంస్థల ద్వారాలు ప్రతి ఒక్కరికీ తెరువబడి ఉండేవి. జాతి, భాష, మతం, ప్రాంతాల ప్రశ్నే ఉదయించేది కాదు. అంతేకాదు, ముస్లిం సమాజం స్థాపించిన ఆ సాంఘిక సేవా సంస్థలు శ్రేయస్సు, సామాజిక పోషణలో ఏ లక్ష్యాలు, ఆశయాలు సాధించడానికి నెలకొల్పబడ్డాయో, పాశ్చాత్య జాతులకు నేటి వరకు అంతుబట్టనే లేదు. ఆ కారణాల్ని వింటే ఈనాటి మానవుడు ఆశ్చర్యంలో నుండి తేరుకోలేడు. వాస్తవానికి వాటి వల్ల ముస్లిం సమాజంలో ఉన్న మానవ మైత్రి విశ్వజనీనంగా ఉందన్న విషయం తేటతెల్లమవుతుంది.

## సంక్షేమం, మౌలిక దృక్పథం

విభిన్న అంశాలను చర్చించడానికి ముందు ప్రజా సంక్షేమం విషయంలో ఇస్లామీయ సంస్కృతి యొక్క దృక్పథాన్ని, మౌలిక సూత్రాల్ని, వివరించడం అత్యంతావశ్యమని భావిస్తున్నాము. వాస్తవానికి ఆ సూత్రాలు, దృక్పథాలు, ఆలోచనలే ముస్లిం సమాజ వ్యక్తిత్వం మీద మహోజ్వల ప్రభావాల్ని వేయగలిగాయి. ఫలితంగా అనుపమానమైన సాంఘిక సంస్థలు ఆవిర్భవించాయి. మానవ చరిత్రలో ఇలాంటి ఆదర్శవంతమైన సంస్థలు మచ్చుకైనా కానరావు. మానవుని మనస్సులో లోభత్వం, సంకుచితత్వం, స్వార్థం, దారిద్ర్య భయం వంటి పైశాచిక సంశయాలు చొరబడలేని మంచి వైపునకు ఇస్లాం మానవాళిని పిలుస్తుంది. దైవమార్గంలో ఖర్చు చేయడమంటే ఏమిటో నొక్కి వక్కాణించిన తర్వాత దివ్య ఖుర్ఆన్ ఇలా విశదీకరిస్తోంది :

**"దారిద్ర్య ప్రమాదం చూపి షైతాను మిమ్మల్ని భయపెడతాడు. నీతిబాహ్యమైన, నీచమైన మార్గం అవలంబించండి అని ప్రేరేపిస్తాడు. కాని మిమ్మల్ని**

**క్షమిస్తానని, అనుగ్రహిస్తానని అల్లాహ్ వాగ్దానం చేస్తున్నాడు. అల్లాహ్ అత్యంత ఉదార స్వభావుడు, అన్నీ తెలిసినవాడు."** ***(అల్ బఖర : 268)***

ఇస్లాం, శక్తి సంపద కల్గి ఉన్న ప్రతీ వ్యక్తిని, అవి లేని ప్రతీ మనిషిని మంచి వైపునకు ఆహ్వానిస్తోంది. ధనవంతుడు తన సంపద, హోదా ద్వారా సత్కార్యం చేస్తాడు. పేదవాడయితే తన చేతులతో, హృదయంతో, నోటితో నిర్వర్తిస్తాడు. ఏ మార్గం ద్వారానయినా సరే సత్కార్యం చేయనివాడు ఇస్లాంలో కనిపించడు.

మహాప్రవక్త ప్రవక్త (సఅసం) సన్నిధికి ఓసారి కొందరు నిరుపేదలు వచ్చి, ధనవంతులు సత్కార్యాల్లో తమ కంటే ముందున్నారని, వారు ధనసంపత్తిని ప్రజా సంక్షేమం కోసం ఖర్చు పెడుతున్నారని, అయితే తమ వద్ద దాన ధర్మాలు చేయడానికి ఏమీ లేదని, ఫిర్యాదు చేశారు. అందుకు మహాప్రవక్త (సఅసం) వారితో, "సత్కార్యాలు చేయడానికి ధనమొక్కటే మార్గం కాదు, ప్రజలకు ప్రయోజనకారి అయిన ప్రతి పని కూడా సత్కార్యమే" అని చెప్పారు.

మరొక సందర్భంలో దైవప్రవక్త (సఅసం) ఇలా అన్నారు : "మీరు ఒకసారి దేవుణ్ణి స్తుతిస్తే అది కూడా సద్ఖా (దానం)యే. మంచి పనిని గురించి ఆజ్ఞాపించడం, చెడును నిరోధించడం కూడా సద్ఖాయే. దారిలో ముల్లుగాని, బాధ కలిగించే ఇతర వస్తువుల్నిగాని తొలగించడం కూడ సదఖాయే. ఇద్దరి మధ్య ఉన్న విభేదాల్ని పరిష్కరించడం, సుఖంగా వాహనంపై ఎక్కేందుకు ఒక వ్యక్తికి సహాయపడడం కూడ సదఖాయే." (బుఖారి, ముస్లిం) ఇలా ఇస్లాం సత్కార్యాలకున్న ద్వారాలన్నింటినీ తెరచి ఉంచి ప్రజలందరిని ఆహ్వానిస్తోంది.

సామాన్య కార్మికుడు, వ్యాపారి, జమీందారు, గురువు, శిష్యుడు, స్త్రీ సేవకుడు, వృద్ధుడు, అంధుడు, బలహీనుడు మొదలైన ప్రతీ ఒక్కరూ సత్కార్యం చేయడానికి అర్హులే. వ్యక్తుల ఆర్థిక స్థితిగతులు ప్రజాసేవ, చేయడంలో అడ్డురావు. అంతేకాదు, సత్కార్యాల శుభాలను వెదజల్లే విశ్వమానవ సౌభ్రాతృత్వం స్థానానికి కూడా ఇస్లాం మానవ మనోమస్తిష్కాలను చేర్చగలుగుతుంది. ఈ విషయంలో వారి మతం, భాష, దేశం, జాతీయత ఏదైనాసరే ఇస్లాం పరిగణనలోకి తీసుకోదు. అసలు ఇస్లాం ఆవిర్భవించింది అజ్ఞానమైన ఈ నీచ విభేదాన్ని రూపుమాపడానికే.

"ప్రజలందరూ దేవుని కుటుంబం. అందువల్ల ఎవరయితే ఆయన కుటుంబానికి వీలైనంత ఎక్కువగా ప్రయోజనం చేకూర్చే పనులు చేస్తారో వారే దేవునికి ప్రీతిపాత్రులు" అని మహాప్రవక్త (సఅసం) స్పష్టంగా ప్రవచించారు.

ఇస్లాం మానవ హృదయాన్ని మంచి వైపునకు ఆకర్షిస్తూ ఇలా సంబోధిస్తుంది. సత్కార్యం చేయడంలో మానవుని స్వలాభమే ఉంది. ఒక మనిషి ఏదైనా మంచి పని చేస్తే దాని ప్రయోజనం మొట్టమొదట అతనికే ప్రాప్తిస్తుంది. దానిద్వారా అతను ప్రపంచంలో ఇతరుల ప్రేమాభిమానాలు పొందుతాడు. ప్రజల ప్రశంసల్ని అందుకుంటాడు. జనం ఎల్లప్పుడూ అతణ్ణి స్మరించుకుంటూ ఉంటారు. మరణానంతరం అంతిమదినాన అతనికి పుణ్యఫలం ప్రాప్తిస్తుంది.

"మీరు ఏ ఖర్చుచేసినా అది మీ స్వంతం కోసమే"

"ఎవరు సత్కార్యం చేస్తారో వారు తమ కోసమే చేస్తారు."

## ఫలితాలు, ప్రభావాలు

మానవునిలో వ్యక్తిత్వపు భావోద్రేకం ఉన్నంత వరకు అతను స్వయంగా తన శ్రేయస్సును అభిలషిస్తాడు. ఇస్లాంలో ఈ ఆలోచనా వైఖరి మానవ హృదయం మీద ప్రత్యేక ప్రభావం వేసింది. లోభి ఉదారుడయ్యాడు. అతను ప్రజాసేవ తపనలో తన ధన సంపత్తినంతా ఖర్చు పెట్టసాగాడు. అతనికి సంతానం, బంధువుల ఆలోచనే లేకపోయింది.

**"అల్లాహ్‌కు మంచి రుణం ఇచ్చేవారు మీలో ఎవరైనా ఉన్నారా? దానిని ఆయన ఎన్నో రెట్లు అధికం చేసి తిరిగి ఇస్తాడు."** ***(అల్ బఖర : 245)***

ఈ ఆయత్ అవతరించాక "అబూదర్దా" అనే సహాబీ, "ఓ దైవప్రవక్తా! అల్లాహ్ కూడా తన దాసులను రుణం అడుగుతాడా?" అని అడిగారు. "అవును"ని సమాధానమిచ్చారు దైవప్రవక్త (సఅసం). అప్పుడా సహాబీ "అయితే మీ చేతిని చాపి సాక్ష్యమివ్వండి. నేను నా తోటను దైవమార్గంలో దానం చేస్తున్నాను. అందులో నేను తప్ప ఇంకెవ్వరూ భాగస్తులు లేరు" అని పలికారు.

ఆ తోటలో చక్కని ఫలాలనిచ్చే 700 ఖర్జూరపు వృక్షాలున్నాయన్న విషయం ఇక్కడ గమనార్హం. తరువాత ఆ సహాబి తోటలోనే ఉన్న తన ఇంటికి వచ్చి తన భార్యకు తన నిర్ణయాన్ని వినిపించారు. విన్న వెంటనే ఆయన భార్యా పిల్లలు ఆ

తోటను ఖాళీ చేశారు. ఆ దైవదాసురాలు తోట వెలుపలికి వచ్చేదాకా అబూదర్దా! మీరు చేసిన ఈ వ్యాపారం ఎంతో లాభసాటిద"ని అంటూ పోయింది.

## ఇస్లాంలో ప్రప్రథమ వక్ఫ్ ఆస్తి

**"మీరు అమితంగా ప్రేమించే వస్తువుల్ని (అల్లాహ్ మార్గంలో) ఖర్చు పెట్టనంతవరకు మీరు సత్కార్య స్థాయికి చేరుకోలేరు."** ***(ఆలి ఇమ్రాన్ : 92)***

ఈ ఆయత్ అవతరించిన తరువాత అబూ తల్హా అన్సారీ (రజి) ఇలా అన్నారు: "హుజూర్! నాకున్న యావదాస్తిలో 'బైరహ్' నాకు అత్యంత ప్రియమైనది. (ఇది ఎంతో మధురమైన నీరు గల బావి. అది ఆయన దట్టమైన తోటలో ఉండేది. దాని పేరు మీదే ఆ తోట ప్రఖ్యాతిగాంచింది). దాన్ని నేను అల్లాహ్ మార్గంలో దానం చేస్తున్నాను. దాన్ని మీ ఇష్టమొచ్చిన రీతిలో ఉపయోగించుకోండి."

అందుకు మహాప్రవక్త (సఅసం) "వద్దు, వద్దు, అది ఎంతో లాభసాటి ఆస్తి. ఆ తోటను నీ పర్యవేక్షణలో, నీ అధీనంలోనే ఉంచు. దాని ఉత్పత్తి మాత్రం దానం చెయ్యి" అని అన్నారు.

ఈ దానం ఇస్లాంలో ప్రప్రథమంగా వక్ఫ్ ఆస్తి అయింది. తర్వాత ఈ వక్ఫ్ ఆస్తుల ద్వారా సామూహిక సంస్థలు ధనరూపేణా సహాయం పొంది తమ ఆశయాలు, లక్ష్యాలను ఎంతో బాగా నెరవేర్చుకున్నాయి. ఇస్లామీయ సంస్కృతి చరిత్రలో ఈ వక్ఫ్ ఓ మైలురాయి పాత్రను నిర్వహించింది. దాని ద్వారా సామూహిక, ప్రజాసంక్షేమ సంస్థలు నెలకొల్పబడ్డాయి.

## అపార వక్ఫ్ ఆస్తులు

ఈ విషయంలో మహాప్రవక్త (సఅసం) ఇస్లామీయ సమాజంలో అనన్యమైన ఆదర్శాన్ని నెలకొల్పినారు. ఆయన (సఅసం)కు అంకితం చేయబడిన తోటల విషయంలో ఓ సైనికుడు తన వీలునామాలో అన్నాడు, "ఆ తోటల్ని ప్రవక్త (సఅసం) తన ఇష్టమొచ్చినట్లు ఉపయోగించుకోవచ్చు. దైవప్రవక్త (సఅసం) ఆ తోటల్ని పేదలు, అనాథలు, అగత్యపరుల కోసం అంకితం చేసివేశారు."

తరువాత ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) తనకు చెందిన ఖైబర్ భూమిని వక్ఫ్ చేశారు. హజ్రత్ అబూబక్ర్ (రజి), హజ్రత్ ఉస్మాన్ (రజి), హజ్రత్ అలి (రజి),

హజ్రత్ జుబైర్ (రజి), హజ్రత్ ముఆజ్ (రజి) మరికొందరు సహాబీలు తమకున్న ఆస్తుల్ని వఖ్ఫ్ చేసివేశారు. అలా దాదాపు సహాబీలందరూ ఎంతో కొంత ఆస్తిని దైవమార్గంలో వఖ్ఫ్ చేశారు. ఈ కార్యం హజ్రత్ ఉమర్ (రజి) ఖిలాఫత్ పాలనా కాలంలో క్రొత్తగా మళ్ళీ ప్రారంభించబడింది. ఆయన తన భూమిని దైవమార్గంలో దానం చేస్తున్న సందర్భంలో కొందరు ముహాజిర్లను, అన్సారీలను సాక్షులుగా ఉంచారు.

హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లాహ్ అన్సారీ (రజి) అంటారు: "మహాప్రవక్త (సఅసం) సహాబీలలో నాకు తెలిసిన ప్రతి ఒక్కరూ తన ఆస్తిలో ఏదో ఒక వస్తువును తప్పకుండా దైవమార్గంలో దానం చేసినవారే. అలాంటి దాన్ని కొనడానిగ్గాని, మరెవరికైనా ఉచితంగా ఇవ్వడానిగ్గాని లేదా, వారసత్వంలో వారసులకు ఇవ్వడానిగ్గాని వీలు లేదు. ఆ తర్వాత ముస్లింలు తరతరాలుగా ఈ వఖ్ఫ్ పరంపరను కొనసాగించారు. దానాలు చేయబడిన తోటలు ఇళ్ళు, ధాన్యోత్పుత్తులను ఇస్లామీయ సమాజానికి అవసరమైన ప్రజా సంక్షేమ కోసం ఖర్చు చేయబడేవి. ఇలా అసంఖ్యాకమైన ఎన్నో సంస్థలు స్థాపించబడ్డాయి.

## రెండు రకాల వఖ్ఫ్ ఆస్తులు

ఆదాయం కోసం ప్రభుత్వం పెద్ద ఎత్తున వక్ఫ్ ఆస్తులను ఏర్పాటు చేసేది. ఈ సంస్థలు రెండు రకాలుగా ఉండేవి. కొన్నింటిని ప్రభుత్వమే ఏర్పాటు చేస్తే, మరికొన్నింటిని అమీర్లు, సైన్యాధిపతులు, ఉమ్మత్‌లోని ఇతర సంపన్నులు ఏర్పాటు చేసేవారు.

## కొన్ని సంక్షేమ సంస్థలు

ఇక్కడ కొన్ని ముఖ్యమైన సంస్థలను ప్రస్తావిస్తున్నాము.

(1) ప్రజా సంక్షేమ సంస్థల్లో మొట్టమొదటిది మస్జిద్, అందువల్ల దైవప్రసన్నతను పొందటానికి, ప్రజలు మస్జిద్‌లలో ఉండేందుకు పోటీ పడుతుండేవారు. సుల్తానులు కూడా మస్జిద్‌ల వైశాల్యాన్ని పెంచడానికి, వాటి గౌరవోన్నతులను కాపాడటానికి పరస్పరం పోటీ పడుతుండేవారు. వలీద్ బిన్ అబ్దుల్ మలిక్ డెమస్కస్ మస్జిద్ "జామె ఉమ్‌లి" కోసం ఎంత ధనాన్ని ఖర్చుపెట్టాడో, దాని నిర్మాణం కోసం ఎందరు

శ్రామికులు కష్టపడ్డారో చెప్పడం కష్టం.

(2) ప్రజా సంక్షేమ సంస్థల్లో రెండవది పాఠశాలలు, వైద్యశాలలు, వాటిని గురించి దైవం తలిస్తే అవకాశాన్ని బట్టి చర్చిస్తాము.

(3) ప్రయాణీకులలో తప్పిపోయిన వారికోసం సత్రాలు, భోజనశాలలు నిర్మించబడేవి.

(4) జనావాసాలకు దూరంగా ఉండి ప్రశాంతంగా దైవారాధనలో గడిపేవారి కోసం ప్రత్యేక మఠాలు నిర్మించబడేవి.

(5) ఇళ్ళు కట్టుకోలేని, ఇళ్ళ అద్దెలు చెల్లించలేని పేదలు, అనాథల కోసం ఇళ్ళు నిర్మించబడేవి.

(6) దారులలో ప్రజల దప్పిక తీర్చడానికి చలివేంద్రములు కట్టించబడేవి.

(7) నిరుద్యోగుల కోసం భోజనశాలలు ఉండేవి. వాటిలో రొట్టె, మాంసం, హల్వా తదితర పదార్థాలు సరఫరా చేయబడేవి. డెమాస్కస్‌లో తక్య సుల్తాన్ సలీం, తక్య షేఖ్ మొహియుద్దీన్ కట్టించిన భోజనశాల కట్టడాలు ఈనాటికీ నిలిచి ఉన్నాయి.

(8) మక్కాలో హజ్ యాత్రికులు విడిది చేసేందుకు ఇళ్ళు కట్టించబడ్డాయి. ఆ ఇళ్ళు మక్కా నగరమంతా వ్యాపించి పోయాయి. ఆ కారణం వల్ల కొందరు ధర్మవేత్తలు ఆ ఇళ్ళను అద్దెకు ఇవ్వడం సమంజసం కాదని ఫత్వా ఇచ్చారు.

(9) పశువులు, ప్రయాణీకుల మంచి నీటికోసం, సేద్యం కోసం కొండ ప్రాంతాల్లో బావులు త్రవ్వబడేవి. ఈ బావులు బాగ్దాద్, మక్కాల మధ్య ఉండేవి). ఇంకా డెమాస్కస్, మదీనాల మధ్య కూడా అనేక బావులు ఉండేవి. ఇంకా రాజధానుల్లో, ప్రధాన నగరాల్లో, దర్గాల మధ్య కూడా అసంఖ్యాకంగా ఉండేవి. ఆ రోజుల్లో ఏ ప్రయాణీకుడూ తన ప్రయాణ సమయంలో మంచినీళ్ళకు నోచుకోలేదన్న ప్రశ్నే ఉదయించేది కాదు.

(10) సరిహద్దు ప్రాంతాల్లో రక్షణ దళాల కోసం చౌకీలు నిర్మించబడేవి. దానివల్ల శత్రువు సరిహద్దులోని జనావాసాల మీద దాడి జరిపేందుకు వీలుండేది కాదు. అలాంటి విధుల్ని నిర్వహించేందుకు సరిహద్దు రక్షణ దళాల కోసం ప్రత్యేకంగా ఎన్నో సంస్థలుండేవి. ఆ సంస్థలో సరిహద్దు రక్షకులు అన్ని సౌకర్యాలు సులభంగా

పొందగలిగే వారు. ఉదాహరణకు భోజనం, వస్త్రాలు, ఆయుధ సామగ్రి మొదలైనవి. అలాంటి సంస్థలు ఏర్పడ్డం వల్ల క్రైస్తవుల కాలంలో సరిహద్దుల మీద జరిగే రోమన్ దాడులు ఇంకా సిరియా, ఈజిప్టుల మీద పాశ్చాత్య దేశాల శిలువ యుద్ధాలు కూడా అరికట్టబడ్డాయి.

(11) ఇక గుర్రాలు, ఖడ్గాలు, బల్యాలు, ఇతర యుద్ధ సామగ్రిని సరఫరా చేసే వ్యాపార సంస్థల ప్రస్తావన వస్తుంది. వాటివల్ల ఇస్లామీయ దేశాల్లో ఆయుధ పరిశ్రమ ఎంతో అభివృద్ధి చెందింది. నగరాల్లో పెద్ద పెద్ద కర్మాగారాలు స్థాపితమయ్యాయి. శిలువ యుద్ధాల ప్రజలు ఒప్పందాలు చేసుకున్న రోజుల్లో ఇస్లామీయ దేశాల్లో వ్యాపించిపోయిన వారందరూ ఇక్కడ ఆయుధాలు కొనుగోలు చేసేవారు. వర్థమాన కాలంలో పరిస్థితులు ఎలా మలుపు తిరిగాయంటే పాశ్చాత్య దేశాల్ని ఆయుధాలు దానం చేయమని మనమిప్పుడు అభ్యర్థిస్తున్నాము. వారు మన ఆత్మాభిమానాన్ని హరించివేసే షరతులు విధించి మరీ ఆయుధాలు సరఫరా చేస్తున్నారు.

(12) ఇంకొన్ని వక్ఫ్ సంస్థలపై వచ్చే ఆదాయం దైవమార్గంలో పోరాడే వీరులకు, సైన్యంలోనే ఉండి నిరంతరం యుద్ధరంగంలో ముందుండే వ్యక్తుల కోసం ప్రత్యేకించబడేది. అందువల్ల దైవమార్గంలో పోరాడే బాధ్యతను నిర్వహించాలని నిశ్చయించుకున్న ఏ వ్యక్తి అయినా సమరానికి సన్నద్ధుడయ్యేవాడు. అతనికి కావాల్సిన సౌకర్యాలన్నీ దీనిద్వారా లభించేవి. అలా అతడు ఇహలోక ప్రయోజనాలకు అతీతంగా భూమ్యాకాశాల కంటే మహోన్నతమైన సువిశాల స్వర్గానికి హక్కుదారుడయిపోయే వాడు.

కాని ఈనాడు ముస్లింల స్థితి ఎంతగా దిగజారి పోయిందంటే వారు ఆయుధ వారోత్సవాలు జరుపుకుంటున్నారు. సైన్యానికి ఆయుధాలు అందజేయడానికి చందాలు పోగుచేస్తున్నారు. ఒకవేళ వారికి సామూహిక భావన, దూరదృష్టి, నికార్సయిన విశ్వాసం ఉన్నట్లయితే ప్రతిరోజూ వారు ఎంతో కొంత దానంగా ఇస్తే అతి సులభంగా సైన్యానికి ఆయుధాలు సమకూరుతాయి. అలా ముస్లిం సైన్యం దేశాన్ని కాపాడ్డం కోసం పెద్ద పెద్ద కర్మాగారాలు నిర్మించవచ్చు.

(13) ఇంకొన్ని సంస్థల ఆదాయాన్ని మార్గాలు, వంతెనలు, రహదారుల పరిరక్షణకు, వాటి నిర్మాణం, మరమ్మత్తుల కోసం ఉపయోగించేవారు.

(14) మరికొన్ని సంస్థల రాబడిని సమాధుల కోసం ప్రత్యేకించబడేది. ప్రజలు తమ విశాలమైన భూముల్ని స్మశానాల కోసం దానం చేసేవారు.

(15) నిరుపేదలు, అనాథల శవాల ఖననం చేయడానికి ఖర్చులు భరించే సంస్థలు కూడా ఆనాడు ఉండేవి.

(16) స్వయం సమృద్ధి సంస్థలు అసంఖ్యాకంగా ఉండనే ఉన్నాయి. అయినా దిక్కులేని పిల్లలు, అనాథల అవసరాలు తీర్చి, సంరక్షించేందుకు కూడ ప్రత్యేక వక్ఫ్ సంస్థలు ఉండేవి.

(17) బలహీనులు, అంధులు, నిస్సహాయుల పోషణ కోసం కొన్ని సంస్థలు ఉండేవి. వాటిలో భోజనం, వస్త్రాలు, విశ్రాంతి సౌకర్యాలు ఉండేవి. అక్కడ వారు ఎంతో గౌరవంగా జీవితం గడిపేవారు.

(18) ఖైదీల పరిస్థితి మెరుగుపరచి వారి జీవన స్థాయిని పెంచడానికి, ఆహారం సమకూర్చి వారి ఆరోగ్యం కాపాడటానికి మరికొన్ని సంస్థలు స్థాపించబడేవి.

(19) అంధులు, అంగవిహీనులకు సహాయం చేసే సంస్థలు ఇంకొన్ని.

(20) యువతీ, యువకులకు వివాహాలు చేయలేని తల్లిదండ్రులకు పెళ్ళి ఖర్చులు, మహర్ డబ్బు ఇచ్చి సహాయపడే సంస్థలు.

(21) పసిపాపలున్న తల్లులకు సహాయమందించే సంస్థలు. ఇవి తల్లులకు పాలు, పంచదార సరఫరా చేసేవి. నేడు మనవద్ద "మఖ్తతుల్ హలీబ్" అనే పేరుతో స్థాపించబడిన సంస్థలు పూర్వం ఎప్పుడో ఏర్పాటు చేయబడ్డవే. వాటి స్థాపన లక్ష్యం కేవలం దైవ ప్రసన్నతను పొందడమే. సుల్తాన్ సలాహుద్దీన్ అయ్యూబీ తన కోట ద్వారం వద్ద రెండు చెలమలను నిర్మించారు. ఒక దానిలో పాలు, రెండోదానిలో మంచి నీరు ప్రవహించేవి. పసిపాపలు గల తల్లులు వారానికి రెండుసార్లు ఇక్కడికి వచ్చి తమకు అవసరమున్నన్ని పాలు, పంచదార పట్టుకెళ్ళేవారు. ఆయన చేసిన ఉత్తమ కార్యాల్లో ఇదొకటి, ఇప్పటికీ ఇవి డెమాస్కస్‌లో ఉన్నాయి.

(22) మీరు ఇది విని ఆశ్చర్యపడతారు. కొన్ని సంస్థలు కేవలం మట్టి పాత్రలు తయారు చేయడానికి స్థాపించబడ్డాయి. ఎందుకంటే పిల్లలు, బానిసలు మట్టిపాత్రలు

పట్టుకొని ఇంటికి వెళుతున్నప్పుడు పొరపాటున దార్లో పగిలిపోతే వారు ఈ సంస్థల వద్దకు వచ్చి పగిలిపోయిన పాత్రలకు బదులు క్రొత్త పాత్రలు తీసుకొని పోయేవారు. వారు పొరపాటు చేసినట్లుగా ఇంటివారికి అసలు తెలిసేదే కాదు.

(23) పశసంవర్థక సంస్థలు. జబ్బుపడ్డ జంతువులకు చికిత్స చేసి వాటికి మేత సమకూర్చడానికి. అవి బలహీనంగా ఉన్నప్పుడు మేయడానికి ఈ సంస్థలు ఏర్పాటు చేయబడేవి. నేడు మున్సిపాలిటీ క్రీడా మైదానంగా ఉన్న "మర్జుల్ అఖ్జర్" అనేది అలాంటి వక్ఫ్ సంస్థల్లో ఒకటి. ఇక్కడ గుర్రాలు, ముసలి జంతువులు చనిపోయే వరకు సురక్షితంగా ఉండేవి.

వాస్తవం ఏమంటే ఇస్లామీయ సంస్కృతి ద్వారా ఏర్పడ్డ సంస్థల్లో దాదాపు 30 రకాలు ఉండేవి. ఇక్కడ కేవలం కొన్నింటిని మాత్రమే ప్రస్తావించాము. ఇలాంటి ఆదర్శ సంస్థలు గత జాతులను ఏ సంస్కృతిలోనూ దర్శించలేము. చివరికి తాము నిర్వహిస్తున్న సంక్షేమ కార్యాల్ని గురించి ఢంకా బజాయించి ప్రచారం చేసుకుంటున్న పాశ్చాత్య సంస్కృతిలో కూడా ఇలాంటి ఉదాహరణలు కానరావు.

ఇలాంటి ఉదాత్త జీవనమార్గంలో ఇస్లామీయ సమాజమే ఒంటరిగా పయనించిందనడానికి దేవుడే సాక్షి. ప్రమత్తతలో, అజ్ఞానంలో, పతనావస్థల్లో, గాఢాంధకారంలో పడి కొట్టుమిట్టాడుతున్న ప్రపంచ జాతులకు శాశ్వతమైన ఈ జీవన మార్గాన ఒంటరిగా పయనించి చూపింది ఒక్క ఇస్లామీయ సమాజం మాత్రమే. అందుకు దేవుడే సాక్షి!

ఒకప్పుడు అద్వితీయమైన ఆ మార్గాన పయనించి భయంకర నరకయాతన అనుభవిస్తున్న మానవతను విముక్తం చేసింది ఇస్లామీయ సంస్కృతి. కాని విచారకరమైన విషయమేమంటే నేటి ముస్లింలు ఎటు పయనిస్తున్నారో కూడా వారికి స్పృహ లేదు, అనాథల అశ్రువుల్ని తుడిచి, గాయపడిన హృదయాల్ని ఓదార్చి చికిత్స చేసిన ఆ చేతులు నేడు ఏమయి పోయాయి? ఏ సమాజంలో సకల మానవులు శాంతీ శ్రేయస్సుతో, గౌరవ ప్రతిష్ఠలతో సురక్షితంగా మనుగడ సాగించారో ఆ మహోత్కృష్ట సమాజాన్ని నిర్మించిన ఆ పవిత్ర హస్తాలు ఎటు మాయమైపోయాయో అనూహ్యంగా ఉంది.

# విద్యా సంస్థలు

మేము ఇంతకు ముందు ఇస్లామీయ సంస్కృతిలోని సంక్షేమ సంస్థలు, వాటి వివిధ రకాలను ప్రస్తావిస్తూ, ఇస్లామీయ సమాజంలోని మానవ మైత్రి, ఈ విషయంలో సమాజాత్మను ఎంతగా ప్రభావితం చేసిందో విశదీకరించాము. ఆ సందర్భంలో క్రొత్త పాఠశాలలు, ఆస్పత్రులు గురించి సుదీర్ఘంగా చర్చిస్తామని చెప్పడం జరిగింది. అందువల్ల ఇక్కడ మొట్టమొదట పాఠశాలల గురించి చర్చిస్తున్నాము.

## ఇస్లామీయ పాఠశాలలు

పెద్ద పెద్ద ఆస్తులపై వచ్చే ఆదాయంతో ఇస్లామీయ పాఠశాలలు స్థాపించబడ్డాయి. ఈ వక్ఫ్ సంస్థలు విభిన్న కాలాల్లో వివిధ అమీర్లు, నాయకులు, ధర్మవేత్తలు, వ్యాపారులు చక్రవర్తుల తరఫున ఇస్లామీయ రాజ్య పరిధుల్లో ఏ ప్రదేశంలో లేదా గ్రామంలో ఇలాంటి పాఠశాల లేదు అనడానికి వీలులేనంతగా పాఠశాలలు వ్యాపించిపోయాయి. వాటిలో ఎంతోమంది అధ్యాపకులు బోధనా విధుల్లో నిమగ్నులై ఉండేవారు.

ఇస్లామీయ నాగరికతలో పాఠశాల ప్రథమంగా మస్జిద్ నుండి ప్రారంభ మవుతుంది. ఆ రోజుల్లో మస్జిద్ కేవలం ఆరాధనా మందిరంగా ఉండేది కాదు. మస్జిద్ ప్రాంగణంలో ముస్లింల పిల్లలు ఖిర్అత్, ఖుర్ఆన్ లేఖన శాస్త్రాలు, ఫికహ్, షరీఅత్, నిఘంటువు, సాహిత్యం ఇంకా ఇతర శాస్త్రాలు కూడా అభ్యసిస్తూ ఉండేవారు.

## బోధనశాలలు

ఆ తరువాత క్రమంగా మస్జిద్‌లకు అనుబంధంగా ఉండే పాఠశాలలు నెలకొల్పబడ్డాయి. ఖుర్ఆన్ లేఖనం, పఠన విద్యలే కాకుండ అరబీ సారస్వతం, గణితం కూడా బోధించబడేవి. ఈ పాఠశాలలు ఇప్పటి ప్రాథమిక పాఠశాలల్ని పోలి ఉండేవి. ఇబ్నె హౌకల్ అంచనా ప్రకారం ఇలాంటివి కేవలం ఒక్క "వఖ్లియా" వంటి ఓ మామూలు పట్టణంలోనే దాదాపు 6 వందల పాఠశాలలు ఉండేవి. అవి ఎంత విశాలంగా ఉండేవంటే కొన్ని సమయాల్లో ఒక్కో పాఠశాలలో వేలమంది విద్యార్థులు విద్యనభ్యసించేవారు. "అబుల్ ఖాసిం బల్కీ" రచించిన చరిత్రలో ఆయన

స్వయంగా నెలకొల్పబడిన పాఠశాలను గురించి ప్రస్తావిస్తూ, 3 వేలమంది విద్యార్థులు ఉండేవారని, ఆ పాఠశాల ఎంత విశాలంగా ఉండేదంటే విద్యార్థుల పరిస్థితుల్ని గమనించడానికి, వారి అవసరాలు తెలుసుకోవడానికి వాహనం ఉపయోగించాల్సి వచ్చేదని వ్రాశారు.

ఆ తరువాత ప్రాథమిక పాఠశాలలతో పాటు ఈనాటి మాధ్యమిక, ఉన్నత పాఠశాలల్ని పోలిన పాఠశాలలు కూడా ఏర్పడ్డాయి. వాటిలో ఉచితంగా విద్య బోధించబడేది. అన్ని వర్గాల వారికి వాటిలో ప్రవేశముండేది. ఈనాడు మన మాధ్యమిక, ఉన్నత పాఠశాలల్లో వలె ఫీజు చెల్లించబడేది కాదు. వాటిలో ఓ ప్రత్యేక వర్గానికి ప్రత్యేకించబడకుండా అందరికీ విద్య అభ్యసించే అవకాశముండేది. ఎవరయినాసరే ఎలాంటి ఆంక్షలు, షరతులు లేకుండా ప్రవేశం పొందవచ్చు.

ఆ పాఠశాలల్లో ధనికులు, పేదలు అన్న భేదముండేది కాదు. వారు ఒకరి ప్రక్క ఒకరు భుజం భుజం కలిపి కూర్చుండేవారు. అధికారి, వ్యాపారి, రైతు, పారిశ్రామికుని పిల్లలు ఒకే వరుసలో కూర్చుండేవారు. అక్కడ రెండు రకాల విద్య ఉండేది. స్వదేశీ విద్య, విదేశీ విద్య. స్వదేశీ విద్యనభ్యసించే విద్యార్థులు సాధారణంగా పేదవారే. వారి తల్లిదండ్రులు, ఇతర పోషకులు ఆర్థిక పరిస్థితి వారి జీవిత అవసరాల్ని తీర్చేది కాదు. రెండవ రకం విదేశీ విద్య నభ్యసించే విద్యార్థులు, వారు పగలంతా విద్యనభ్యసించి రాత్రులు వారి ఇళ్ళకు లేక వారి బంధువుల ఇళ్ళకు వెళ్ళిపోయేవారు. విద్య మాత్రం అందరికీ ఉచితంగా బోధించబడేది. కాని స్వదేశీ విద్యార్థులకు అన్ని సౌకర్యాలు ఉచితంగా సమకూర్చబడేవి. వారికి భోజనం, విశ్రాంతి, ఆరాధనలకు కావలసిన అన్ని సౌకర్యాలు ఏర్పాటు చేసేవారు. ఆ కారణం వల్లే ప్రతీ మస్జిద్‌లో పాఠశాలతో పాటు విశ్రాంతి గదులు, గ్రంథాలయాలు, వంట గదులు, స్నానాల గదులు తప్పనిసరిగా ఉండేవి. కొన్ని పాఠశాలలు విశాలమైన మైదానంలో ఉండేవి. క్రీడా మైదానంలో విద్యార్థులు వ్యాయామం చేసేవారు. ఈనాడు కూడా కొన్ని ప్రాంతాల్లో అలాంటి ఆదర్శ పాఠశాలలు ముస్లిం ప్రపంచంలో వ్యాపించి ఉన్నాయి.

## ఆదర్శ విద్యాసంస్థ

ఈనాడు కూడా డెమస్కస్‌లో మారియా పాఠశాల ఉంది. దాని ఇమామ్ నూరుద్దీన్ వహీద్ (రహ్మలై) స్థాపించారు. నేడు కూడా అది "సౌఖుల్ ఖయాతీన్"లో పూర్వ వైభవాన్ని చాటుతూ ఠీవిగా నిలబడి ఉంది. ఇస్లామీయ సంస్కృతి ప్రగతి

పథాన ఉన్న కాలంలో మహోజ్వలంగా వెలిగిన పాఠశాలలు సాధారణ రూపురేఖలు మరువరానివి. ప్రఖ్యాత పర్యాటకుడు "ఇబ్నె హబీబ్" హిజ్రీ శకం 7వ శతాబ్ది ప్రారంభంలో ఆ పాఠశాలను సందర్శించి మహాశ్చర్యంలో దీన్ని గూర్చి ఇలా వ్రాశారు:

"నూరుద్దీన్ (రహ్మాలై) పాఠశాల ప్రపంచంలోని అత్యంత అందమైన పాఠశాలల్లో ఒకటిగా పరిగణించబడుతుంది. దాన్ని పాఠశాల అనడం కంటే ఒక సుందర సౌధం అనడం సబబు. నీరు కోసం ఓ సెలయేరుని అందులోకి తేబడింది. దాని మధ్య "ఫౌంటెన్" ఏర్పాటు చేయబడింది. అందులో నుండి విరజిమ్మబడే నీరు రెండు శాఖలుగా చీలిపోయి వాటి ద్వారా ఆ భవనం మధ్య కోనేటి (హౌజు)లో పడుతుంది. ఆ సుందర దృశ్యాన్ని చూసి కళ్ళు అనిర్వచనీయమైన ఆశ్చర్యాన్ని చెందుతాయి."

కాల పరిస్థితులు తెచ్చిన ఎన్నో విపత్తులు ఈ సంస్థపై విరుచుకుపడ్డాయి. దానికి సంబంధించిన అనేక భావాలు లాగుకోబడ్డాయి. అయినా దాని భవనం, పాఠశాలలు, మస్జిద్, ఉపాధ్యాయుల విశ్రాంతి గదులు ఇప్పటికీ చెక్కుచెదరకుండా ఉన్నాయి. ఆ గదులు ఈనాటి కాలేజి "స్టాఫ్ రూం"లా ఉపయోగించబడేవి. ప్రత్యేకమైన ఓ గృహం కూడా ఉంది. అది ప్రధానోపాధ్యాయుని గృహంగా ఉండేది. అందులో ఆయన తన భార్యాపిల్లలతో ఉండేవాడు. విద్యార్థుల విశ్రాంతి గదులు, పాఠశాల సిబ్బంది గృహాలు కూడా ఈనాటికీ నిలిచి ఉన్నాయి. ఇప్పుడు ఆ పాఠశాల ప్రక్క ఉండే పొరుగువారు దాని వంటగది, భోజనం చేసే పెద్ద హాలు, కూరగాయలు, ధాన్యం నిలువ ఉండే గోదామును ఆక్రమించుకొని ఉన్నారు. ప్రస్తుతం ఈ పాఠశాల భవనం ముస్లింల గత కాలపు పాఠశాలలకు సజీవంగా నిలిచి ఉంది.

అలాగే "హలబ్"లో జాతీయ, రాజరిక, ఉస్మానీ పాఠశాలల్ని నేడు కూడ చూడవచ్చు. అక్కడ విద్యార్థుల విశ్రాంతి గదులు, పాఠశాలల్ని వేర్వేరుగా చూడవచ్చు. పూర్వం ఈ పాఠశాలల్లోని విద్యార్థులకు భోజన సదుపాయం ఉండేది. కాని ఆ తర్వాత వాటిలో ప్రవేశించే విద్యార్థులు ప్రతి నెలా కొంత నగదు చెల్లించే విధంగా ఏర్పాటు జరిగింది.

ఇంకా ఆ విద్యాలయాలలో ఈజిప్టులోని "అజ్హర్" విశ్వ విద్యాలయం ఓ సజీవ సాక్షిగా నేటికీ నిలిచి ఉంది. వాస్తవానికి అదో మస్జిద్. దాని వివిధ భాగాల్లో బోధనా తరగతులు సాగుతూ ఉంటాయి. మస్జిద్ నాలుగు వైపుల విస్తరించి ఉన్న గదుల్లో విద్యార్థులు ఉంటారు. వాటిని "రవాఖ్"లంటారు. వాటిలో వివిధ దేశాల

విద్యార్థులు వేర్వేరుగా ఉంటారు. ఉదాహరణకు సిరియా, టర్కీ, సూడాన్, ఇరాక్ దేశాల విద్యార్థులకు వేర్వేరు "రవాఖ్"లు ఉన్నాయి. ఈనాడు కూడా "అజ్‌హర్" విద్యార్థులు ఉచిత విద్యతో పాటు అజ్‌హర్‌కు దానం చేయబడ్డ ఆస్తుల ఆదాయం నుండి ప్రతి నెల ఉచిత వేతనం క్రమం తప్పకుండ పొందుతుంటారు.

## అధ్యాపకుల స్థితిగతులు

ఇస్లామీయ పాఠశాలల ప్రస్తావన సందర్భంలో అధ్యాపకుల స్థితిగతులు, వారి జీత భత్యాలు మొదలగు వాటిని గురించి కూడా చర్చించడం సమంజసమని తలుస్తాము. ప్రధానోపాధ్యాయులుగా ఎల్లప్పుడూ పెద్ద పెద్ద విద్యావేత్తలే నియమించబడుతూ ఉన్నారు. వారు తమ శాస్త్ర కళల్లో అత్యంత ప్రసిద్ధిగాంచి ఉండేవారు. ప్రఖ్యాత విద్వాంసుల జీవిత చరిత్రల వల్ల వారు ఎక్కడెక్కడ బోధిస్తూ ఉండేవారో తెలుస్తున్నది. ఉదాహరణకు ఇమామ్ నూరి, ఇబ్నె అస్సలాహ్, అబూ షామ తఖియుద్దీన్ నబ్‌కి, ఇమాదుద్దీన్ డెమస్కస్ "దారుల్ హదీస్" శాఖలో బోధనా విధులు నిర్వహిస్తూ ఉండేవారు. గజాలి, షీరాజీ, ఇమామ్ అల్ హర్‌మీన్, అల్లామా షాస్బి, ఖతీబ్ తబ్‌రీజి, ఖజ్‌దీవి, ఫిరోజాబాది మొదలగు తత్వవేత్తలు "నిజామియా బగ్దాద్ సంస్థల్లో అధ్యాపకులుగా ఉండేవారు. పాఠశాలలు ప్రారంభదశలో అధ్యాపకులు బోధనా విధులు నిర్వహిస్తున్నందుకు జీతాలు తీసుకునేవారు కాదు. ఇస్లామీయ సంస్కృతి ప్రగతి చెందిన తర్వాత పెద్ద పెద్ద విశ్వవిద్యాలయాలు నిర్మించబడి వాటికి పెద్ద పెద్ద ఆస్తులు దానం రూపేణా లభించిన తర్వాత అధ్యాపకులకు కూడా నెల జీతాలు నిర్ణయించబడ్డాయి.

"మాదిరా రున్నహర్" ప్రాంతాల్లోని పండితుల దూరదృష్టికి నిదర్శనమయిన ఓ "ఘటన" ఇక్కడ ప్రస్తావించడం సముచితం. ఖలీఫా నిజాముల్ ముల్క్ (తౌసి), మాదిరారున్నహర్ ప్రాంతాల్లో గొప్ప పాఠశాలలు నిర్మించి వాటి అధ్యాపకులకు నెలసరి వేతనాలు నిర్ణయించాడు. ఇంకేముంది, అక్కడి పండితులందరూ సమావేశమై జీతాల నిర్ణయాన్ని తీవ్రంగా నిరసించారు. అత్యంత ఆవేదనతో పూర్వం పవిత్రశీలురు, వజ్ర సంకల్పంగల మహనీయులు విద్యను ఆర్జించేవారు. వారు విద్యను కేవలం దానికున్న ఔన్నత్యం కోసం, దానిలోని శేముషీ కళానైపుణ్యాన్ని సంపాదించడం కోసం అభ్యసించేవారు. కాని ఇప్పుడు విద్యతోపాటు ప్రాపంచిక ప్రయోజనం కూడా తోడయ్యింది. కాబట్టి లౌకిక ప్రయోజనాలను ఆశించేవారు,

స్వలాభాపేక్షాపరులు విద్యను పొందటానికి సంసిద్ధులౌతారు. తత్ఫలితంగా అత్యంత విలువ, గౌరవప్రతిష్ఠ, పవిత్రత గల విద్య ఇక ఉండజాలదు. అందులో బలహీనత ఏర్పడి అప్రతిష్ఠపాలైపోతుంది" అని విలపించారు.

కాని మారుతున్న జీవన పరిస్థితులు, సంస్కృతిలో ఉత్పన్నమవుతున్న క్రొత్త క్రొత్త సమస్యలు అవసరాల వల్ల వారి దృక్పథం అంగీకరించబడలేదు. తుదకు అధ్యాపకుల వేతనాలు నిర్ణయమయిపోయాయి. పాఠశాలలు వక్ఫ్ ఆస్తుల ఆదాయాన్ని బట్టి కొన్ని చోట్ల తక్కువగాను, ఇంకొన్ని చోట్ల ఎక్కువగా జీతాలు ఉండేవి. అయినా వేతనాలు మాత్రం తగినంతగా ఉండి ఉపాధ్యాయులు చాలా ప్రశాంతంగా జీవితం గడిపేవారు. వేతనాలే లేకుండా ఇతర ఆర్థిక అవసరాల్ని తీర్చుకోవడానికి వారికి అలవెన్సుల రూపంలో మరికొంత డబ్బు కూడా సమకూర్చేవారు.

సుల్తాన్ సలాహుద్దీన్ తన పాఠశాల "సలాహియ"లో నియమించబడిన షేఖ్ నజుముద్దీన్ జోషానికి బోధనా విధి నిర్వహణపై నెలసరి వేతనం 40 పౌండ్లు. పాఠశాల వక్ఫ్ ఆస్తుల పర్యవేక్షణ కోసం 10 పౌండ్లు ఇస్తూ ప్రతి రోజూ 60 మిస్రీ రతల్, రొట్టెలు, నైలునది నీళ్ళతో నిండిన రెండు పాత్రలు ఇవ్వబడేవి. అజ్హర్ విద్యా సంస్థ అధికారికి ఇచ్చే అలవెన్సులో వాహన అలవెన్సు కూడా ఉండేది. షేఖుల్ అజ్హర్ హోదాను బట్టి ఆయన గుర్రానికి వక్ఫ్ నుండి ప్రత్యేక అలవెన్సు పొందేవారు. మొదట అదంతా నెలసరి దాదాపు 100 పౌండ్లు ఉండేది. తర్వాత దాన్ని షేఖుల్ అజ్హర్ వేతనంలో కలిపివేయడం జరిగింది.

## బోధనా బాధ్యతల్ని నిర్వహించేవారు

బోధనా బాధ్యతల్ని ప్రతిభావంతంగా నిర్వహించేందుకు నిపుణులు ఎవరిని అర్హులుగా నిర్ణయిస్తారో వారే అధ్యాపకులుగా నియమితులయ్యేవారు. ఇస్లాం ప్రారంభ కాలంలో ఓ పద్ధతి ఉండేది. అదేమంటే ప్రతిభగల శిష్యుడు కోరుకుంటే అతనికి తన ఉపాధ్యాయుని నుండి వేరయి స్వయంగా ఓ విద్యా పీఠాన్ని ఏర్పరచుకొని బోధనా కార్యాన్ని ప్రారంభించుకోవడానికి అనుమతి ఉండేది. లేదా ఉపాధ్యాయుని మరణానంతరం ఆయన శిష్యవర్గంలోని అత్యధిక అర్హతలున్న వ్యక్తిని బోధనా బాధ్యతకై ఎన్నుకోవడం జరిగేది. ఒకవేళ అతడు విధులకు విరుద్ధంగా ప్రవర్తిస్తే తీవ్ర నిరసనకు గురయి కఠినమయిన ఆక్షేపణలను ఎదుర్కోవాల్సి వచ్చేది.

ఖాజీ అబూ యూసుఫ్ జీవితంలో మరువరాని సుప్రసిద్ధ సంఘటన ఇందుకు నిదర్శనంగా తీసుకోవచ్చు. ఆయన ఇమామ్ అబూ హనీఫా (రహ్మలై)కు ప్రియాతి ప్రియమైన శిష్యుడు. ఖలీఫా హారూన్ రషీద్ కాలంలో ఆయన ప్రధాన న్యాయమూర్తి పదవిలో ఉండేవారు. ఇమామ్ అబూ హనీఫా జీవితంలో ఆయన ఓసారి రోగగ్రస్తుడయ్యారు. ఇమాం గారు ఆయన్ను పరామర్శించడానికి వెళ్ళి "నీవు అనారోగ్యంపాలయినందుకు చాలా బాధపడుతున్నాను. ఎందుకంటే నా తర్వాత ముస్లింల ఆశల్ని నెరవేర్చేందుకు నీవే తగిన వాడివని నా అభిప్రాయం" అన్నారు. దేవుడు ఇమామ్ యూసుఫ్‌కు ఆరోగ్యాన్ని ప్రసాదించాడు. అయితే ఇమామ్ అబూ హనీఫా అంతటి వ్యక్తి ఇచ్చిన ప్రోత్సాహాన్ని, ధైర్యాన్ని ఆయన జీర్ణించుకోలేకపోయారు. ఆయన స్వయంగా ఓ విద్యాపీఠాన్ని ఏర్పరచుకొని విద్యాబోధనా ప్రారంభించారు.

విద్యలో ఆయన పూర్తిగా పరిపక్వ దశకు చేరుకోలేదని ఇమామ్ అబూ హనీఫాకు తెలుసు. అందువల్ల ఆయన సమగ్ర విశదీకరణను కోరే అయిదు కఠినమైన ప్రశ్నలను ఒక వ్యక్తి ద్వారా ఆయన వద్దకు పంపించి, వాటికి తగిన సమాధానమివ్వమని అన్నారు. ఇమామ్ అబూ యూసుఫ్ ఆ ప్రశ్నలకు అవకతవక సమాధానాలు ఇచ్చారు. దాంతో ఆయన తన గురువుగారి నుండి వేరయి పొరపాటు చేశానని గ్రహించారు. వెంటనే మళ్ళీ గురువుగారి విద్యాపీఠంలో ప్రవేశించారు. అప్పుడు ఇమామ్ అబూ హనీఫా అన్నారు, "నీవు పరిపక్వానికి చేరకముందే ఎండిపోయావు. ఎవరయితే విద్యాభ్యాసంలో పరిపూర్ణత పొందానని అనుకుంటారో వారు తమ మనోవైఖరి పట్ల విచారపడాలి."

ఇవి ప్రారంభదశలోని పరిస్థితులు. కాని పాఠశాలలు స్థాపించబడిన తర్వాత చదువు పూర్తిచేసిన విద్యార్థులకు యోగ్యతా పత్రాలు ఇచ్చే రివాజు మొదలయింది. ముఖ్యంగా వైద్య విద్యార్థులకు, చదువు ముగిసిన తరువాత సక్రమ రీతిలో యోగ్యతా పత్రం లభించనంత వరకు వారికి ప్రాక్టీసుకై అనుమతి లభించేది కాదు. ఈ యోగ్యతా పత్రాల్ని విద్యాసంస్థలకు చెందిన పెద్ద పెద్ద షేఖులు (అధికారులు) ఇచ్చేవారు.

## అధ్యాపకుల దుస్తులు

అధ్యాపకులు ప్రత్యేకమయిన దుస్తులు ధరించేవారు. అవి వారి ప్రత్యేకతను కనబరచేవి. ఇమామ్ అబూ యూసుఫ్ కాలంలో నల్ల తలపాగా, శాలువ ధరించడం

రివాజుగా ఉండేది. ఫాతిమీల కాలంలో ఆకుపచ్చ తలపాగా, ఆరు ముక్కలు కలిపి కుట్టిన స్వర్ణ దుస్తులు ఉండేవి. వాటిలో ముఖ్యంగా టోపి, దుప్పటి ఉండేవి. ధర్మవేత్తలు, అధ్యాపకులు ప్రత్యేకమయిన జుబ్బాలు ధరించే సంప్రదాయం ఉమ్‌లీల కాలంలో ప్రారంభమైనది. స్పెయిన్‌లోని అధ్యాపకులు, ధర్మవేత్తల దుస్తులు తూర్పు దేశాల పండితులు, అధ్యాపకుల దుస్తులకు కొంచెం భేదముండేది. ఎక్కువ భేదం తలపాగాలో ఉండేది. తూర్పు దేశస్థులు చాలా చిన్న తలపాగను ధరించేవారు. కొందరు తలపాగాను అసలు ధరించేవారు కాదు. ప్రఖ్యాత సాహితీవేత్త ఇమాం అబూ అలినామి స్పెయిన్ సందర్శించినప్పుడు అక్కడి పండితులు ఆయనకు స్వాగతమివ్వడానికి వచ్చారు. అప్పుడు ఆయన ధరించిన పెద్ద తలపాగాను చూసి అబ్బురపడిపోయారు. కొందరు బుద్ధిహీనులు, పిల్లలు ఆయనను హేళన చేస్తూ రాళ్ళు కూడా విసిరారు. పాశ్చాత్య జాతులు తమ వస్త్రధారణను స్పెయిన్ ముస్లింల నుండి నేర్చుకున్నారు. నేడు కూడా ఐరోపా విశ్వవిద్యాలయాల్లో పండితులు గౌను రూపంలో ధరించే దుస్తులకు మూలం ఆనాటి ముస్లిం అధ్యాపకుల వస్త్రధారణే.

## అధ్యాపక సంఘం

ఈనాడు ఏ విధంగానైతే విద్యార్థి, ప్రజా సంఘాలు ఉన్నాయో ఆ కాలంలో కూడా ప్రభుత్వ గుర్తింపు పొందిన అధ్యాపక సంఘం ఉండేది అధ్యాపకులు తమ ప్రతినిధులను, అధ్యక్షుడ్ని ఎన్నుకునేవారు. ఈ విషయంలో వారు సర్వ స్వతంత్రులు. వారిలో విభేదాలు తలెత్తిన సమయంలో మాత్రమే ప్రభుత్వం కలుగచేసుకొంటుంది.

అబూ షామ "రౌజతీన్"లో ముఖల్లిద్ దులై వివరించినట్లు ఇలా ఉటంకించారు, "హాఫిజ్ మరాలి మరణించినప్పుడు అరబ్బులు, కుర్దులు అని మా ఫిఖాహ్ సంఘంలో రెండు వర్గాలు ఏర్పడ్డాయి. మా మధ్య విభేదం తలెత్తింది. మాలో కొందరి ఆలోచన ఫిఖహ్ వైపునకు పోయింది. ఆ కారణంగా ఆ పదవి షేఖ్ షర్‌ఫుద్దీన్ అబుల్ ఖుస్రూన్‌కు కట్టబెట్టాలని వారి వాదన. ఇంకొందరి దృష్టి విద్యా, నీతిశాస్త్రాల వైపునకు మరలింది. అందువల్ల వారు ఖుతుబ్ నీషాపూరీని పిలిపించదలిచారు. ఈ విభేదం వల్ల పెద్ద విపత్తు వచ్చిపడింది. అది నూరుద్దీన్‌కు తెలిసింది. ఆయన మేధావి వర్గాన్ని పిలిపించారు. వారితో సంభాషించడానికి మజదుద్దీన్ బిన్ అద్దారియ అనే అతను సుల్తాన్ తరపున ప్రతినిధిగా కలిశాడు. ఆయన సుల్తాన్ అభిప్రాయాన్ని ఇలా విన్పించాడు : "మేము నూరియా కళాశాలను

ధర్మం, విద్యాజ్ఞానాల ప్రచురణ ప్రచారాల కోసం, ధర్మంలో కల్పించబడిన కొత్త ఆచారాలు, సంప్రదాయాలను అంతం చేయడానికి స్థాపించాము. కాని, పరస్పరం పోట్లాడుకోవడానికి కాదు. మీ ఈ విభేదం ఏ విధంగాను సమంజసమైంది కాదు. కాబట్టి ఇరువర్గాల వారి మధ్య రాజీ కుదుర్చడానికి వారి పెద్దల్ని పిలిపిస్తాము." ఆ ప్రకారమే తర్వాత వారిద్దర్ని పిలిపించి షర్ఫుద్దీన్‌ను మారియ కళాశాలకు, ఖుతుబుద్దీన్‌ను నజ్‌రి కళాశాలకు ప్రధానోపాధ్యాయులుగా నియమించారు.

## కొన్ని ప్రఖ్యాత పాఠశాలలు, వాటి వ్యవస్థాపకులు

పాఠశాలలు ప్రత్యేకంగా ఉన్నత విద్యా సంస్థలు అసంఖ్యాకంగా ఇస్లాం ప్రపంచంలో వ్యాపించి ఉండేవి. ఇస్లాం ప్రపంచంలో ప్రతి నగరంలో పెద్ద పెద్ద విద్యాసంస్థల్ని నెలకొల్పడంలో తమ వంతు బాధ్యతను నిర్వహించిన ప్రముఖుల పేర్లను ఇస్లాం చరిత్ర సగర్వంగా ప్రకటిస్తోంది. వారిలో ప్రప్రథమంగా గణతికెక్కినవారు సలాహుద్దీన్ అయ్యూబి (రహ్మాలై). ఈయన ఈజిప్టు, సిరియా, మౌసల్, బైతుల్ మఖ్దిస్‌లో ప్రతి చోటా అనేక పాఠశాలల్ని స్థాపించారు.

నూరుద్దీన్ షహీద్ కూడా సిరియాలో 14 గొప్ప పాఠశాలల్ని నెలకొల్పిన వారిలో ఒకరు. వాటిలో 6 డెమాస్కస్‌లో, 4 హలబ్‌లో, 2 హమాత్‌లో, 2 హమస్‌లో, 1 బఅల్‌బక్‌లో ఉండేవి. ఇంకా నిజాముల్ ముల్క్ తౌసి ఆలె సల్‌జూఖ్ యొక్క ప్రధానమంత్రి కూడా ఇరాక్, ఖురాసాన్‌లను పాఠశాలలతో నింపివేసినవారిలో ఒకరు. ఆయన ఇరాక్, ఖురాసాన్‌లోని ప్రతీ నగరంలో ఒక ఉన్నత పాఠశాల నిర్మించారని, దూర దూర ప్రాంతాల్లో కూడా పాఠశాలలు నిర్మింప చేసేవారని చరిత్రకారులు అంటారు. ఉదాహరణకు ఆయన "జజీర ఇబ్నె ఉమర్"లో అత్యంత అందమైన ఓ పెద్ద పాఠశాల భవనాన్ని నిర్మించారు. ఆయనకు ఎక్కడ ఒక భవన నిర్మాణ నిపుణుని చిరునామా తెలుస్తే అక్కడ ఓ పాఠశాలను నిర్మింపజేసి ఒక పెద్ద గ్రంథాలయాన్ని కూడా ఏర్పాటు చేసేవారు. దానికి వఖ్ఫ్ బందోబస్తు చేసేవారు.

"నిజామియా బాగ్దాద్" అన్నింటికంటే క్రమశిక్షణ గల విద్యా సంస్థ. ఈ సంస్థ 5, 9 హిజ్రీ శతాబ్దాల మధ్యకాలంలో గొప్ప గొప్ప మేధావుల్ని ప్రపంచానికి ప్రసాదించింది. ఇందులో విద్యార్థుల సంఖ్య దాదాపు 6 వేల వరకు ఉండేది. అందులో ఇస్లామీయ రాజ్యంలోని పెద్ద పెద్ద ధనవంతుల బిడ్డలు, అతి నిరుపేద పిల్లలు

ఒకేచోట కూర్చుని ఎలాంటి ఫీజు లేకుండా ఉచితంగా విద్య అభ్యసించేవారు. పేద పిల్లలకయితే ఉచిత విద్యతో పాటు ఉపకార వేతనం కూడ ఇవ్వబడేది. దానికోసం ప్రత్యేకించబడిన వఖ్ఫ్ ఆస్తుల ఆదాయం నుండి అది చెల్లించబడేది. దాతలు ఈ పాఠశాలలు, వాటికి కావాల్సిన వఖ్ఫ్‌లను స్థాపించడానికి అధికారులు, ఉన్నతోద్యోగులు, సంపన్నులు, వ్యాపారులు ఉత్సాహంతో ఒకరికంటే ఒకరు ముందుకు వచ్చేవారు. ఆ వఖ్ఫ్‌ల ద్వారా పాఠశాల ఆదాయం పెరిగి విద్యార్థులు ప్రశాంతంగా, శ్రద్ధాసక్తులతో పాఠశాలలకు వెళ్ళగలిగేవారు. తమ గృహాలను పాఠశాలలుగా మార్చివేసి వాటిలో ఉన్న గ్రంథాలు లేదా ఇతర ఆస్తులను ఎందరో మహానుభావులు సయితం విద్యార్థుల కోసం అంకితం చేసి చరిత్రలో చిరస్మరణీయులయ్యారు.

ఈ కారణాలవల్ల యావత్ ఇస్లాం ప్రపంచంలో ప్రత్యేకంగా తూర్పు ప్రాంతాల్లో పాఠశాలలు అసంఖ్యాకంగా వెలిశాయి. సుప్రసిద్ధ స్పెయిన్ పర్యాటకుడు ఇబ్నె జుబైర్ అసంఖ్యాకంగా ఉన్న ఈ పాఠశాలలు, వాటికి గల అత్యధికమైన వఖ్ఫ్ ఆస్తులు, వాటిపై వచ్చే అపార ఆదాయాన్ని చూపి అమితాశ్చర్యం పొందినాడు. అందుకే ఆయన తూర్పుకు వెళ్ళి విద్యనార్జించండని స్పెయిన్ ప్రజలకు ఉద్బోధించాడు.

ఆయన అంటారు : “తూర్పు ప్రాంతాల్లో పాఠశాలలు విద్యార్థులకు అసంఖ్యాకమైన వఖ్ఫ్ ఆస్తులున్నాయి. ముఖ్యంగా డెమాస్కస్‌లో ఉన్నాయి. ప్రశాంతంగా, సుఖసౌకర్యాలతో విద్యనార్జించాలంటే మన పాశ్చాత్య (స్పెయిన్) విద్యార్థులు అక్కడికి వెళ్ళాలి. అక్కడ విద్యనార్జించడానికి కావాల్సిన అన్ని ప్రయోజనాలు పొందగలుగుతారు. ముఖ్యంగా ఆర్థిక సమస్యలు తీరిపోతాయి.”

ఇబ్నె జుబైర్ ఇచ్చిన ఈ సాక్ష్యానికి అత్యంత విలువ ఉంది. ఎందుకంటే ఆయన సంఘటనల్ని, వాస్తవాల్ని వ్యక్తపరచడంలో నిజాయితీపరుడని, నమ్మకస్తుడయిన పర్యాటకుడని భావించబడతాడు. అసంఖ్యాకమైన వఖ్ఫ్‌లు, పాఠశాలల విషయంలో ఆయన ప్రత్యేకించి డెమాస్కస్‌ను ప్రస్తావించాడు. ఇది చారిత్రక వాస్తవం కూడా. ఎందుకంటే డెమాస్కస్‌లో 4 వందలకు పైగా ఇలాంటి పాఠశాలలు ఉండేవి. అందులో దూర తీరాల నుండి విద్యార్థులు వచ్చి విద్యనభ్యసించేవారు.

ఇబ్నె అసాకిర్ తన చరిత్రలో సుల్తాన్ బిన్ అలి బిన్ మునఖ్ఖజ్ కతాని డెమాస్కస్‌ను ప్రశంసిస్తూ, దాని ఔన్నత్యాన్ని గురించి వ్రాసిన ఓ కావ్యాన్ని పొందుపరిచాడు.

అందులో ఆయన డెమాస్కస్ పాఠశాలల్ని కీర్తిస్తూ ఇలా విపులీకరించాడు :

"అక్కడున్న అధ్యాపకుల ముందు మీరు ఎలాంటి జఠిలమైన ప్రశ్న వేసినా వారిలోని ప్రతి ఒక్కరూ చటుక్కున సమాధాన మివ్వడాన్ని మీరు చూడగలరు. ఎవరయినా ఎలాంటి చిక్కు సమస్య తీసుకెళ్ళినా అది అక్కడ సులభంగా పరిష్కరించబడేది. అతను ప్రబోధనం పొంది ప్రశాంత చిత్తుడవుతాడు. ఎవరయినా భావ దారిద్ర్యంలో మునిగివుంటే అది వెంటనే దూరమయిపోయి అతను వివేకవంతుడవుతాడు. ఆ పాఠశాలల వఖ్ఫ్ ఆస్తుల ఆదాయంతో ఖైదీలు విడుదల అవుతారు. పేదవారి అవసరాలన్నీ తీరిపోతాయి. అక్కడ శాస్త్రాల్ని బోధించే విద్యాకోవిదులున్నారు. అతి మొండి మానసిక రోగపీడితులకు సయితం నయం చేయగల జ్ఞాన సిద్ధులున్నారక్కడ."

## పాఠశాలల వఖ్ఫ్ ఆస్తులు

ఇప్పుడు కొన్ని ఉదాహరణలను మీ ముందుంచుతున్నాము. దాని వల్ల అసంఖ్యాకమైన ఈ వఖ్ఫ్‌ల తీరు ఎలా ఉండేదో గ్రహించవచ్చు. డెమాస్కస్‌లోని నూరియ ఉన్నత పాఠశాల వఖ్ఫ్ ఆస్తుల వివరాలు ఆ పాఠశాల ద్వారం మీద అంటించివున్న దస్తావేజుల ప్రకారంగా ఇలా ఉన్నాయి :

"గందం మండీలోని అన్ని స్నానాల గదులు, బాబుస్సలామ్ బయటనున్న వార్ఖలోని రెండు క్రొత్త స్నానాల గదులు, స్నానాల ఆ గదులకు ప్రక్కనేవున్న "ఔలియహమి" అనే గృహానికి సంబంధించిన కార్ఖానా, ఔరాఖ్, మంత్రిగారి తోట, అర్జాలోని జౌజా తోట అర్థభాగం, నాల్గవభాగం, బాబె జాబియా బయటనున్న 11 దుకాణాలు, వారియాలోని 9 పొలాలు."

హలబ్‌లోని నూరి ఆస్పత్రి యొక్క వఖ్ఫ్ ఆస్తులు ఇవి :

"మారాతాలోని పూర్తి గ్రామం, జబ్లెసమ్ఆన్ లోయ, 'అనల్' భూమిలో అర్థభాగం, కఫ్రితానా భూమిలో 5 ఫదాన్‌లు అంటే 5 జతల ఎద్దులకు సమానమైన భూమి, ఖాలిదీ పొలంలో 1/3 భాగం, మతఖ్‌లోని గిర్ని, బాబుల్ ఖిబాన్ ముందున్న గిర్ని మొత్తం ఆదాయం, ఎజాజ్‌లోని అబూ మరాయా పొలంలో 3 ఫదాన్ అంటే మూడు జతలకు సమానమైన భూమి, మతఖ్‌లోని ఖమీర్ పొలంలో 8 జతల ఎద్దులకు సమానమైన భూమి, మారాలో ఫర్‌జల్ పొలంలోని 11 జతల ఎడ్లభూమి, గజబ్‌యాత్ గ్రామం, బైతె రాఈల్‌పై వచ్చే ఆదాయంలో మూడో వంతు భాగం,

సూఖ్‌హవాలోని 10 దుకాణాలు, బాబె ఇంతాకియా, బాబె మరహ్, బాబెజవాన్ బయటగల సాధారణ దుకాణాలు."

డెమాస్కస్‌లోని మస్జిద్‌లు, పాఠశాలలకున్న వఖ్ఫ్ ఆస్తులు అసంఖ్యాకంగా ఉన్నాయనడానికి ఈ ఒక్క నిదర్శనం చాలు : ఇమామ్ నౌదీ మతూఫి హిజ్రీ శకం 676లో తన పూర్తి జీవితకాలంలో డెమాస్కస్‌లో పండిన ఏ ఫలాన్ని కూడా తినలేదు. ఎందుకంటే "గౌత"లోని అత్యధిక భాగం, డెమాస్కస్‌లోని అసంఖ్యాకమైన తోటలు వాస్తవానికి వఖ్ఫ్‌లకు సంబంధించినవే. కాని వాటినన్నింటినీ దుర్మార్గులు ఆక్రమించుకున్నారు.

## వివిధ విద్యా కళలకై ప్రత్యేక పాఠశాలలు

చాలా పాఠశాలలు అనేక ఆశయాలు, లక్ష్యాలు కలిగి వుండేవి. కొన్ని పాఠశాలల్లో కేవలం దివ్య ఖుర్‌ఆన్ వ్యాఖ్యానం, ఖిర్‌అత్, దాన్ని కంఠస్థం చేసే పాఠాలు బోధించేవారు. ఇంకొన్ని పాఠశాలల్లో కేవలం హదీసు విద్య, దానికి సంబంధించిన శాస్త్రాలు బోధించబడేవి. మరికొన్ని పాఠశాలలు ఫిఖహ్ విద్యకై ప్రత్యేకంగా వుండేవి. వీటి సంఖ్య అపారం. ప్రతి ఫిఖహ్ వర్గానికి ప్రత్యేక పాఠశాలలుండేవి. అలాగే వైద్య పాఠశాలలు కూడా ప్రత్యేకంగా ఉండేవి. ఇంకొన్ని పాఠశాలలు కేవలం అనాథల కోసం ప్రత్యేకించబడి ఉండేవి.

క్రీ.శ. 10వ శతాబ్దపు విద్వాంసుల్లో అత్యంత మేధావి అయిన "నయీమి" తన గ్రంథం "అద్దార్"లో, "ఫీ తారీఖుల్ మదారిస్" అనే అధ్యాయంలో డెమాస్కస్ పాఠశాలలు, వాటి వఖ్ఫ్ ఆస్తులకు సంబంధించిన పూర్తి పట్టికను వ్రాశారు. ఆ గ్రంథం ద్వారా మనకు తెలిసేదేమంటే డెమాస్కస్‌లో కేవలం దివ్య ఖుర్‌ఆన్‌ని, తత్ సంబంధిత శాస్త్రాల్ని బోధించడానికి 7 పాఠశాలలు ఉండేవి. హదీసు విద్యకై 16 పాఠశాలలు, ఖుర్‌ఆన్, హదీసులను సమైక్యంగా బోధించడానికి 3 పాఠశాలలు, షాఫయీ ఫిఖహ్ కోసం 63 పాఠశాలలు, హనఫీ ఫిఖహ్ కోసం 52, మాలికి ఫిఖహ్ కోసం 4, హంబలీ ఫిఖహ్ కోసం 11 పాఠశాలలు ఉండేవి. ఇవి కాక వైద్య పాఠశాలలు వేరుగా ఉండేవి. ఇంకా ఆధ్యాత్మిక మఠాలు, సత్రాలు, జామె మస్జిద్‌లు కూడా వుండేవి. ఈ ప్రదేశాలన్నింటిలో క్రమం తప్పకుండా బోధనా కార్యకలాపాలు సాగుతూ ఉండేవి. ప్రజలక్కడ విద్యనార్జించేవారు, బోధించేవారు.

## ఆనాటి ఐరోపా పరిస్థితి

దీంతో పాటు ఆ రోజుల్లో పాశ్చాత్య ప్రజలు ఎలాంటి పరిస్థితుల్లో మునిగి ఉన్నారో వివరించడం కూడా సమంజసంగా ఉంటుంది. ఆనాడు వారు నూరు శాతం అజ్ఞానులని, అనాకారులని వింటే మీరు అమితాశ్చర్య పడిపోతారు. కాని అది చారిత్రక వాస్తవం. అక్కడ విద్య నాలుగు గోడల మధ్య ఉండే సన్యాసుల వరకే పరిమితమై ఉండేది. అది కేవలం విరాగులు, పాదరీలకు ప్రత్యేకించబడి ఉండేది. దీంతో పోలిస్తే ఇస్లామీయ సంస్కృతి ప్రగతి పథంలో ఉన్నప్పుడు ముస్లిం సమాజం ఎన్ని ఉన్నత శిఖరాలకు చేరుకుందో సులభంగా గ్రహించవచ్చు. సామూహిక సంస్థలు, విద్యా కేంద్రాల చరిత్ర దృక్పథంలో ఇస్లామీయ సంస్కృతి సాధించిన ఘన కార్యాలు ఎంత మహోజ్వలమైనవో ఊహించవచ్చు. విద్యా ప్రచారం ప్రాచుర్యాలను, మానవ నాగరికతను ఉన్నత శిఖరాలకు చేర్చడంలో ప్రతీ మతం, ప్రతీ సమాజానికి చెందిన ప్రజల కోసం ఈ సౌకర్యాలను సమకూర్చడంలో ఇస్లాం ఎంత గణనీయమైన పాత్ర నిర్వహించిందో ఆలోచించండి.

ఇబ్నె కసీర్ తన గ్రంథం "అల్ బదాయ్యావ న్నహాయ"లో హిజ్రీ శకం 631 నాటి పరిస్థితుల్ని ఇలా ఉల్లేఖించారు :

"ఈ సంవత్సరం బగ్దాదులోని ముంతసిర్‌యా పాఠశాల భవనం పూర్తి అయింది. అంతకు పూర్వం ఇలాంటి పాఠశాల నిర్మించబడలేదు. దాన్ని నాలుగు ఫిఖహ్ వర్గాల వారికి అంకితం చేయబడింది. ప్రతి ఫిఖహ్ వర్గానికి 62 మంది ఫిఖహ్ వేత్తలు పనిచేస్తూ ఉంటారు. వారిలో నలుగురు శాస్త్ర నిపుణులు ఉంటారు. ప్రతీ వర్గానికి ఒక అధ్యాపకుడు, ఒక షేఖుల్ హదీసు, ఇద్దరు ఖారీలు, 10 మంది శ్రోతలు, ఒక అత్యున్నత వైద్యాధికారి, 10 మంది వైద్యం చేసే ముస్లింలు ఉంటారు. ఒక అనాథ శరణాలయం కూడా ఉండేది. ప్రతి విద్యార్థికి నిర్ణయించబడిన రొట్టె, మాంసం, మిఠాయిలతో పాటు, ఇతర ఖర్చుల కోసం నగదు రూపంలో కొంత డబ్బు ఇవ్వబడేది. అది వారి అవసరాలకు మించి ఉండేది."

ఆయన ఇంకా ఇలా వ్రాస్తారు :

"ఈ పాఠశాల కోసం ఓ గ్రంథాలయం దానం చేయబడింది. దానికి సాటి

మరొకటి మనకు కనబడదు. ఉన్నదని వినలేదు. దానిలో అసంఖ్యాకంగా గ్రంథాలు ఉన్నాయి. అవి అతి సుందరంగా కూర్చిన అక్షరాలతో వ్రాయబడి ఉన్నాయి. ఇంకా ప్రతి శాస్త్రానికి సంబంధించిన ఉత్తమ గ్రంథాలు సేకరించబడి ఉన్నాయి."

ఏ పునాదులపై ఇస్లామీయ సంస్కృతి నిర్మించబడిందో వాటిలో భౌతిక, ఆధ్యాత్మిక అవసరాలు రెండూ తీర్చబడతాయి. ఇస్లామీయ సంస్కృతి శరీరం యొక్క పెరుగుదల, దాని మంచి చెడుల విషయంలో కూడా బహు శ్రద్ధ చూపించింది. ఎందుకంటే మహోజ్వల ఆత్మతో మానవుడు ఉన్నత ప్రగతి శిఖరాలకు చేరుకో గలగాలి. ఈ విషయంలో ఇస్లామీయ సంస్కృతి నిర్మాత హజ్రత్ ముహమ్మద్ (సఅసం) ప్రవచనాల్లో నిక్షిప్తమైన ఈ పలుకులు గమనార్హం : "ఇన్నల్ జసదుల్ అలైక హఖ్ఖ్" (నిస్సంశయంగా నీ శరీరానికి కూడా నీమీద కొన్ని హక్కులున్నాయి).

ఇస్లామీయ ఆరాధనలన్నింటినీ నిశితంగా పరిశీలిస్తే వాటిలో వైద్యశాస్త్రం యొక్క ముఖ్యోద్దేశం, ఆరోగ్య పరిరక్షణకై తీసుకోవలసిన చర్యలన్నింటిని దృష్టిలో ఉంచుకున్నట్లు గ్రహించగలం. (అలీ బిన్ అబ్బాస్ వైద్య శాస్త్రాన్ని ఇలా నిర్వచించారు: ఆరోగ్య పరిరక్షణకు, రోగులకు స్వస్థత చేకూర్చేందుకు ఈ శాస్త్రం చర్చిస్తుంది). కాబట్టి నమాజ్, రోజా, హజ్ చేయడానికి విధించిన నిబంధనలు, షరతులను ఆచరిస్తున్నప్పుడు శరీరం నిర్వహించవలసిన పనులన్నీ ఆరోగ్య సంరక్షణకు, శరీరంలో నూతనోత్తేజం కలగడానికి ఎంత దోహదపడతాయో అవగతమవుతుంది.

దాంతోపాటు రోగాల్ని, వాటి వ్యాప్తిని నిరోధించేందుకు, ప్రతి జబ్బును ఎదుర్కోవడానికి ప్రతిపాదించబడిన చికిత్సలను పరిశీలిస్తే వైద్యరంగంలో కూడా ఇస్లామీయ సంస్కృతి ఎలాంటి కట్టుదిట్టమైన, పటిష్ఠమైన సూత్రాలపై నిర్మించబడిందో మనకు తెలుస్తుంది. ఇంకా ఈ రంగంలో అది సాధించిన ఘన విజయాలు ఎలాంటివో, అది నెలకొల్పిన వైద్యశాలలు, వైద్య సంస్థల ద్వారా యావత్తు మానవాళి ఎలా ప్రయోజనం పొందిందో, అది తయారు చేసిన గొప్ప గొప్ప వైద్యులు, వారి విజ్ఞానం, వైద్యరంగంలో వారి ఘన విజయాలపట్ల నేటికీ మానవత గర్విస్తోంది.

## అరబ్బులు అంధకార యుగంలో కూడా వైద్య విద్యనభ్యసిస్తూ వచ్చారు

అరబ్బులకు చందేసపూర్ వైద్య కళాశాల తెలుసు. దాన్ని ఈరాన్ నియంత క్రీస్తు 6వ శతాబ్దంలో నిర్మించాడు. ఆ కళాశాలలో కొందరు అరబ్ డాక్టర్లు విద్య

నభ్యసించారు. ఉదాహరణకు హారిస్ బిన్ కల్ద, ఈయన మహాప్రవక్త (సఅసం) కాలంలో జీవించి ఉన్నారు. ఈయన సహాబీలకు వైద్య సలహాదారుగా ఉండి వారు రోగగ్రస్తులయినప్పుడల్లా చికిత్స చేస్తూ ఉండేవారు.

# ప్రప్రథమ ఆస్పత్రి

వలీద్ బిన్ అబ్దుల్ మలిక్ పాలనా కాలంలో ముస్లింలు మొట్టమొదటి ఆస్పత్రిని నెలకొల్పారు. అది రోగులకు ప్రత్యేకించబడింది. ఈ ఆస్పత్రిలో నియమితులైన డాక్టర్లకు పెద్ద పెద్ద జాగీర్లు, వేతనాలు ఏర్పాటు చేయబడ్డాయి. ఈ ఆస్పత్రిలో చికిత్సపొందే రోగులు అన్ని సమయాలు ఆస్పత్రిలోనే ఉండాలని ఆజ్ఞాపించబడింది. వారికి ఉపకార వేతనాలు ఇవ్వబడ్డాయి. అంధులకు కూడ ప్రత్యేక ఉపకార వేతనాలు నిర్ణయించబడ్డాయి. ఈ ఆస్పత్రి తర్వాత ఇతర ప్రాంతాల్లో కూడా అనేక ఆస్పత్రులు నిర్మించబడినాయి. వాటిని "బీమారిస్తాన్" అని పిలిచేవారు. అంటే "రోగుల గృహం" అని అర్థం.

## రెండు రకాల ఆస్పత్రులు

ఆస్పత్రులు రెండు రకాలుగా ఉండేవి. 1. సంచార ఆస్పత్రులు 2. స్థిర ఆస్పత్రులు. సంచార ఆస్పత్రుల్లో ఒకటి మహాప్రవక్త (సఅసం) కాలంలో ఉన్నట్లు దాఖలాలున్నాయి. అది ఖందఖ్ యుద్ధ సమయాన నెలకొల్పబడింది. ఆ యుద్ధంలో క్షతగాత్రుల కోసం ఓ ప్రత్యేక శిబిరాన్ని ఏర్పాటు చేశారు. హజ్రత్ సాద్ బిన్ మఆజ్ (రజి) గాయపడగా ఆయన చేతి నరానికి దెబ్బ తగిలింది. అప్పుడు దైవప్రవక్త (సఅసం) తాను స్వయంగా దగ్గరుండి పరిస్థితి తెలుసుకోవడానికి వీలుగా ఆయన్ని క్షతగాత్రుల శిబిరంలో ఉంచమని అనుచరులకు ఆజ్ఞాపించారు. ఇది ఇస్లాంలో మొట్టమొదటి సైనిక సంచార వైద్యశాల.

ఆ తర్వాత ఖలీఫాలు, పాదుషాలు సంచార వైద్యశాలలను విస్తృతం చేస్తూ పోయారు. ఈ సంచార ఆస్పత్రిలో రోగులకు అవసరమైన అన్న పానీయాలు, దుస్తులు, మందులు వగైరా అన్ని సౌకర్యాలు ఏర్పాటు చేయబడుతుండేవి. ఆస్పత్రులు లేని ప్రాంతాల్లో ఈ సంచార వైద్యశాలలను ఓ గ్రామం నుండి మరో గ్రామానికి తరలిస్తూ ఉండేవారు.

ఆనాటి బగ్దాదుకు అక్కడి ఆస్పత్రులకు ఇన్‌చార్జ్‌గా ఉన్న సనాన్ ఇబ్నె సాబిత్‌కు మంత్రి ఈసా బిన్ అలీ జిరాహ్ ఇలా వ్రాశారు : "నేను 'సూద్‌లీని' గ్రామ ప్రజల విషయం ఆలోచించాను. అక్కడ రోగులు తప్పనిసరిగా ఉంటారు, కాని వారికి వైద్య సదుపాయాలు ఉండకపోవచ్చు, ఎందుకంటే అక్కడి వాడలలో ఒక్క డాక్టరూ లేడు. మీరు వెంటనే ఓ డాక్టర్ల బృందాన్ని ఏర్పాటు చేసి వారికి మందులు, రసాయనాలు కావలసిన మేరకు సమకూర్చండి. డాక్టర్లందరు గ్రామాలకు వెళ్ళి అక్కడ ఎంతకాలం ఉండాల్సి వచ్చినా ఉండి, రోగులకు తగు చికిత్స చేసిన తర్వాతనే ఇంకో గ్రామానికి తరలించండి."

సుల్తాన్ మహ్మూద్ నిక్‌జూఖి కాలంలో ఈ సంచార వైద్యశాలలు ఇంకా అధికంగా విస్తరించాయి. వాటి సామగ్రిని 40 ఒంటెలు మోస్తూ ఉండేవి. ఇక స్థిర ఆస్పత్రులు అసంఖ్యాకంగా ఉండేవి. ఇస్లాం ప్రపంచంలోని అతి చిన్న గ్రామం మొదలు పెద్ద పెద్ద నగరాల వరకు అన్ని ప్రాంతాల ప్రజలు వాటివల్ల ప్రయోజనం పొందేవారు. అతి చిన్న గ్రామంలోనూ ఒకటి కంటే ఎక్కువ ఆస్పత్రులుండేవి. ఉదాహరణకు ఒకప్పుడు ఖర్తబాలో 50 దాకా ఆస్పత్రులు ఉండేవి.

## విభిన్న రకాల ఆస్పత్రులు

ఈ ఆస్పత్రులు కూడ అనేక రకాలుగా విభజించబడ్డాయి. కొన్ని ఆస్పత్రులు సైనికుల కోసం ప్రత్యేకించబడ్డాయి. వాటిలో ప్రత్యేక డాక్టర్లు నియమితులై ఉండేవారు. సైన్యాధిపతులు, అధికారులు, అమీర్లకు ప్రత్యేక డాక్టర్లు ఉన్నప్పటికీ అదనంగా ఇంకొందరు డాక్టర్లు ఉండేవారు. ఖైదీలకు ప్రత్యేక ఆస్పత్రులు ఉండేవి. ప్రతి రోజూ డాక్టర్లు ఖైదీలను పరీక్షించి వారి చికిత్సకు, మందులకు సౌకర్యాలు సమకూర్చుతూ ఉండేవారు.

అందువల్లే మంత్రి అలీ బిన్ ఈసా బిన్ జిరాహ్ బిన్ సాబిత్ బగ్దాద్ వైద్యాధికారికి ఇలా వ్రాశారు : "ఖైదీల విషయంలో నేను చాలా ఆందోళన పడుతున్నాను. వారిలో చాలామంది రోగులు ఉన్నారనడానికి వారి అధిక సంఖ్య, జైళ్ళ స్థితే సాక్ష్యం. అందువల్ల వారికోసం వేరుగా కొందరు డాక్టర్లను నియమించడం మంచిదని నా అభిప్రాయం. వారు ప్రతి రోజు ఖైదీలను పరీక్షించాలి. వారికి మందులు సమకూర్చాలి. స్వయంగా మీరు అన్ని జైళ్ళను పరీక్షించి అక్కడి రోగులకు చికిత్స చేయించాలి."

## ప్రాథమిక వైద్య కేంద్రాలు

ప్రథమ చికిత్స కోసం కూడ కేంద్రాలు ఉండేవి. అవి జామె మస్జిద్‌లలో అత్యధిక జనం ఉండే ప్రాంతాల్లో ఉండేవి.

మఖ్‌రేజీ ఇలా వ్రాస్తారు : "ఇబ్నె తూలూన్ ఈజిప్టులో ప్రఖ్యాత జామె మస్జిద్‌ని నిర్మించిన తర్వాత దాని చివరి భాగంలో ఒక ఉజూఖాన, ఒక డిస్పెన్సరీ ఏర్పాటు చేశాడు. అందులో అన్ని రకాల మందులు ఉండేవి. ఉద్యోగులు ఉండేవారు, ప్రతి శుక్రవారం అక్కడ ఓ డాక్టరు డ్యూటీ చేస్తూ ఉంటాడు. నమాజీలలో ఎవరికైనా అకస్మాత్తుగా ఏదయినా బాధ కలిగితే వెంటనే చికిత్స చేస్తాడు."

## సాధారణ ఆస్పత్రులు

కొన్ని సాధారణ ఆస్పత్రులు ఉండేవి. వాటి ద్వారాలు జన సామాన్యానికి సర్వవేళలా తెరవబడి ఉంటాయి. అవి రెండు రకాలు. 1. పురుషుల ఆస్పత్రులు. 2. స్త్రీల ఆస్పత్రులు. ఈ ఆస్పత్రుల్లో అనేక విభాగాలు ఉంటాయి. ఉదాహరణకు :

1. అంతర్గత వ్యాధుల విభాగం 2. నేత్ర విభాగం 3. గాయాల విభాగం 4. విరిగిపోయిన ఎముకలు జోడించే విభాగం 5. మనోవ్యాధుల విభాగం.

అంతర్గత విభాగానికి మరికొన్ని అనుబంధ విభాగాలు కూడా ఉన్నాయి. ఉదాహరణకు 1. జ్వర విభాగం 2. కడుపు అజీర్తి విభాగం వగైరా.

ఈ ఆస్పత్రులలో ప్రతీ విభాగానికి ఒక ఇన్‌చార్జ్, ఒక అధ్యక్షుడు, ప్రతి విభాగానికి వేర్వేరు నిపుణులు ఉండేవారు. అతడ్ని "సాఊర్" అనేవారు. డాక్టర్లు నిర్ణీత వేళల్లో వారు తమ విభాగాల్లో కూర్చుని రోగుల్ని పరీక్షించేవారు.

ప్రతీ ఆస్పత్రిలో డ్రగ్గిస్టులు, నర్సులు మొదలగు చిన్న తరగతి ఉద్యోగులు కూడా ఉండేవారు. వీరే కాకుండ మెడికల్ అసిస్టెంటులు కూడ ఉండేవారు. ఈ ఉద్యోగులకు నిర్ణీత వేతనాలు ఇవ్వబడేవి. ప్రతీ ఆస్పత్రిలో ఒక మందుల షాపు ఉండేది. దానిని "ఔషధ భాండాగారం" అని పిలిచేవారు. అందులో అనేక రకాల ఔషధాలు, అత్యుత్తమ ధాతువృద్ధి కారకములు, బలవర్థక లేహ్యాలు ఉండేవి. ఇవే కాకుండ పుష్టికరములయిన మందులు, కాచివడబోసిన ఉత్తమ శ్రేణి ద్రవాలు ఉండేవి. ఇవి కేవలం ఆస్పత్రుల్లోనే లభించేవి. ఇంక అతి సున్నితమైన శస్త్ర చికిత్స పరికరాలు, గాజు పాత్రలు, కేవలం పాదుషాల భవనాల్లో ఉపయోగించే పాత్రలవంటి వివిధ రకాల పాత్రలు ఈ ఆస్పత్రుల్లో ఉండేవి.

ఈ ఆస్పత్రులు మెడికల్ కాలేజీలవలె కూడా ఉపయోగించబడేవి. ప్రతీ ఆస్పత్రిలో ఓ పెద్ద హాలు ఉండేది. అందులో వైద్య శాస్త్రం గురించి ఉపన్యాసాలు ఇవ్వబడేవి. వైద్యాధికారి, సాధారణ వైద్యులు, విద్యార్థులు అక్కడ సమావేశమయ్యేవారు. అక్కడ అన్ని రకాల గ్రంథాలు, విభిన్న పరికరాలు ఉండేవి. రోగులను పరీక్షించి, చికిత్స చేసిన తర్వాత విద్యార్థులు ఉపాధ్యాయుల మధ్య వైద్య విషయాలపై చర్చలు జరిగేవి.

ఉత్తమ గ్రంథాల బోధన జరుగుతూ ఉండేది. ఈనాటి మెడికల్ విద్యార్థులతో ప్రాక్టీసు చేయించే విధంగా ఆనాడు కూడా అధ్యక్షుడు అధ్యాపకులు, ఆస్పత్రులలో విద్యార్థులచేత ప్రాక్టీసు చేయించేవారు.

డెమాస్కస్‌లోని నూరీ ఆస్పత్రిలో వైద్య విద్యనభ్యసించిన ఇబ్నె అస్లీబ ఇలా వ్రాస్తున్నాడు :

"హకీం ముహజ్జిబుద్దీన్, హకీం ఇమ్రాన్ ఆస్పత్రిలో రోగుల్ని పరీక్షించి, చికిత్స చేసిన తర్వాత నేను వారి వెంట ఉండేవాడ్ని. నేను షేక్ రజీయుద్దీన్ రజయి వద్ద కూర్చుండేవాణ్ణి. రోగుల జబ్బుల్ని పరీక్షించే తీరు, ఆధారాలతో రోగ నిర్ణయం చేసే పద్ధతిని చూస్తూ ఉండేవాణ్ణి. రోగాలకు సంబంధించిన విషయాలు, వాటి మందులు, కొన్ని ప్రత్యేక రోగాలు, వాటికి నిర్ణయించిన ఔషధాల గురించి నేను వారితో చర్చించేవాణ్ణి కూడా."

## యోగ్యతా పత్రం పొందిన విద్యార్థులకే చికిత్స చేసేందుకు అనుమతి

ప్రతి వ్యక్తికి స్వయంగా ప్రాక్టీసు చేసేందుకు అనుమతి ఉండేది కాదు. ప్రభుత్వ వైద్యాధికారి ముందు అతడ్ని పరీక్షించేవాడు. ఏ శాస్త్ర కళలో సర్టిఫికెట్ పొందాలనుకుంటాడో అందులో అతడు వ్యాసం వ్రాయవలసి ఉండేది. ఆ వ్యాసం అతను స్వయంగా వ్రాసినా లేక ఇంకో విద్యార్థి వ్రాసినా అతడు దానిపై తన నోట్సు, సమీక్ష వ్రాసి సమర్పించేవాడు, ఆ తరువాత వైద్యాధికారి ఆ విద్యార్థిని వివిధ కోణాల నుంచి విపులంగా ఇంటర్వ్యూ చేసేవాడు. ఒకవేళ ఆ విద్యార్థి అన్ని అంశాల్లో తృప్తికరమయిన సమాధానాలు ఇస్తే అప్పుడతనికి ప్రాక్టీసు చేసుకోవడానికి వైద్యాధికారి అనుమతించేవాడు.

హి.శ. 399 లో (అంటే క్రీ.శ. 931లో) జరిగిన ఓ సంఘటన. ఖలీఫా ముఖ్తదర్ బిల్లా కాలంలో ఓ డాక్టరు రోగికి తప్పుడు చికిత్స చేయగా ఆ రోగి మరణించాడు. అప్పుడు ఖలీఫా బగ్దాద్‌లోని డాక్టర్లందరిని మళ్ళీ పరీక్షించాలని ఆజ్ఞలు జారీ చేశాడు. అప్పుడు ప్రభుత్వ వైద్యాధికారి సనాన్ బిన్ సాబిత్ డాక్టర్లందర్ని పరీక్షించాడు. ఆ సమయంలో ఒక్క బగ్దాదులోనే 860 మంది డాక్టర్లు ఉన్నట్లు తేలింది. వీరు కాకుండా పాత డాక్టర్లు, తమ శాస్త్ర కళల్లో ప్రసిద్ధిగాంచి ఉండేవారు. అమీర్లు, మంత్రులు, ఖలీఫాల కోసం ప్రత్యేక డాక్టర్లు వేరే ఉన్నారు. వారిని పరీక్షించే అవసరం లేదు.

## ఉచిత చికిత్సాలయాలు

ఆనాటి ఆస్పత్రుల్లో ఎలాంటి ఫీజులుగాని, ఖర్చులుగాని తీసుకోబడేవి కావు. పేదలు-ధనికులు, దేశీయులు-విదేశీయులు, సామాన్యులు-ప్రముఖులు అన్న భేదభావాలుండేవి కావు. ఆస్పత్రిలోని ఔటుపేషెంటు విభాగంలో రోగిని సోదాహరణంగా పరీక్షించేవారు. ఒకవేళ జబ్బు అల్పమయినదయితే మందులు ఇచ్చి ఇంటికి పంపేవారు.

ఎవరినైనా ఆస్పత్రిలో చేర్చుకోవల్సివస్తే అతని పేరు నోటు చేసుకుని అతణ్ణి స్నానాల గదిలోకి పంపి, అతడు ధరించిన దుస్తుల్ని విప్పివేసి ప్రత్యేకమయిన స్టోరులో పెట్టేవారు. వేరే దుస్తులతో అతడ్ని ప్రత్యేకమైన వార్డులోకి పంపించేవారు. అతని కోసం పరిశుభ్రమైన పరుపు మంచం ఏర్పాటు చేసేవారు. ఇక డాక్టరు ఇచ్చిన సలహా ప్రకారం మందులు ఇవ్వడం ప్రారంభమయ్యేది. అతని ఆరోగ్యానికి కావలసిన మంచి ఆహారం ఇవ్వబడేది. ఆహార ప్రమాణం కూడా నిర్ణయించబడేది. రోగులకు మేక మాంసం, గోమాంసం, కోడి, ఇతర పక్షుల మాంసం ఇవ్వబడేది.

రోగి ఒక మనిషికి నిర్ణయించబడేటంత రొట్టె, ఒక కోడిని ఒకేసారి బుజించి జీర్ణించుకుంటే అతడు ఆరోగ్యవంతుడయ్యాడని భావించబడేది. జబ్బు నయమయిన తర్వాత కూడా బలహీనంగా ఉంటే అతడ్ని బలహీన రోగుల వార్డులోకి బదిలీ చేసేవారు. అన్ని విధాల చికిత్స పూర్తి అయిన తర్వాత అతనికి క్రొత్త దుస్తులు ఇవ్వబడేవి. దానితో పాటు స్వయం ఉపాధి మార్గాలు ఏర్పాటు చేసుకోవడానికి తగినంత ధనం కూడా అతనికి ఇవ్వబడేది.

ఆస్పత్రిలోని అన్ని గదులు ఎంతో శుభ్రంగా ఉండేవి. ప్రతి ఆస్పత్రిలో ఆరోగ్యం, పరిశుభ్రతల పరిరక్షణ కోసం హెల్త్ ఇన్స్పెక్టర్ నియమితులయి ఉండేవారు. కొన్ని సమయాలలో స్వయంగా ఖలీఫా రోగులను పరీక్షించి వారి విషయంలో శ్రద్ధాసక్తులు చూపేవాడు.

## నూరీ ఆస్పత్రి, డెమాస్కస్

సుల్తాన్ ఆదిల్ మలిక్ నూరుద్దీన్ షహీద్ ఒక విదేశీ, ఒక పాదుషా నుండి వసూలు చేసిన ఫిద్యా ధనంతో క్రీ.శ. 1154లో ఈ ఆస్పత్రిని నిర్మించాడు. ఆ కాలంలో ఇస్లామీయ ప్రపంచంలోని అన్ని ఆస్పత్రుల కంటే అదే అత్యంత గొప్పది, అందమైనది. ఆయన ఈ ఆస్పత్రిలో ధనికులు, అధికారుల ప్రవేశాన్ని నిషేధించాడు, దాన్ని పేదల కోసం ప్రత్యేకించాడు. అనివార్య పరిస్థితుల్లో మాత్రమే ఇతరులకు ఇక్కడ మందులు ఇవ్వబడేవి.

పర్యాటకుడైన ఇబ్నె జుబైర్ హిజ్రీ శకం 580లో ఈ ఆస్పత్రిని సందర్శించాడు. ఇక్కడ డాక్టర్లు అన్ని రకాల సౌకర్యాలను చూసి ఎంతో శ్లాఘించాడు. ఇక్కడ మెదడుకు సంబంధించిన రోగులకు ప్రత్యేక వార్డు ఏర్పాటు చేయబడింది. వారి చికిత్స, ఆహార పదార్థాల పట్ల తగు జాగ్రత్తలు తీసుకోబడేవి.

హి.శ. 831లో విద్యాధికుడు జిజ్ఞాసి అయిన ఓ విదేశీయుడు డెమాస్కస్ వచ్చాడు. ఈ ఆస్పత్రిని చూశాడు. డాక్టర్లు అధిక సంఖ్యను రోగుల పట్ల వారికున్న వాత్సల్యం, శ్రద్ధాసక్తుల్ని చూసి అమితాశ్చర్యం పొందాడు.

అతడు డాక్టర్లను పరీక్షిందుకు ఓ రోగిలా నటించి ఆస్పత్రిలో చేరాడు. అతి విలువైన ఆహారం నిర్ణయించాడు. బలిసిన తాజా కోడి, హల్వా, బలవర్ధక లేహ్యాలు, రకరకాల ఫలాలు వరుసగా మూడు రోజుల వరకు అతనికి ఆస్పత్రి నుండి సరఫరా చేయబడ్డాయి. మూడు రోజుల తర్వాత ప్రధాన వైద్యుడు అతని పేర: "అతిథి సత్కారం మూడు రోజుల వరకే చేయడం మా రివాజు." దాంతో ఆ విదేశీయుడు డాక్టర్లు తన ఉద్దేశ్యాన్ని కనిపెట్టేశారని గ్రహించాడు.

ఈ ఆస్పత్రి హి.శ. 1317 వరకు అలాగే పనిచేసింది. ఆ తర్వాత దాన్ని విదేశీయుల ఆస్పత్రిగా మార్చడం జరిగింది. ఆ నాటి ఆస్పత్రిని మూసివేసి ఈనాడు నూరియా విశ్వవిద్యాలయం మెడికల్ కాలేజీ ఇంకా అందులో ఒక పాఠశాల నడుస్తున్నాయి.

ఇది "బీమారిస్తాన్ ఖలాదూన్" అనే పేరుతో ప్రఖ్యాతిగాంచింది. పూర్వం ఇది ఓ ధనికుడి భవంతి. మలిక్ మన్సూర్, సైఫుద్దీన్ ఖలాదూన్ దానిని క్రీ.శ. 1284లో ఆస్పత్రిగా మార్చివేశాడు. దాని కోసం ప్రత్యేకమైన ఓ వఖ్ఫ్ ఆస్తి కేటాయించబడింది. దానిద్వారా సంవత్సరాదాయం వేయి దిర్‌హమ్‌లు వచ్చేవి. ఆస్పత్రితో పాటు ఒక మస్జిద్, ఒక పాఠశాల, అనాథల కోసం ఓ గ్రంథాలయం కూడా ఆ ఆదాయంతో నడిచేవి.

క్రీ.శ. 1275లో అమీర్ ఖలాదూన్ జాహిర్ బేబ్రస్ రోమ్‌లో యుద్ధం చేయడానికి సైన్యాధిపతిగా వెళ్ళినప్పుడు డెమాస్కస్‌లో జబ్బుపడ్డాడు. డాక్టర్లు ఆయన చికిత్సకు కావల్సిన మందులు నూరీ ఆస్పత్రి నుండి ఇవ్వగా ఆయన ఆరోగ్యవంతు లయ్యారు. ఆ తరువాత ఆయన నూరీ ఆస్పత్రిని పరిశీలించి ఎంతో ప్రభావితు లయ్యారు. "ఒకవేళ దేవుడు నాకు రాజ్యాధికారం ప్రసాదిస్తే ఇలాంటి ఆస్పత్రినే నిర్మిస్తానని మొక్కుకున్నారు. అన్నట్లే ఆయన రాజ్యాధినేత ఆ ఆస్పత్రిని చూసి ఆయన అయ్యాక ఓ భవంతిని ఎంపికచేసి, దానిని కొని ఆస్పత్రిగా మార్చివేశారు.

ఆనాడు ఆ ఆస్పత్రి క్రమశిక్షణలో యావత్ ప్రపంచంలో ప్రసిద్ధిగాంచింది. పేద, ధనికుడన్న తారతమ్యం లేకుండా అందరికీ అందులో ప్రవేశం ఉంటుంది. ఇక్కడి నుండి ఆరోగ్యవంతుడై వెళ్ళిపోయే రోగికి దుస్తులు ఇవ్వబడేవి. మరణించిన వారిని ఖననం చేయడానికి అయ్యే ఖర్చులన్నీ ఆస్పత్రి భరించేది. వైద్యంలో విభిన్న శాఖలకు వేర్వేరు డాక్టర్లు నియుక్తులై ఉండేవారు. రోగుల దుస్తులు ఉతకడానికి, స్నానం చేయించడానికి, గదులు, పరుపులు శుభ్రం చేసి రకరకాల సౌకర్యాలు కలుగజేయడానికి సేవకులు, నర్సులు నియమించద్దారు. విభిన్న రోగులకు వేర్వేరు వార్డులు ఉండేవి. వైద్య రంగానికి సంబంధించిన చర్చలు, ప్రసంగాల కోసం నిర్ణీత స్థలాలు ఉండేవి. ఈ ఆస్పత్రికి గల ఇంకో ప్రత్యేకత ఏమంటే కేవలం ఈ ఆస్పత్రిలో చేరిన రోగులకే సేవ చేయడం కాకుండా తమ ఇళ్ళల్లోనే ఉండి చికిత్స చేయించు కోవాలనుకునే రోగులకు కూడా సేవలు అందించబడేవి.

ఆ ఆస్పత్రిలో పనిచేసే ఓ కంటి డాక్టరు ఇలా ప్రస్తావించారు : "ప్రతిరోజు ఈ ఆస్పత్రిలో లోపలి, బయటి రోగుల్ని కలిపితే 4 వేలకు పైగా జనాల చికిత్స చేయబడేది. ఆరోగ్యం పొందిన వ్యక్తికి దుస్తులు మాత్రమే కాకుండా బయటకు వెళ్ళి ఇతరుల మీద ఆధారపడకుండా ఉండేందుకు తగినంత డబ్బు కూడా ఇవ్వబడేది."

ఈ ఆస్పత్రి వఖ్ఫ్ దస్తావేజుల్ని పరిశీలిస్తే తెలిసేదేమంటే అక్కడ రోగికి ప్రత్యేకమైన పాత్రలో ఆహారం ఇవ్వబడేది. ఆ పాత్రను ఇంకో రోగికి ఉపయోగించేవారు కాదు. మూత ఉన్న పాత్రలో మాత్రమే ఆహారం ఇవ్వాలని నియమం ఉండేది. అంతేకాదు, ఈ ఆస్పత్రికిగల ప్రత్యేకత ఏమంటే నిద్రరాని రోగుల కోసం వేరే జాగా ఉండేది. అక్కడ వీనుల విందు గొలిపే సంగీతం, వింత వింత కథలు వినిపించబడేవి. బలహీనంగా ఉన్న రోగులకు ఉల్లాసం కలుగజేయడానికి హాస్య నటన చేస్తూ వారిని నవ్విస్తూ ఉండేవారు. క్రీ.శ. 1798లో ఫ్రెంచివారు ఈజిప్టులో ప్రవేశించే వరకు ఆ ఆస్పత్రి స్థితి అలాగే ఉండింది. దానిని కొందరు ఫ్రెంచి పండితులు ప్రత్యక్షంగా చూసి, "దైవసాక్షి! ఇది మానవ సేవకు మహోన్నతమైన ప్రమాణం" అని ప్రశంసిస్తూ తమ గ్రంథాల్లో వ్రాసుకున్నారు.

## మన్సూరీ ఆస్పత్రి వఖ్ఫ్ నామా

మన్సూరీ ఆస్పత్రి వఖ్ఫ్ నామాలోని పూర్తి పాఠాన్ని పాఠకుల ముందుంచడం ఆవశ్యమని భావిస్తున్నాము. "తారీఖ్ బీమారిస్తాన్ ఫిల్ ఇస్లాం" రచయిత ఇలా వ్రాశారు :

"ఏ మహోన్నత సత్కార్యాలు, సంక్షేమ పనుల ద్వారా అయితే అత్యంత ప్రయోజనం, అమిత పుణ్యఫలం లభించే అవకాశం ఉందో, అవి నిజానికి అత్యధిక జనాలకు లాభం చేకూర్చగలిగే శాశ్వత సంక్షేమ కార్యాలే. ఎంతో దూరదృష్టితో కూడుకొని, భక్తిపరాయణత్వాల యొక్క పటిష్టవంతమయిన పునాదులపై నిర్మించబడే కార్యాలే. ఇలాంటి సంక్షేమ కార్యాలు వఖ్ఫ్‌లు మాత్రమే.

వాటి సేవలు అందరికీ లభిస్తాయి. ఆ సత్కార్యాలకు లభించే పుణ్యఫలం కూడా శాశ్వతమయినదే. వాటి ప్రయోజనాలు అనూహ్యమైనవి, వాటి అంతిమ దిన ప్రతిఫలం అమూల్యమైనదే. ఈ త్యాగం సత్కార్యాలే స్వర్గం, దేవుని ప్రసన్నతను చేకూరుస్తాయి. అవి పరలోక బహుమానాల మహా సాగరాలు. నిస్సహాయుడయి నిరాశ నిస్పృహలు కలిగిన ఓ రోగికి చికిత్స చేసి స్వస్థత చేకూరిస్తే ఆ పుణ్యం చేసిన వ్యక్తి మనస్సులో ఎన్నెన్ని వసంతాలు చిగురిస్తాయో! ఆ సంక్షేమ కార్యంవల్ల లభించే పుణ్యఫలం ఎంత అమూల్యమైనదో కొంచెం ఆలోచించండి!!!

అపార కృపాశీలుడయిన తన దేవుని పట్ల ఇంతగా విధేయత చూపిన వ్యక్తి

ఎంతటి అదృష్టవంతుడు! సర్వజ్ఞుడైన దేవుని ప్రసన్నత కోసం తన ఆదాయాన్నంతా ఖర్చుచేశాడు. తన శక్తి, సామర్థ్యాలనుసారం వడ్డీలేని రుణం ఇచ్చాడు. సత్కార్యాల్లో అందరికంటే ముందుకు పోవాలన్న ఆశయాన్ని అదృష్టంగా భావించాడు. ఒక రోగి చికిత్సలో సహకరించి అతని దుఃఖబాధలను దూరం చేశాడు. అందుకు బదులుగా రేపు విశ్వప్రభువు సమక్షంలో తనకు నరకం నుండి విముక్తి లభిస్తుంది. దేవుని వద్ద తనకు అత్యున్నత స్థానాలు ప్రాప్తిస్తాయి. తనకు దేవుని సామీప్యం లభిస్తుందని ఇక అక్కడ తనకు ఎలాంటి పీడన భీతి ఉండబోదనే ఆశ ఉంటుంది. సమస్త పాపాల్ని ప్రక్షాళనం చేసివేసే మహా పుణ్యకార్యమది." అందువల్ల ఆ మహాకార్యం ద్వారా ఉన్నత స్థానాల్ని పొందే మహదాశయంతో మలిక్ ఆదిల్ మన్సూర్, మన్సూరీ ఆస్పత్రిని వఖ్ఫ్ చేశాడు.

మన్సూరీ ఆసుపత్రి వఖ్ఫ్‌నామా ప్రకారం వఖ్ఫ్ అధికారి వఖ్ఫ్ ఆదాయంలో నుండి నమ్మకస్తులయిన ఇద్దరు ముస్లింలను నియమిస్తాడు. వారిలో ఒకరు మొత్తం వస్తుసామగ్రికి బాధ్యత వహిస్తూ ఔషధాలు, మూలికలు, లేహ్యాలు, నూనె సంబంధిత అధికారి అనుమతి ప్రకారం రోగులకు పంచాలి. రెండవ వ్యక్తి ప్రతి ఉదయం, సాయంకాలం రోగికి ప్రత్యేకించబడ్డ మందులు ఇవ్వాలి. ఆహార పదార్థాలను మూత కప్పి రోగుల వద్దకు చేర్చడం కూడా ఆ వ్యక్తి బాధ్యత.

వఖ్ఫ్ అధికారికి ఆసుపత్రికి అవసరమైన సాధారణ డాక్టర్లు, నేత్రవైద్యులు, అవయవ నిపుణులకు తగినంత వేతనాలు ఇచ్చి నియమించడానికి అధికారముంది. పరిస్థితుల్ని బట్టి రోగుల అవసరాల నిమిత్తం ఉపకార వేతనాలు ఏర్పాటు చేయడానికి కూడా అతనికి అధికారముంది. అతడు రోగులందరి పట్ల సమానతను ఖచ్చితంగా పాటించాల్సి ఉంటుంది. ఆసుపత్రి ఉద్యోగులు రోగుల పరిస్థితిని అడిగి తెలుసుకోవాలి. జబ్బు తగ్గిందా లేక ఎక్కువయినదా, రోగికి మందులు, ఆహారం ఇవ్వడం అమలు జరుగుతుందా లేదా ప్రతి రోజూ తెలుసుకోవడం వారి బాధ్యత. డాక్టర్లు, ఇతర ఉద్యోగుల పట్ల మృదువుగా ప్రవర్తించాలి. వారు పూర్తిగా ఆరోగ్యవంతులయ్యే వరకు వారిని రక్షిస్తూ ఉండాలి. వఖ్ఫ్ అధికారి వఖ్ఫ్ ఆదాయం నుండి ఒక వైద్యాధికారిని నియమించాలి. ఆ అధికారి వైద్య విషయాలు, వైద్య సమస్యల మీద ఎల్లవేళలా పరిశోధనలు చేస్తూ ఉండాలి. ఆసుపత్రి సిబ్బంది రోగుల కోసం ఆస్పత్రి తరఫున ఏర్పాటు చేయబడ్డ సౌకర్యాలు, సదుపాయాన్ని ఏమాత్రం విస్మరించరాదు.

రోగుల్లో ఎవరయినా మరణిస్తే వారి ఖననానికి కావల్సిన బందోబస్తు చేయడం ఖర్చులు ఇవ్వడం వక్ఫ్ అధికారి విధి. ఎవరైనా తన ఇంట్లో రోగగ్రస్తుడయి, దీనావస్థలో ఉంటే ఆ రోగికి అవసరమైన మందులు ఈ ఆసుపత్రి నుండి అతని ఇంటికి సరఫరా చేయాల్సిన బాధ్యత వక్ఫ్ అధికారి వహించాలి. ఒకవేళ ఆస్పత్రిలో చేరకుండానే రోగి తన ఇంట్లో మరణిస్తే వక్ఫ్ అధికారి అతని ఖనన బాధ్యతను కూడా వహించాలి; ఆ రోగి ఖననానికి అయ్యే ఖర్చులన్నీ ఇచ్చివేయాలి. ఖనన మర్యాదల్లో ఎలాంటి లోపం జరగరాదు.

ఆసుపత్రి అధికారులు ఇతర సిబ్బంది సంపన్న రోగి పట్ల బీద రోగి కంటే అమిత మర్యాదలు చూపరాదు (ఆధునిక సంస్కృతి సుపుత్రులు ఈ వాక్యాన్ని బహు శ్రద్ధాసక్తులతో పరిశీలించాల్సి ఉంది. ఇప్పటికీ వారి వద్ద "ఆఫీసర్స్ వార్డ్"లు ప్రత్యేకంగా ఉన్నాయి. అంతేకాదు, ఈనాడు ఆసుపత్రులు వ్యాపార సంస్థలుగా తయారయ్యాయి. అక్కడ దీనులకు స్థానమెలాగూ ఉండదు) రోగుల మంచిచెడ్డలూ విచారిస్తూ వారి పట్ల సత్ప్రవర్తన కలిగి ఉండడంలో, వారి కోసం ఖర్చు చేయడంలో అమిత పుణ్యఫలం, దేవుని ప్రసన్నతను పొందే భావం కలిగి ఉండాలి. ఎందుకంటే దేవుడు సర్వ మానవులకు ప్రభువు.

## మొరాకో ఆసుపత్రి

దీన్ని సుల్తాన్ మన్సూర్ అబూ యూసుఫ్ నిర్మించారు. ఈయన ఈ ఆసుపత్రి కోసం మొరాకోలో సమశీతోష్ణం గల ప్రాంతంలో సువిశాలమైన మైదానాన్ని ఎంపిక చేశాడు. దీన్ని సాధ్యమైనంత వరకు అత్యంత సుందరమైన డిజైనులో రూపొందించాలని ఆజ్ఞలు జారీ చేశాడు. అందులో అన్ని రకాల ఫలవృక్షాలు, సుగంధ పరిమళ పుష్పాల మొక్కలు నాటాలని కూడా ఆజ్ఞాపించాడు. అందుకు ఆ ఆసుపత్రి భవన సముదాయంలోని అన్ని గదుల్లోకి నీరు ప్రవహించేందుకు కాల్వల్ని ఏర్పాటు చేశారు. ప్రత్యేకంగా 4 హౌజులు నిర్మించబడ్డాయి. వాటిలో ఒకదాన్ని పాలరాతితో తయారు చేయించారు. ఆ ఆసుపత్రిలో ఉన్ని, దూది, పట్టు, చర్మంతో కుట్టబడిన చక్కని పరుపులు ఏర్పాటు చేయబడ్డాయి.

ఈ ఆసుపత్రిలో ఔషధాలు తయారు చేయడానికి ఓ పెద్ద హాలు నిర్మించ బడింది. అందులో వివిధ రకాల షర్బత్‌లు, నూనెలు, కంటిమందులు తయారవుతూ ఉండేవి. రోగులకు వేసవి, శీతాకాలాల్లో పగలు, రాత్రి ధరించడానికి

వేర్వేరు దుస్తులు సరఫరా చేయబడేవి. రోగి ఆరోగ్యవంతుడై, ఒకవేళ అతడు నిరుపేద అయితే ఆసుపత్రి నుండి డిశ్చార్జి చేయబడినప్పుడు వ్యాపారం చేసుకోడానికి అతనికి తగినంత ధన సహాయం చేయబడేది. ఈ ఆసుపత్రి ద్వారా పేదలు, ధనికులు అన్న భేదం లేకుండా అందరూ ప్రయోజనం పొందేవారు. అంతేకాదు మొరాకోలోని ఏ ప్రాంతంలోనైనా ఎవరైనా అనాథ వ్యాధిగ్రస్తుడయితే అతణ్ణి తీసుకొచ్చి ఈ ఆసుపత్రిలో చేర్చేవారు. సుల్తాన్ స్వయంగా ప్రతి శుక్రవారం ఆసుపత్రిని సందర్శించేవారు. రోగుల స్థితిగతుల్ని, డాక్టర్ల పనితీరును, రోగుల పట్ల డాక్టర్లు, నర్సుల ప్రవర్తన మొదలైన విషయాల్ని తెలుసుకొని తగు ఏర్పాట్లు చేస్తుండేవారు.

నిజానికి ఆనాడు ఇస్లామీయ ప్రపంచంలో వ్యాపించి ఉన్న వందలాది ఆసుపత్రుల్లో ఇక్కడ కొన్నిటిని మాత్రమే చర్చించడం జరిగింది.

## వైద్య సంస్థలు

దాదాపు 3 వందల సంవత్సరాల క్రితం, ఆస్పత్రి అంటే అర్థమేమిటో ఐరోపాకు తెలియదు. క్రీ.శ. 1710 వరకు కూడా దాని పరిస్థితిలానే ఉండిందంటే అతిశయోక్తి కాదు. రోగులకు చికిత్స వారి ఇళ్ళల్లో గాని లేక పేదలు నివసించే ప్రాంతాల్లోగాని జరిగేది. అనాథ శరణాలయాల్లో రోగులున్నా లేకపోయినా నిరాశ్రయులు, వికలాంగులు జబ్బు ఉన్నా లేకపోయినా నివసిస్తూ ఉండేవారు.

ఐరోపా ఆస్పత్రులు అనాథ శరణాలయాలని పారిస్‌లోని "ఔతిల్ దేవ్"ను ఓ చక్కని ఉదాహరణగా తీసుకోవచ్చు. ఆనాడు అది అన్నింటికంటే చాలా పెద్ద ఆసుపత్రి అని చెప్పబడేది. మాక్సిటూర్‌డర్, ట్యూనూన్ అనే ఇద్దరు ఆ ఆసుపత్రి స్థితిగతుల గురించి ఇలా వ్రాశారు :

"ఈ ఆస్పత్రిలో 1200 పడకలు ఉన్నాయి. వాటిలో 486 పడకలు మాత్రమే ఒక్కోటి ఒక్కో రోగికి చొప్పున కేటాయించబడ్డాయి. మిగిలిన పడకల మీద సాధారణంగా 3 నుండి 6 గురు రోగుల వరకు పడుకోబెట్టేవారు. ఆ భవనంలోని గదులు అపరిశుభ్రంగా ఉండి, దుర్వాసన కొడుతూ గాలి, వెలుతురు రాని చీకటి కొట్లుగా ఉండేవి. అందులో ఎల్లప్పుడు 800 మందికి పైగా రోగులు నేల మీదే పడి ఉండేవారు. చోటు కూడా చాలా ఇరుకుగా ఉండేది. అందువల్ల ఒకరిమీద ఒకరు కటిక నేలపై కడు దీనావస్థలో పడుకొని ఉండేవారు. వారి దైన్య స్థితిని చూసి

మానవ హృదయం ద్రవించిపోయేది. ఒక చిన్న పడకమీద ఏకకాలంలో అయిదారు మంది రోగులు ఒకరిమీద ఒకరు పడి ఉండేవారు. ఒకరి కాలు ఒకరి తల మీద పడి ఉండేది. పిల్లలు, వృద్ధుల ప్రక్కన, స్త్రీలు పురుషుల ప్రక్కన పడి ఉండేవారు. మానవ మస్తిష్కం ఈ తీరును అంగీకరించజాలదు. కాని ఇది వాస్తవం. ఒకవైపు ఒక స్త్రీ తన రుతుకాలాన్ని గడుపుతూ పడి ఉంటే ఆమె ప్రక్కనే ఒక బాలుడు టైఫాయిడ్ జ్వరంతో వణికిపోతూ నిస్పృహతో పడి ఉంటాడు. ఇక వీరిద్దరు ఒక చర్మరోగి ప్రక్కనే పడి ఉంటారు. అతడు క్రుళ్ళిపోయిన తన చర్మాన్ని రక్తసిక్తమైన గోళ్ళతో గోకుతూ ఉంటాడు. దానివల్ల చీము పడక మీద కారుతూ ఉంటుంది. రోగులకిచ్చే ఆహారం విషయానికొస్తే ఎంత చెడు ఆహారమని మనం భావించగలమో అలాంటి ఆహారమే వారికి ఇవ్వబడుతుండేది. అది కూడ చాలా పరిమితంగా లభించేది. పైగా ఆకలి సమయం గడిచిపోయిన తర్వాత గాని ఇవ్వబడేది కాదు.

ఇస్లామీయ సంస్కృతి ప్రగతి శిఖరాల్ని అందుకుంటున్న తరుణంలో పాశ్చాత్య జాతులు వైద్యరంగంలో ఎంత వెనుకబడి ఉన్నారో వివరిస్తూ, సుప్రసిద్ధ హకీం ఉసామ బిన్ మున్‌ఖిజ్ తన గ్రంథం "అల్ ఎతేబార్"లో రెండు సంఘటనల్ని ఇలా ఉల్లేఖించారు :

"మునేత్రాలోని ఓ పెద్ద మనిషి తన మిత్రులకు చికిత్స చేయడానికి డాక్టరు కావాలని మా బాబాయికి లేఖ వ్రాశాడు. మా బాబాయి సాబిత్ అనే ఓ క్రైస్తవ డాక్టర్ని అతని వద్దకు పంపించారు. ఆ డాక్టరు పది రోజుల్లోనే తిరిగి వచ్చేశారు. 'ఇంత తొందరగా రోగులకు చికిత్స చేశావా?' అని మేము అడిగాము. అందుకతను ఇలా సమాధానమిచ్చాడు, 'అతడు నా వద్దకు ఓ సైనికుడ్ని పంపించాడు. అతని కాలుకు పెద్ద వ్రణం ఉంది, దానికి 'లుంజర్' (ఒక వృక్షం) పట్టి కట్టాను. అది పగిలిపోయింది. ఇంకో స్త్రీకి చర్మ వ్యాధి ఉంది. నేను ఆమెకు పత్యం పెట్టించాను. ఆమె ఆరోగ్యం చక్కగా కుదుటపడుతూ ఉంది.

కాని హఠాత్తుగా ఓ ఆంగ్లేయ డాక్టరు అక్కడికి వచ్చాడు. వీళ్ళకు చికిత్స చేయడం ఇతనికేమి తెలుసని నా గురించి వాళ్ళకు చెప్పాడు. తర్వాత సిపాయితో రెండు కాళ్ళతో బాటు మృత్యువు కావాలా? లేక ఒక కాలుతో జీవించదలిచారా? అని అడిగాడు. ఒక కాలుతోనే జీవించదలిచానని సిపాయి సమాధానమిచ్చాడు. అది విని అతడు బలిష్టుడయిన ఓ సైనికుడ్ని, పదునయిన ఓ గొడ్డల్ని తీసుకురమ్మని

ఆజ్ఞాపించాడు. సైనికుడు వచ్చాడు. గొడ్డలి తేబడ్డది. నేను ఇదంతా చూస్తూనే ఉన్నాను. అతడు ఆ సిపాయి కాలును గొడ్డలితో ఒకే వ్రేటుతో నరికి పారేయమన్నాడు. అతడు ఒక వ్రేటు వేశాడు. అది తెగలేదు. కాబట్టి అతను రెండోసారి చాలా బలంగా వ్రేటు వేశాడు. అంతే, కాలు తెగి లోపల నుండి మూలగ వెలుపలికి వచ్చింది. మరుక్షణమే రోగి ప్రాణం అనంత వాయువులో కలిసిపోయింది."

తర్వాత డాక్టర్ ఆ స్త్రీ మీద ఎలా సల సల మరిగే నీళ్ళు క్రుమ్మరించాడో, దాని వల్ల పాపం ఆమె గిలగిల కొట్టుకొని ఎలా ప్రాణం విడిచిందో రచయిత చాలా విపులంగా వివరించాడు.

# గ్రంథాలయాలు

ఇస్లామీయ సంస్కృతిలో ప్రజా సంక్షేమ సంస్థలతో పాటు గ్రంథాలయాల్ని గురించి కూడా ప్రస్తావించడం సమంజసంగా ఉంటుంది. విద్య నార్జించడానికి ఆనాడు అసంఖ్యాక పాఠశాలలే కాకుండా ఎన్నో ఇతర విద్యా సంస్థలుండేవి. వాటికి అయ్యే ఖర్చులన్నీ విద్వాంసులు, అమీర్లు, పలుకుబడి కలవాళ్ళు భరిస్తూ ఉండేవారు.

ముఖ్యంగా ఈనాడున్నట్లు ప్రచార, ప్రచురణలు ఉండేవి కావు. పుస్తకాలు ప్రత్యేక వ్యక్తుల ద్వారా చేతితో వ్రాయబడేవి. ఒక పుస్తకం వ్రాయడానికి ఎంత సమయం, ధనం వ్యయమయ్యేదంటే ఆ పుస్తకాల్ని ఓ సామాన్య విద్యార్థి లేక ఓ పేద ధర్మవేత్త కొనలేకపోయేవాడు. ఇక శాస్త్ర కళకు సంబంధించిన అనేక పుస్తకాలుండే ఓ గ్రంథాలయాన్ని లేక ఓ పుస్తక భాండాగారాన్ని సమకూర్చడమంటే ఊహకందని విషయం. అయినా గత ఇస్లామీయ సంస్కృతిలో గ్రంథాలయాలు స్థాపించబడ్డాయంటే అందుక్కారణం కేవలం ఇస్లాంలోని మానవతా భావం. విద్యాజ్ఞానం పట్ల దానికున్న ప్రగాఢ మైత్రి సంబంధాలే.

ప్రపంచంలోని ప్రాచీన సాహిత్యాల్లోకెల్లా గ్రంథాల విషయంలో పెట్టుబడిదారు అని చెప్పదగిన ఏకైక సాహిత్యం అరబ్బీ మాత్రమే. ఇక్కడ ప్రతి వ్యక్తీ పుస్తక ప్రియుడిలా కానవస్తాడు. పుస్తకాల గురించే ప్రజలు మాట్లాడుకుంటున్నట్లు అనిపిస్తుంది. పుస్తకాల పట్ల ప్రతీ వ్యక్తి శ్రద్ధాసక్తులు కలిగి ఉండేవాడు. చాలాకాలం తరువాత తన ఇంటికి చాలా దూరం ఉండే మిత్రుడ్ని కలుసుకోవడానికి ఒక వ్యక్తి మనస్సు ఎలా తహ

తహలాడుతుందో గ్రంథాల కోసం ఈ పుస్తక నేస్తం మనస్సు కూడా అలాగే ఆరాటపడుతుండేది.

అందుకే అహ్మద్ బిన్ ఇస్మాయిల్ అంటారు: "రాత్రుల్లో ముచ్చటించే మిత్రుని లాంటిది పుస్తకం. మీరు పఠనంలో నిమగ్నమై ఉన్నప్పుడు అది ఎదురు మాట్లాడి మిమ్మల్ని చికాకు పరచదు. సుఖంగా విశ్రాంతి తీసుకుంటున్నప్పుడు మిమ్మల్ని పిలిచి బాధించదు. మీరు దాన్ని కలుసుకోవాలని అభిలషించినప్పుడు దాని కోసం మీరు అలంకరించుకొని ముస్తాబు కానవసరం లేదు. అది మిమ్మల్ని శృతిమించి ప్రశం సించని శ్రేయోభిలాషి, మిమ్మల్ని మోసం చేయని స్నేహశీలి. అంతేకాదు, మీరు తప్పులు చేయకుండా అది మిమ్మల్ని కాపాడే హితకారిణి కూడా.

## పుస్తకాల పట్ల ఆసక్తి

ముస్లిం సాహితీవేత్తల సభలు, సమావేశాలు జరిపి ప్రజలలో వాదోపవాదాలు చేయడానికి బదులుగా పుస్తక పఠనానికి ప్రాధాన్యతనిచ్చేవారు. ఖలీఫాల, రాజుల సాంగత్యాన్ని కోరే బదులు పుస్తకాలతో సన్నిహిత సంబంధాలు పెంచుకోవడాన్ని అభిలషించేవారు. అవే వారికి ఎంతో తృప్తిని, ప్రశాంతతను ఇచ్చేవి. ముహమ్మద్ బిన్ అబ్దుల్ మలికుజ్జియాత్ సుప్రసిద్ధ సాహితీవేత్త, మంత్రి. ఆయన కొంతకాలం ఏకాంతంగా ఉండగోరి ఇంట్లోనే ఉండిపోయారు. ఓ రోజు జాహిబ్ అనే అతను ఆయన్ను చూడాలనుకున్నాడు. ఒక సుప్రసిద్ధ అరబీ ఇమామ్ వ్రాసిన గ్రంథం ఆయనకు మంచి కానుక అని తలచి దాన్ని ఆయనకు ఇచ్చాడు. మంత్రి ఆ కానుకను సంతోషంగా స్వీకరిస్తూ "దైవం సాక్షి! నాకు ఇంతకంటే ప్రీతికరమైన కానుకను ఇదివరకు ఎవరూ ఇవ్వలేదు" అన్నాడు.

ఒకసారి ఒక ఖలీఫా ఓ ధర్మవేత్తతో సంభాషించడానికి ఆయన్ను రమ్మని కబురు పంపించాడు. వార్తాహరుడు వెళ్ళి చూడగా ఆ ధర్మవేత్త పుస్తక పఠనంలో లీనమై ఉన్నాడు. ఆయన చుట్టూ పెద్ద పెద్ద గ్రంథాలు గుట్టలుగా పడి ఉన్నాయి. "మిమ్మల్ని అమీరుల్ మూమినీన్ రమ్మన్నార"ని చెప్పాడు వార్తాహరుడు. అందుకాయన "నా వద్ద గొప్ప గొప్ప విద్వాంసులు, తత్వవేత్తలు కూర్చొని ఉన్నారు. నేను వారితో మాట్లాడుతున్నానని, వీలు చిక్కగానే వస్తానని చెప్పు" అని అతన్ని పంపించేశారు.

సేవకుడు తిరిగివచ్చి ఆ విషయాన్ని వివరించాడు. అందుకు ఆశ్చర్యపోతూ

"ఇంతకూ ఖలీఫా ఆయనతో మాట్లాడుతున్న ఆ విద్వాంసులు, తత్వవేత్తలు ఎవర"ని అడిగారు. "దేవుని సాక్షిగా చెబుతున్నాను. నేనక్కడ ఎవర్నీ చూడలేదండీ" అన్నాడు సేవకుడు. అది విని ఖలీఫా ఇంకా ఆశ్చర్యపోతూ "ఆయన ఏ పరిస్థితుల్లో ఉన్నాసరే వెంటనే ఇక్కడ హాజరు కావాలని చెప్పు" అంటూ ఆజ్ఞ జారీచేసి సేవకుడ్ని మళ్ళీ పంపించాడు. ఆ ధర్మవేత్త రాగానే ఖలీఫా ఆతురతతో, "మీ వద్ద కూర్చున్న ఆ విద్వాంసులు, తాత్వికులు ఎవరో ముందు చెప్పండి" అని అడిగాడు. అందుకు జవాబుగా ఆయన ఈ కవనం వినిపించారు, దాని భావం ఇలా ఉంది :

"ఎదురుగా ఉన్నా దూరంగా ఉన్నా వారు ఎలాంటి మనస్తాపం కల్గించని విధంగా సంభాషించే మంచి మిత్రులు, నిజాయితీపరులు, విశ్వసించతగినవారు, ఏకాంత సమయంలో కలిసినప్పుడు వారు వినిపించే మాటలు ఎంతో ప్రయోజన కరమైనవి, దుఃఖాన్ని దూరం చెయ్యడంలో తోడ్పడతాయి. వారు తమ జ్ఞానం ద్వారా మాకు ప్రాచీన శాస్త్రాలు బోధిస్తూ ప్రయోజనం కలిగిస్తుంటారు. దాంతోపాటు వారు మాకు బుద్ధీ వివేచనాలు, సభ్యతా సంస్కృతులు కూడా నేర్పుతూ మంచి సలహాలు ఇస్తూ ఉంటారు. (ఓ ఖలీఫా!) వారివల్ల మీకు ఎలాంటి అపాయం లేదు; దుర్నడత భీతి లేదు. వారి చేతులు, నోటి ద్వారా మీకేమైనా నష్టం సంభవిస్తుందనే భయం కూడా లేదు. ఒకవేళ నేను వారు మరణించారని అంటే నేను అసత్యవాదిని కాను. వారు జీవించి ఉన్నారని అన్నా నేను పరిహాసం చేసినవాడ్ని కాలేను."

ధర్మవేత్త వెలిబుచ్చిన ఈ కవితామృతంలోని అంతరార్థం పుస్తకాలేనని ఖలీఫా గ్రహించాడు. అందువల్ల ఆయన కోపం చల్లారింది. పిలిపించిన వెంటనే హాజరు కానందుకు ధర్మవేత్తను మందలించనూలేదు.

సాహెబ్ బిన్ ఆబాద్, నూహ్ బిన్ మన్సూర్ సాసాని దగ్గర అత్యున్నత పదవి స్వీకరించి రాజభవనంలో ఉండడానికి బదులుగా ఓ గ్రంథాలయం ప్రక్కన ఉండేందుకు అమితంగా ఇష్టపడేవారు. ఎందుకంటే ఆయనకు గ్రంథాల పట్ల ఉన్న ఆసక్తి, అనురక్తులు అలాంటివి మరి. అందువల్ల ఆయన గ్రంథాలయాన్ని వదలి ఎక్కడకూ వెళ్ళేవారు కాదు. పైగా దాన్ని తమతో బాటు తీసికెళ్ళే అవకాశం కూడ లేదు. ఏమైనప్పటికీ ఆయన తన గ్రంథాలయాన్ని వదలి వెళ్ళడానికి ససేమిరా ఒప్పుకోలేదు. విద్యాజ్ఞానాల యొక్క ఈ అసాధారణ ప్రభావం మూలానే ఇస్లామీయ

ధర్మవేత్తలు, మేధావులు, అమీర్లు గ్రంథాల పట్ల తమకు గల ప్రగాఢానురక్తిని ప్రదర్శించి వాటిని సేకరించారు. అంతేకాదు, వారు తమ సిరిసంపదలకు, ఇంట్లోని వస్తుసామగ్రికి నష్టం వాటిల్లినా సరే గ్రంథాలకంటే మించినదేది లేదని వాటి ముందు ఆ నష్టం అతి స్వల్పమని భావించేవారు.

## గ్రంథాలు భద్రంగా ఉంటే చాలు

ఓసారి ఒక యుద్ధంలో ఇబ్నె ఉమీద్ ఇంటిపై సైనికులు దాడిచేశారు. వారు ఆయన సేవకుల్ని కాపలాదారుల్ని ఖైదు చేశారు. ఇబ్నె ఉమీద్ తప్పించుకుని దారుల్ అమారకు పారిపోయారు. సైనికులు ఆయన ఇంటిలోని సర్వ వస్తు సామగ్రిని లూటీ చేశారు. ఇబ్నె ఉమీద్ తిరిగి వచ్చి చూడగా ఇంట్లో ఏ ఒక్క వస్తువు లేదు. ఆయన కూర్చోవడానికి ఓ కుర్చీ, చివరికి నీళ్ళు త్రాగడానికి ఓ గ్లాసు కూడా లభించలేదు. అయినా ఆయన ఏమాత్రం బాధ పడలేదు. ఆయనకున్న విచారమంతా తన గ్రంథాలయం గురించే. దానిపై ఉన్న ప్రేమ ఇక దేనిమీదా లేకుండేది. ఆయన గ్రంథాలయంలో అన్ని రకాల శాస్త్రాలు, సాహిత్యం, తత్వజ్ఞానం మొదలైన సమస్త కళలకు సంబంధించిన అసంఖ్యాక గ్రంథాలు ఉండేవి. ఆ గ్రంథాల్ని 100 ఒంటెలైనా ఎంతో ప్రయాసతో మోయగలిగేవి.

ఇబ్నె ఉమీద్ తిరిగి వచ్చిన తరువాత తన గ్రంథాలయ అధికారిని చూడగానే గ్రంథాలయం ఎలా ఉందని అడిగారు. అందుకాయన దాన్ని ఎవరూ ముట్టనే లేదని, అది చెక్కుచెదరకుండా ఉందని అన్నాడు. అది విని ఇబ్నె ఉమీద్ ముఖారవిందం విప్పారింది. ఆనందంతో "నీవు ఎంతో నిజాయితీ, విధేయత గల అధికారివని నేను సాక్ష్యమిస్తున్నాను. పోయిన వస్తు సామగ్రినంతటిని మళ్ళీ సమకూర్చుకోవచ్చు. కాని ఈ నిక్షేపాన్ని అంటే పుస్తక భాండాగారాన్ని బదులు తేవడం సాధ్యం కాదు" అని అధికారితో అన్నారాయన.

## పుస్తక సేకరణ

అత్యంతాసక్తి, జ్ఞాన తృష్ణలతో ప్రజలు పుస్తకాలు సేకరించడంలో ఒకరికొకరు పోటీపడుతుండేవారు. ఇటు రచన పూర్తికాగానే కృతికర్తల నుండి ఆ పుస్తకాల్ని కొనడానికి ఒకరికంటే ఒకరు ముందుకు వచ్చేవారు. ఉదాహరణకు స్పెయిన్ అమీరు అబుల్ ఫర్జ అస్ఫహానీ ప్రఖ్యాత సాహితీ గ్రంథం "అల్ అగాని" వ్రాస్తున్నారని

హకమ్‌కు తెలిసింది. అప్పుడాయన వెయ్యి దీనారులు ఆ గ్రంథానికి వెలగా స్పెయిన్ నుండి పంపిస్తూ ఆ గ్రంథం పూర్తి అవగానే తనకు పంపించమని అన్నారు. అందువల్ల రచయిత స్వదేశమయిన ఇరాక్‌లో కంటే ముందు స్పెయిన్ లాంటి సుదూర దేశంలో ఆ గ్రంథం చదువబడింది.

## గ్రంథాలయాల స్థాపన

సాహిత్యాభిలాష దాని పట్ల గల అనురక్తి కారణంగానే యావత్ ఇస్లామీయ ప్రపంచంలో మూల మూలలా గ్రంథాలయాలు వెలిశాయి. ఆ రోజుల్లో గ్రంథాలయం లేని పాఠశాలలు బహు తక్కువ. గ్రంథాలయం లేని గ్రామం కూడా అరుదే. ఇక పెద్ద పెద్ద పట్టణాలు, రాజధాని నగరాల్లో అసంఖ్యాకంగా గ్రంథాలయాలు, పుస్తక భాండాగారాలు స్థాపించబడడం మధ్య యుగంలో ఊహకందని విషయం.

ఈ గ్రంథాలయాలు రెండు రకాలుగా ఉండేవి. సాధారణ గ్రంథాలయాలు, ప్రధాన గ్రంథాలయాలు. సాధారణ గ్రంథాలయాలు ఖలీఫాలు, అమీర్లు, ధర్మవేత్తలు, ధనికుల తరఫున స్థాపించబడేవి. వాటి కోసం శాశ్వతమైన పక్కా భవనాలు నిర్మించేవారు. కొన్ని సమయాలలో ఇవి పెద్ద పెద్ద మస్జిద్‌లు, పాఠశాలల్లో చేరి ఉండేవి. గ్రంథాలయాల కోసం నిర్మించబడే శాశ్వత భవనాల్లో ఎన్నో గదులు ఉండేవి. ఆ గదులన్నింటినీ కలుపుతూ విశాలమైన హాళ్ళు ఉండేవి. గోడలకు నిలువెత్తున దృఢమైన ముతక కాగితంతో చేయబడిన అరలలో గ్రంథాలు పెట్టబడి ఉండేవి. వేర్వేరు శాస్త్రాలకు సంబంధించిన గ్రంథాలు వేర్వేరు గదుల్లో ఉంచబడేవి. ఉదాహరణకు సాహితీ గ్రంథాల హాలు, ఫికాహ్ గ్రంథాల హాలు, వైద్య గ్రంథాల హాలు. ఇలాగే ఇంకా ఇతర శాస్త్రాల్ని పఠించే వారికి ఆ భవనంలో ప్రత్యేక గదులు ఉండేవి.

కొన్ని గదులు ఎల్లప్పుడూ గ్రంథాలు వ్రాస్తూ ఉండే లేఖకులకు ప్రత్యేకించబడి ఉండేవి. పఠనం వలన అలసిపోయిన విద్యార్థులు ఉల్లాసం పొందటానికి గ్రంథాలయంలో ఒక సంగీతశాల కూడా ఉండేది. వారు బడలిక దూరమయిన తరువాత మళ్ళీ పఠనంలో నిమగ్నులయ్యేవారు. ఇంకొన్ని గదుల్లో పండితులు, ధర్మవేత్తలు పరస్పరం వాదోపవాదాలు, చర్చలు సాగించేవారు. ఈ గదులన్నింటిలో అతి అందమైన ఫర్నీచర్ ఉండేది. అక్కడకు వచ్చే పేదవాళ్ళకు వసతి సౌకర్యం భోజన సదుపాయాలు ఉండేవి.

బగ్దాద్ ప్రాకారం పరిసర ప్రాంతాల్లో కర్‌కర్ అనే గ్రామంలోని గ్రంథాలయానికి అతి పెద్ద భవనం ఉండేది. అందులోని పుస్తక భాండాగారానికి "విజ్ఞాన భాండాగారం" అని పిలుస్తారు. ఇక్కడకు అన్ని ప్రాంతాల నుండి ప్రజలు వచ్చి నివసించేవారు. విభిన్న శాస్త్రాలు ఆర్జించేవారు. ఇక్కడ వారికి అన్ని రకాల పుస్తకాలు, సౌకర్యాలు సమకూర్చబడేవి. జీవితానికి కావలసిన అన్ని రకాల అవసరాలు కూడా తీర్చబడేవి. ఆ ఖర్చులన్నీ అలీ బిన్ యహ్యా సొంత ఆస్తి నుండి భరించబడేవి. ఆ గ్రంథాలయంలో గల కొన్ని సౌకర్యాల్ని పరిశీలిస్తే ఈనాడు పాశ్చాత్య నాగరికత, సంస్కృతితో అత్యున్నత ప్రగతి చెందిందనుకున్న ఏ ఒక్క దేశ రాజధానిలో కూడా అలాంటి సదుపాయాల్ని కనీసం ఊహించనైనాలేము.

మౌసల్‌లో అబుల్ ఖాసిం జాఫర్ బిన్ ముహమ్మద్ హమ్‌దాన్ మౌసలీ ఓ భవనం నిర్మించాడు. ఆయన కూడా దానికి "విజ్ఞాన మందిరం" అని పేరు పెట్టాడు. విద్యార్థుల కోసం అతి పెద్ద గ్రంథాలయాన్ని ఆయన అంకితం చేశాడు. అందులో అన్ని వర్గాల ప్రజలకు ప్రవేశం ఉండేది. ఒకవేళ జ్ఞాన సముపార్జన లక్ష్యంతో ఎవరైనా ఓ పేద విద్యార్థి వస్తే అతనికి అక్కడ స్టేషనరీతో పాటు ఖర్చుల కోసం చాలినంత డబ్బు కూడా ఇచ్చేవారు. ఆ గ్రంథాలయం ప్రతి రోజు తెరవబడేది.

ఇక మీరే చెప్పండి. ఈనాడు లండన్, వాషింగ్టన్ లేక ఇతర రాజధాని నగరాల్లో జ్ఞాన తృష్ణ గలవారికి ఇన్ని సౌకర్యాలు, పుస్తకాలతో పాటు వసతి గృహాలు, ఖర్చులు ఇచ్చే ఏ గ్రంథాలయాలున్నాయో!

సాధారణ గ్రంథాలయాల్లో ఉద్యోగులు నియమితులయ్యేవారు. దాని ఉన్నతోద్యోగిని గ్రంథాలయ కోశాధికారి (ఖాజినే మక్తబ) అని పిలిచేవారు. ఆ పదవికి ఆ రోజుల్లో అప్పటి విద్వాంసుల్లో ఒకరిని నియమించేవారు. విద్యార్థులకు, పాఠకులకు పుస్తకాలను ఇచ్చి, తీసుకోవడానికి కొందరు వ్యక్తులు నియమించబడే వారు. వారిని "ముతనావుల్" అని పిలిచేవారు. ఇంకొందరు వ్యక్తులు అనువాదం చేస్తుండేవారు.

ఆ కాలంలో ప్రతి చిన్న, పెద్ద గ్రంథాలయాలకు ఓ పుస్తకాల పట్టిక (ఇండెక్స్) ఉండేది. విభిన్న శాస్త్ర గ్రంథాలనుబట్టి ఈ పట్టిక తయారయ్యేది. దాన్ని చూసి ప్రజలు తమకు కావలసిన పుస్తకాన్ని సులభంగా తీసుకునేవారు. ప్రతి అల్మారా మీద ఒక లిస్టు అంటించబడి ఉండేది. దానిలో ఆ అల్మారాలో ఉన్న గ్రంథాల

వివరాలు వ్రాసి ఉంటాయి. పుస్తకానికి జమానతు ఇచ్చి బయటకు తీసుకెళ్ళటానికి ప్రతీ వ్యక్తికి అనుమతి ఉండేది. చాలా గ్రంథాలయాలకు సంబంధించిన ఈ విషయం ప్రజలకు తెలుసు. కాని సుప్రసిద్ధ ధర్మవేత్తలకు, విద్వాంసులకు జమానతు లేకుండానే పుస్తకాలు ఇవ్వబడేవి.

ఈ గ్రంథాలయాల ఖర్చులకు, వాటి రాబడికి గల మార్గాలు వేర్వేరుగా ఉండేవి. ముఖ్యంగా ఆ గ్రంథాలయాలకు అంకితం చేయబడ్డ వక్ఫ్ ఆస్తులు ఓ మార్గం. చాలా గ్రంథాలయాలకు అతి పెద్ద రాబడులు ఈ వక్ఫ్ ఆస్తులే ప్రధానంగా ఉండేవి. ఇంకో మార్గం ఏమంటే అమీర్లు, విద్వాంసులు ఏర్పాటు చేసిన గ్రంథాలయాలకు ఖర్చులన్నీ స్వయంగా వారే భరించేవారు. ఉదాహరణకు ముహమ్మద్ బిన్ అబ్దుల్ మలికుజ్జియాత్ నకలు చేసేవారికి, లేఖకులకు నెలకు 2000 పౌండ్లు ఇచ్చేవారు. ఖలీఫా మామూనుర్రషీద్, ప్రఖ్యాత ధర్మవేత్త హుసైన్ ఇబ్నె ఇస్హాఖ్‌కు ఆయన అరబేతర భాష నుండి అరబీ భాషలోకి అనువదించబడిన ప్రతి పుస్తకాన్నీ బంగారంతో తూచి ప్రతిఫలమిచ్చేవారు.

ఇప్పుడు మేము గ్రంథాలయాల చరిత్ర నుండి గ్రహించి కొన్ని ప్రధాన, సాధారణ గ్రంథాలయాల్ని కేవలం ఉదాహరణ కోసం ప్రస్తావించదలిచాము.

కైరోలోగల ఫాతిమా ఖలీఫాల ఈ గ్రంథాలయం ప్రసిద్ధిగాంచిన గ్రంథాలయాల్లో ఒకటి. అందులో అవి సుందరమైన, శ్రేష్ఠమయిన దివ్యఖుర్‌ఆన్, ఇతర గ్రంథాలతో అలంకరించబడి ఉండినాయి. ఆ గ్రంథాల మొత్తం సంఖ్య దాదాపు 20 లక్షలుంటాయని చాలామంది చరిత్రకారులు అభిప్రాయపడ్డారు. అయితే మఖ్‌రీజి అభిప్రాయంలో వాటి సంఖ్య 16 లక్షలు.

## కైరోలోని విజ్ఞాన మందిరం

దీన్ని హాకిం బఅమ్రుల్లాహ్ స్థాపించారు. హి.శ. 365లో ఇది ప్రారంభమయింది. దీని భవనాలు పటిష్ఠంగా నిర్మించబడ్డాయి. నేలమీద ఖరీదయిన నాపరాళ్ళు పరచబడ్డాయి. కిటికీలకు, ద్వారాలకు అందమైన తెరలు కట్టబడ్డాయి. అందులో పర్యవేక్షకులు, పుస్తకాల ఆవిష్కరణ కర్తలు ఇంకా ఇతర ఉద్యోగులు నియమించబడ్డారు. అంతకు పూర్వం ఏ రాజు కూడా సమకూర్చలేని అసంఖ్యాక గ్రంథాలు ఆ గ్రంథాలయంలో సమకూర్చబడ్డాయి. దానిలో 40 భాగాలుండేవి. ప్రతి భాగంలోనూ

18 వేల గ్రంథాలు ఉండేవి. ప్రాచీన శాస్త్రాలకు సంబంధించిన అన్ని రకాల పుస్తకాలు ఉండేవి. ప్రతి ఒక్కరు దాన్ని దర్శించేవారు. కొందరు పఠనం చేసేవారు. కొందరు నకలు చేసుకునేవారు. కొందరు కేవలం విద్యనభ్యసించేవారు. వారికోసం ఆ గ్రంథాలయం తరఫు నుండి కలం, రకరకాల సిరాలు, కాగితాలు సరఫరా చెయ్యబడేవి.

## బగ్దాద్‌లోని బైతుల్ హిక్మత్

అలాంటి గ్రంథాలయాల్లో బగ్దాద్‌లోని బైతుల్ హిక్మత్ కూడా ఒకటి. హారూన్ రషీద్ దీన్ని నెలకొల్పారు. మామూన్ కాలంలో అది ప్రగతి శిఖరాలకు చేరుకుంది. దాన్ని గ్రంథాలయమని అనడం కంటే అది ఓ పెద్ద విశ్వవిద్యాలయం అనడం సబబు. ఎందుకంటే దానిలోని పరిశోధకులు, తత్వవేత్తలు, పాఠకులు పరస్పరం చర్చించుకుంటూ తద్వారా ప్రయోజనం పొందుతుండేవారు. అందులో లేఖకులు, అనువాదకులు నియుక్తులయి ఉండేవారు. వారు అంకారా, ఉమూరియా, సైప్రస్ విజయాల్లో హారూన్ రషీద్, మామూన్‌కు లభించిన గ్రంథాల్ని అనువదిస్తూ ఉండేవారు.

ఇబ్నె నదీమ్ ఇలా అంటారు : "మామూన్ రషీద్ ఓ యుద్ధంలో రోమన్ రాజును ఓడించారు. దానికి సంబంధించి వారి మధ్య సుదీర్ఘంగా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాయి. ఎట్టకేలకు జరిగిన ఒప్పందం ప్రకారం, రోమన్ రాజు తన వద్దనున్న సర్వ గ్రంథాల్ని అనువదించుకునేందుకు ఒప్పుకుంటాడు. మామూన్ తరఫు నుండి పంపబడ్డవారే ఆ గ్రంథాల్ని అనువదించాలన్న షరతును కూడా అంగీకరిస్తాడు. ఆ షరతు కార్యరూపం దాల్చింది. రోమన్‌లోని విజ్ఞాన గ్రంథాలన్నీ అరబీ భాషలోకి అనువదించబడ్డాయి. శాస్త్రాల్ని, కళల్ని తన జాతికి అంకితం చేయడమే ఓ విజేత దృష్టిలో గొప్ప విజయం. మానవ చరిత్రలో ఇలాంటి గొప్ప దృష్టాంతాలు బహు అరుదు."

## స్పెయిన్‌లోని హకం గ్రంథాలయం

ఈ గ్రంథాలయం అత్యంత విశాలమైనది. అందులో అందంగా బైండింగ్ చేయబడిన 4 లక్షల గ్రంథాలుండేవని ప్రతీతి. దీని పట్టిక సవివరాలతో కూడినది.

ఇంకో విశేషమేమంటే, ఆ గ్రంథాలయంలో కవుల కవితా సంపుటాలకు సంబంధించిన పట్టికలే 44 ఉండేవి. లేఖ నిపుణులు అక్కడ ఉండేవారు, అనుభవజ్ఞులైన బైండర్లు, గ్రంథాల్ని వేటికవే వేరుపరచి పేర్చడంలో నైపుణ్యం గలవారి సేవల్ని కూడా పొందడం జరిగేది. ఫలితంగా స్పెయిన్‌లో అసంఖ్యాకంగా పుస్తకాలు సమకూర్చబడ్డాయి. అలాంటి చొరవ అంతకు పూర్వం గాని, తర్వాతగాని కనబడలేదు.

## బనీ అమ్మార్ గ్రంథాలయం టెబ్లస్

ఈ గ్రంథాలయం వైశాల్యంలో, వైభవంలో ఎంత గొప్పదంటే దైవ నిదర్శనాల్లో దాన్నొకటిగా పేర్కొనవచ్చేమో! ఇందులో కేవలం లేఖకులే 180 మంది ఉండేవారు. వారు ఎల్లవేళలా పుస్తకాల్ని నకలు చేస్తుండేవారు. షిఫ్టు సిస్టమ్ ఆనాడూ ఉండేది. రేయింబవళ్ళు లేఖకులు పనిచేస్తూ ఉండేవారు. అమ్మార్ వంశీయులకు సరికొత్త, అరుదయిన గ్రంథాల్ని సమీకరించడం పట్ల ఎంతో శ్రద్ధాసక్తి ఉండేది. వారు కొందరు అధికారుల్ని, వ్యాపారుల్ని కేవలం ఈ కార్యం కోసమే నియమించారు. వారు దేశ, విదేశ, దూర, సమీపానగల వివిధ ప్రాంతాల్లో పర్యటించి తమ గ్రంథాలయం కోసం ప్రయోజనకరమైన ప్రతీ శాస్త్ర గ్రంథాల్ని సేకరించారు. ఈ గ్రంథాలయం ద్వారా ఈజిప్టు ఎంతో ప్రయోజనం పొందింది. ఆ విషయాన్ని ఈజిప్టు సాహితీపరులు తమ గ్రంథాల్లో ప్రస్తావించారు కూడా. ఈ గ్రంథాలయంలో ఉన్న పుస్తకాల సంఖ్య గురించి భేదాభిప్రాయాలు ఉన్నాయి. అయితే ఇందులో ఒక మిలియన్ గ్రంథాలుండేవని చాలామంది అభిప్రాయం.

## స్వంత గ్రంథాలయాలు

ప్రత్యేకమైన, స్వంత గ్రంథాలయాల్లో చరిత్ర ప్రధానమైన వాటినే ఇక్కడ ప్రస్తావించడం జరుగుతుంది. ఏమయినప్పటికీ చిన్న, పెద్ద గ్రంథాలయాలతో ముస్లిం ప్రపంచం నిండిపోయింది. వేలకొలది పుస్తకాలుండే స్వంత గ్రంథాలయం లేని విద్వాంసుడు ఆనాడు బహు అరుదు. ప్రత్యేకమైన గ్రంథాలయాల్లో ఫతెహ్ బిన్ ఖాఖాన్ గ్రంథాలయం చాలా ప్రసిద్ధిగాంచింది. అది అతి విశాలమైనది.

ఇబ్నె ఖుషాబ్ మయాఫీ (క్రీ.శ. 567) గ్రంథాలయం కూడా అలాంటి గ్రంథాలయాల్లో ఒకటిగా పరిగణించబడుతుంది. ఈయన వ్యాకరణంలో నిష్ణాతుడు. వ్యాఖ్యానం, హదీసు, తర్కం, తత్వశాస్త్రంలో పారంగతుడు. పుస్తకాల పిచ్చి మూలంగా

అతను ఎంతటి పండితుడైనా చెడ్డ అలవాట్లకులోనై ప్రజల దృష్టిలో చులకనై పోయాడు. పుస్తకాల్ని సేకరించడానికి కొన్ని అసహ్యాకరమైన పనులు చేయడానికి కూడా వెనకాడ లేదు. పుస్తకాల కొట్టుకు వెళ్ళి తనకు నచ్చిన పుస్తకం కొనాలన్న ఆలోచన రాగానే ప్రజలు చూడకుండా ఆ పుస్తకంలోని కొన్ని పేజీల్ని ఊడదీసి దాచుకునేవాడు. తర్వాత షాపు యజమానితో ఈ పుస్తకం దోషభూయిష్టమైనదని అనేవాడు. అలా ఆ పుస్తకాన్ని అతి తక్కువ వెలకు కొనుక్కునేవాడు. ఎవరి వద్దనయినా పుస్తకం తీసుకుంటే ఇక అంతే సంగతి. పుస్తకం తిరిగివ్వమని అడిగితే అది పుస్తకాల్లో కలసి పోయిందనో, దొరకడం లేదనో బుకాయించేవాడు.

జమాలుద్దీన్ ఖుఫ్తి (హిజ్రీ శ. 646) గ్రంథాయం కూడా తక్కువేం కాదు. ఆయన కూడా ఎన్నో గ్రంథాల్ని సేకరించాడు. ఆయన ఉదార స్వభావం, దాతృగుణం వల్ల చుట్టుపట్ల ఉన్న వారందరూ ఆయన వద్దకు వచ్చేవారు. ప్రపంచంలో ఆయనకు అన్నింటి కంటే ప్రీతిపాత్రమైనవి పుస్తకాలే. ఆయన పుస్తకాలకు అంకితమైపోయారు. పెళ్ళి అయితే భార్యాబిడ్డల జంజాటంలో ఎక్కడ చిక్కుకుపోతానోననే భయంతో ఆయన పెళ్ళే చేసుకోలేదు. మరణ సమయంలో తన గ్రంథాలయాన్ని నాసిర్‌కు ఇచ్చివేయాలని ఆయన శాసించాడు. దాని వెల ఐదు వేల పౌండ్లకు సమానము.

ఖలబ్‌లోని బనీ జరాద విద్వాంసుల గ్రంథాలయం కూడా ప్రఖ్యాతి పొందింది. వారిలో ఓ వ్యక్తి అబుల్ హసన్ ఇబ్నె అబీ జరాద (హిజ్రీ శ. 548) తన అందమైన దస్తూరితో మూడు గ్రంథాలయాలకు సరిపోయే పుస్తకాల్ని వ్రాశారు. ఒకటి తనకు, రెండోది తన కుమారుడైన అబుల్ బరకాత్‌కు, మూడోది తన మనుమడు అబ్దుల్లా కోసం వ్రాశాడాయన.

మూఫిఖ్ బిన్ మత్రాన్ దమిష్కి (హిజ్రీ శ. 587) గ్రంథాలయం కూడా ప్రసిద్ధిగాంచింది. ఆయన పుస్తకాల్ని సేకరించడానికి ఎంతో ధైర్యాన్ని ప్రదర్శించారు. ఆయన మరణించిన తర్వాత ఆ పుస్తక భాండాగారంలో వైద్యం, ఇతర శాస్త్ర గ్రంథాలకు సంబంధించిన 10 వేల పుస్తకాలు ఉండేవి. ఆయన ముగ్గురు లేఖకుల్ని నియమించారు. వారు అన్ని వేళలా గ్రంథాలయానికి కావలసిన పుస్తకాల నకళ్ళు చేస్తూ ఉండేవారు. ఆయన వారికి వేతనాలు ఇవ్వటమే గాక వారి ఇతర అవసరాలను కూడా సమకూర్చేవారు.

## గ్రంథాలయాల పట్ల విరోధుల వైఖరి

ఇస్లామీయ సంస్కృతి పధానంగా ఉన్న కాలంలో ముస్లిం ప్రపంచంలో గ్రంథాలయాలను విపరీతంగా నెలకొలిపే బలహీనతను ప్రస్తావించడం వల్ల మాకు ఎంత ఆనందం కలుగుతుందో, అలాగే ఆ అమూల్య సంపత్తికి దుర్గతి పట్టడాన్ని అవి కొల్లగొట్టబడటాన్ని, ప్రవాహంపాలు కావటాన్ని, అగ్నికి ఆహుతి చేయబడటాన్ని చూసి మాకు అంతే బాధ, దుఃఖం కలుగుతున్నాయి. హృదయం బ్రద్దలయిపోతోంది. విద్యకు, విజ్ఞానానికి సంభవించిన అపార నష్టం ప్రళయం వరకు భర్తీ చేయబడదు. ఇస్లామీయ గ్రంథాలయాల మీద వినాశం విరుచుకుపడింది. ఆలోచనలను రేకెత్తించే ఎన్నో లక్షల గ్రంథాల్ని మానవత శాశ్వతంగా కోల్పోయింది. తాతారీల విపత్తు బగ్దాద్‌లో ప్రవాహంలా ప్రవేశించినప్పుడు మొట్టమొదట వారి దృష్టి ఈ గ్రంథాలయాల మీదే పడింది. విద్యాగంధం లేని తాతారీలకు ఏ గ్రంథాలయంలో ఏది లభించినా దాన్ని దజ్‌ల నదిలో విసిరివేసారన్న వాస్తవం అందరికీ తెలుసు. ఆ నదిలో ఎన్ని గ్రంథాలు వేశారంటే దానివల్ల నది లోతు తగ్గిపోగా తాతారీలు భుజం భుజం కలుపుతూ నదిని దాటారు. విసిరివేయబడ్డ గ్రంథాల నల్లని సిరా కరిగి నీరంతా నల్లగా మారి ప్రవహించింది.

ఆ తర్వాత వినాశనం శిలువ యుద్ధాల రూపంలో ప్రత్యక్షమయ్యింది. అది టెరాబ్లస్, మారా, బైతుల్ మఖ్దిస్, అస్ఖలాన్ మొదలగు నగరాల్లోని అమూల్య గ్రంథాలయాల నన్నింటినీ నాశనం చేసివేసింది. ఆ నగరాన్ని జయించిన క్రైస్తవులు వాటిని సర్వనాశనం చేసివేశారు. కేవలం టెరాబ్లస్‌లోనే క్రైస్తవులు 3 మిలియనుల (30 లక్షల) గ్రంథాల్ని నాశనం చేసి వేశారని చరిత్రకారులు ఉల్లేఖించారు. దానివల్ల ఎంతటి ఘోరం జరిగిపోయిందో ఊహించవచ్చు. స్పెయిన్ మీద స్పెయిన్ వారు జరిపిన దాడుల వల్ల అసంఖ్యాకమైన గ్రంథాలయాలు మంట కలసిపోవడంతో మానవత మహత్తరమైన సంపత్తిని కోల్పోయింది. ఆ భయంకరమైన ఘట్టం చరిత్రలో విషాద గాథగా నిల్చిపోయింది. ఆ అసూయపరులైన మతవాదులు ఎన్ని గ్రంథాల్ని గుట్టలు గుట్టలుగా పోసి తగులబెట్టారో తెలుసా మీకు! గర్‌నాత అనే ఒకే ఒక్క మైదానంలో కేవలం ఒక్క రోజులో 10 లక్షల గ్రంథాల్ని తగులబెట్టేశారు.

ఇవి ఇస్లామీయ ప్రపంచంలోని మహత్తర గ్రంథాలయాలకు ఇతరులు కలుగజేసిన అపార నష్టం. ఇకపోతే ముస్లింలలోని అంతరంగిక కలహాలవల్ల సంభ

వించిన నష్టం ఇంతా అంతా కాదు. ఈజిప్టులో ఫాతిమా ఖలీఫాల గ్రంథాలయానికి పట్టిన దుర్గతి ఏమంటే, టర్కీ బానిస వంశం ఈజిప్టును జయించగానే వారు ఆ గ్రంథాలయానికి నిప్పంటించి బూడిద కుప్పగా మార్చివేశారు. గ్రంథాల బైండింగ్‌కు ఉపయోగించిన నాణ్యమైన చర్మాన్ని ఊడదీసి దాంతో వారు పాదరక్షలు కుట్టించుకున్నారు. అసంఖ్యాక గ్రంథాల్ని నైలు నదిలో విసిరిపారేశారు. మరికొన్ని గ్రంథాల్ని వివిధ ప్రాంతాలకు తీసుకెళ్ళిపోయారు. మిగిలిపోయిన గ్రంథాలు బహిరంగ ప్రదేశాల్లో విసిరివేయబడ్డాయి. శ్రేష్ఠమైన, గౌరవప్రదమైన ఆ గ్రంథాల పేజీలతో గాలి సయ్యాటలాడింది. అక్కడ కొన్ని ప్రదేశాలు "గ్రంథాల దిబ్బలు"గా ప్రసిద్ధిపొందాయి.

హలబ్‌లో ఓ పెద్ద గ్రంథాలయం ఉండేది. దాని పేరు "ఖజానయే సూఫియ". ఓసారి ముహర్రం రోజున షియా, సున్నీ వర్గాల మధ్య అల్లరి జరిగింది. అప్పుడా గ్రంథాలయమంతా దోచుకోబడింది. ఏవో కొన్ని పుస్తకాలు తప్ప ఇంకేమీ మిగల్లేదు.

స్పెయిన్ అధినేత అయిన ముస్తన్సర్ గ్రంథాలయాన్ని విజేతలుగా వచ్చిన తెగలు కొల్లగొట్టాయి. చాలా గ్రంథాల్ని వారు అతి తక్కువ వెలకు అమ్ముకున్నారు. మిగిలిన వాటిని నాశనం చేసివేశారు.

గ్రంథాలు, గ్రంథాలయం పట్ల అమీర్ ఇబ్నె ఫాతిక్ భార్య వింతగా ప్రవర్తించింది. ఆయన హిజ్రీ శకం 5వ శతాబ్దిలో ఈజిప్టును పాలించిన అమీర్లలో ఒకరు. ఆయనకు ఓ పెద్ద గ్రంథాలయం ఉండేది. ఆయన భార్య గౌరవనీయులైన, సంపన్న కుటుంబానికి చెందినది. అయితే ఇబ్నె ఫాతిక్‌కు గల ఆస్తుల్లో ఓ పెద్ద భాగం ఈ గ్రంథాలయానికి ఖర్చు అవుతుండడం వల్ల ఆమెకు ఆయన పుస్తకాల పట్ల బహు చిరాకెత్తిపోయింది. ఇబ్నె ఫాతిక్ మరణించగానే ఆమె, ఆమె సేవకురాలు గ్రంథాలయంలోకి ప్రవేశించి గ్రంథాల్ని ఇంటి ఆవరణలో ఉన్న బావిలో పడవేయసాగారు. ఆమె తల బాదుకుంటూ "ఈ పుస్తకాలు ఆయన్ని (భర్తను) ఎల్లవేళలా నిమగ్నుణ్ణి చేసి ఆయన్ను నావంక చూడనిచ్చేవి కావంటూ రోదించిందామె. ఇస్లామీయ చరిత్రలో ఇబ్నె ఫాతిక్ భార్యలా పుస్తకాల పట్ల విచిత్రంగా ప్రవర్తించిన ఇంకొందరి భార్యల ప్రస్తావన కూడా ఉంది. ఇమామ్ జుహ్రీ భార్య ఇమామ్ గార్ని ఎల్లప్పుడు పుస్తకాల్లో నిమగ్నమవడం చూసి "దేవుని సాక్షి! నాకు ఈ పుస్తకాలు ముగ్గురు సవతుల కంటే ఎక్కువ పోరుగా ఉన్నాయ"ని అంటూ ఉండేది.

ఇది ఇస్లామీయ సంస్కృతి, నాగరికతలు వెల్లివిరిసిన కాలంలో గ్రంథాలయాల విషయంలో జరిగిన ట్రాజెడి.

## ఒప్పుకోలు

శత్రువుల మంచి పనుల్ని ఒప్పుకోవడం అనేది మానవ హృదయం మీద భరించరాని భారం వేయడం వంటిది. అయితే ఐరోపాలోని వివిధ గ్రంథాలయాలు ఇస్లామీయ సంస్కృతి ప్రతీక అయిన అమూల్య విజ్ఞాన సంపదలోని అపార భాగాన్ని సంరక్షించాయని, ఆ గ్రంథాలయాల్లో ఈనాడు కూడా ముస్లిం ప్రపంచంలో లేని అరబీ పుస్తక భాండాగారాలున్నాయన్న సత్యాన్ని ముస్లింలు బహిరంగంగా ఒప్పుకోక తప్పదు.

ఇవి మహోజ్వలంగా భాసిల్లిన ఇస్లామీయ సంస్కృతి యొక్క మచ్చు తునకలు. అవి సంస్కృతీ వికాసానికి తోడ్పడటమేగాక విద్యా ప్రచారం, ప్రచురణల మీద తిరుగులేని ప్రభావాన్ని వేశాయి. వాటి ద్వార సమాజ ఉన్నతి, సాధారణ విద్యపట్ల శ్రద్ధాసక్తి పెంపొందడమేకాక, సాంస్కృతిక సంబంధాలు కూడా అభివృద్ధి చెందాయి. ఇస్లామీయ రాజ్యాల రాజధానుల్లో, పెద్ద పెద్ద నగరాల్లో జరుగుతూ ఉండే సభలు, విద్యావేదికలే దానికి తార్కాణాలు. వీటితో పాటు పెద్ద పెద్ద పాఠశాలలు, విద్యా సంస్థలు, గ్రంథాలయాలు కూడా అధిక సంఖ్యలో ఉండేవి. విస్తృతంగా ఏర్పాటయ్యే ఈ సభలు, వాటిలో జరిగే చర్చల వైవిధ్యాన్ని బట్టి ముస్లిం సమాజం వైభవంగా విరాజిల్లుతున్న కాలంలో విద్యారంగంలో సాధించిన ప్రగతి ఏమిటో అర్థమవుతుంది. మీరు పరిశీలిస్తే ముస్లిం సమాజంలోని వివిధ వర్గాలు, అమీర్లు, సాహితీవేత్తలు, కవులు సభల్లో విభిన్న విద్యలు, సాహిత్యం, తత్వశాస్త్రాల్లోని అంశాల మీద చర్చించేందుకు పోటీలు నిర్వహించేవారు.

## విభిన్న సభలు, వేదికలు

ఈ సభలు ఎన్నో రకాలుగా ఉండేవి. కొన్ని సభలు అప్పటి ఖలీఫాల ఆధ్వర్యంలో జరిగేవి. అలాంటి సభలకు స్వయంగా ఖలీఫాలే అధ్యక్షత వహించేవారు. ఆ సభల్లో ఆయా రాజ్యాల రాజధానుల్లోని సుప్రసిద్ధ విద్వాంసులు, ధర్మశాస్త్ర పారంగతులు, సాహితీవేత్తలు పాల్గొనేవారు. ఇస్లామీయ సంస్కృతి, సభ్యతల ప్రగతి కారణంగా ఆ సభల రూపురేఖల్లో కూడా మార్పులు జరుగుతూ ఉండేవి. ధర్మ

పాలకుడైన ఖలీఫాల కాలంలో ఈ సభలు గవర్నర్ల పర్యవేక్షణలో జరుగుతూ ఉండేవి. ఆ సభల్లో పెద్ద పెద్ద నాయకులు పాల్గొని ప్రధానమైన సమస్యలు, విషయాల మీద సమాలోచనలు జరిపే శాసన సభలుగా రూపుదిద్దుకునేవి. హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి)కు ఓసారి ప్రభుత్వానికి సంబంధించిన ఓ ప్రధాన కార్యనిర్వహణకు ఓ వ్యక్తి కావల్సి వచ్చింది. అందుకాయన సభికుల్ని ఉద్దేశించి అన్నారు, "అతి ప్రధానమైన ఓ కార్యాన్ని ఒక వ్యక్తికి అప్పగించదలిచాను. ఆ వ్యక్తి ఎవరో చూపించగలరా?" సభలోని వారందరూ 'ఫలానా' అని సూచించారు. అందుకాయన "మాకు ఆ వ్యక్తి అవసరం లేదు" అన్నారు. మరైతే ఎలాంటి వ్యక్తి మీకు అవసరమని అడిగారు. "జాతి అధినేత లేని సమయంలో అతను అక్కడ ఉంటే అతనే జాతి నాయకుడుగా కనబడాలి. ఒకవేళ జాతి నాయకుడు అక్కడ ఉంటే అతడు అతి సామాన్యుడుగా కనబడాలి. అటువంటి వ్యక్తి నాకు కావాలి" అన్నారు హజ్రత్ ఉమర్ (రజి). అప్పుడు సభికులందరూ "ఈ లక్షణం కేవలం రబీ బిన్ జియాద్ హారిసీలోనే ఉంద"ని అన్నారు. అందుకు హజ్రత్ ఉమర్ (రజి) "మీ అందరి దృష్టి సరయిన వ్యక్తిపై పడింద"ని ప్రశంసించి ఆయనకు ఆ కీలక బాధ్యతను అప్పగించారు.

బనూ ఉమయ్యా కాలంలో ఈ సభలు విద్య, సాహిత్యం, కవిత్వం అకాడమీ లుగా మారాయి. ఓసారి అబ్దుల్లాహ్ బిన్ హాషిమ్, అమీర్ మావియ (రజి) సభకు హాజరయ్యారు. అప్పుడు అమీర్ మావియ (రజి) "దాతృత్వం, సాహసం, మొహమాటా నికి సరైన నిర్వచనం చెప్పగలవారెవ్వర"ని అడిగారు. అందుకు అబ్దుల్లాహ్ "అడగక ముందే ఏదైనా వస్తువును దానం చేయడం దాతృత్వం, వెనుకంజవేసే తరుణంలో స్థిరంగా ధైర్యంతో ముందడుగు వేయడం సాహసం అంటారు. ధర్మంలో సంస్కరణ, దైవభీతి, పరిస్థితుల సంస్కరణ, పొరుగు వారిని సమర్థించడం – ఇవన్నీ కూడుకున్నదే మొహమాటం" అన్నారు.

అబ్దుల్ మలిక్ ఓ సభలో సభికుల్ని ఉద్దేశించి "మానవ అవయవాల పేర్లను అక్షర క్రమంలో చెప్పేవారు ఎవరైనా ఉన్నారా? అలా చెప్పినవారు ఏ బహుమానం అడిగినా ఇస్తాన"న్నారు. ఇది విని నవీద్ బిన్ గిఫ్‌లత "హుజూర్! నేను చెప్పగలన"న్నారు. "చెప్పండి" అన్నారు అబ్దుల్ మలిక్. ఆయన చెప్పడం ప్రారంభించారు. అన్ఫ్ (ముక్కు), బతన్ (కడుపు), తర్‌ఖూత్ (గొంతెముక), సగర్ (ముందు పళ్లు), జుమ్ జుమ (పుర్రె), హల్ఖ్ ఖద్ (చెంప, మెదడు) వగైరా.

సభికుల్లో ఓ వ్యక్తి "హుజూర్! నేను అలాగే అక్షర క్రమంలో మానవ శరీరంలోని అవయవాల్లో రెండేసి పేర్లు చెప్పగలన"న్నాడు. అప్పుడు నవీద్ అందుకొని "అయితే నేను మూడేసి పేర్లు చెబుతాను" అంటూ అలిఫ్‌తో అస్వాన్ (దంతము) అజన్ (చెవి) అలాగే, 'బ'తో 'తం'లతో మూడేసి పేర్లు చెబుతూపోయారు. అలా అక్షర క్రమంలో పేర్లు చెబుతూ ఉంటే అబ్దుల్ మలిక్ అమితాశ్చర్యపోయారు. ఆయనకు తగిన బహుమానమిచ్చారు.

ఓసారి ఓ గ్రామీణుడు అబ్దుల్ మలిక్ సభలోకి వచ్చాడు. అప్పుడక్కడ సుప్రసిద్ధ కవి జరీర్ కూడా ఆసీనులై ఉన్నారు. అబ్దుల్ మలిక్ ఆ గ్రామీణునితో "నీకు కవిత్వం గురించి ఏమయినా తెలుసా?" అని అడిగాడు. "మీరు ఏమి అడగదలచుకున్నారో అడగండి" అని గ్రామీణుడు సమాధానమిచ్చాడు. అబ్దుల్ మలిక్ "మదహ్ (ప్రశంస) అధ్యాయంలో నుంచి పద్య భాగం ఏద"ని ప్రశ్నించారు. అందుకా గ్రామీణుడు జరీర్ వ్రాసిన కవనాన్ని వినిపించాడు.

"ఫఖ్‌రియా (అహంభావం) కవనంలో మంచి పద్యం ఏది?" అని అబ్దుల్ మలిక్ అడిగాడు.

గ్రామీణుడు జరీర్ రచించిన పద్యం వినిపించాడు. "నీ పట్ల తమీమ్ వంశం వారు అసంతృప్తులయినప్పుడు, అందరూ నీ మీద కోపోద్రేకులయినారని నీవు తలుస్తావు". జరీర్ పట్లలేని ఆనందంతో ఊగిపోతున్నారు.

అబ్దుల్ మలిక్ మళ్ళీ అడిగారు : హజు (నింద, ఎత్తిపొడుపు)లో మంచి పద్య భాగమేది?" "నీవు బనీ సమీర్ వాసివి, కనుక కళ్ళను క్రిందికి వాల్చు, ఎందుకంటే నీవు కల్బ్ తెగస్థాయికి చేరుకోనూ లేవు. అలా అని కల్బ్ తెగ (కల్బ్ అంటే కుక్క అన్న అర్థం కూడా వస్తుంది) స్థితికి దిగజారనూ లేవు" అని జరీర్ పద్యాన్ని వినిపించాడు. జరీర్ ముఖారవిందం వెలిగిపోయింది. అబ్దుల్ మలిక్ మళ్ళీ అడిగారు, "గజల్‌లో ఉత్తమ కవనం ఎవరిది?"

"క్రీగంట చూపుతో చూసే ఆ నీ కళ్ళు హతమార్చివేశాయి. కానీ హత్యానంతరం మా శవాల్ని బ్రతికించనే లేదు" అని జరీర్ కవనాన్ని వినిపించాడు. జరీర్ ఆనంద పారవశ్యంలో ఊగిపోతూనే ఉన్నారు.

అబ్దుల్ మలిక్ అంతటితో ఊరుకోక మళ్ళీ "ఏ పద్య భాగంలో అత్యుత్తమ స్తోత్రం ఉంద"ని అడిగారు. అందుకా గ్రామీణుడు "అటువైపు చీకటి పయనించ

సాగింది దేని తారలయితే లాంతర్లలో పేనిన వత్తుల్లా ప్రకాశిస్తున్నట్లు అగుపించాయో" అని జరీర్ వ్రాసిన కవనాన్ని వినిపించాడు. అది విన్న జరీర్ ఆనందానికి అవధులే లేవు. "అమీరుల్ మూమినీన్! నా బహుమానం కూడా ఆ గ్రామీణునికే ఇచ్చి వేయండ"ని అన్నారు జరీర్. "లేదు, లేదు, అతనికి తగిన బహు మానం ఇవ్వబడు తుంది. మీకు కూడా బహుమానం ఇవ్వబడుతుంద"న్నారు. అమీరుల్ మూమినీన్, ఆ గ్రామీణుడు దర్బారు నుండి బయటికి వస్తుండగా అతని కుడిచేతిలో 8 వేల రూపాయలు, ఎడమ చేతిలో ఓ పెద్ద బట్టల తాను ఉంది.

## అబ్బాసీల కాలంలో

అబ్బాసీల కాలంలో ఈ సమావేశాలు విస్తృతమవుతూ ఎంతో పరిణతి చెందాయి. ఈ సమావేశాలు విశాలత దృష్ట్యా చర్చనీయాంశాల రీత్యా, విషయాల వైవిధ్యం మూలంగా విద్యాకోవిదులు, సాహితీవేత్తల అపరిమిత సంఖ్య రీత్యా బ్రహ్మాండమైన సమావేశాలుగా ప్రతీతి చెందాయి. ఇవిగాక పిచ్చాపాటి చర్చించు కోవడానికి సభలు వేరుగా ఉండేవి. వాటిలోనూ సాహిత్యమే ప్రధాన శీర్షికగా ఉండేది. కాకపోతే వాటిలో కవిత్వపు కవ్వింపులు, కవుల విసుర్లు, గానా బజానాలకు కావాల్సిన ముఖ్యమైన గీతాల గురించి చర్చ జరుగుతూ ఉండేది.

ఇలాంటి సమావేశాల విశాలత, శ్రేష్ఠతలవల్ల అబ్బాసీ ఖలీఫాల్లో ముఖ్యంగా రషీద్, మామూన్ ప్రసిద్ధిపొందారు. హారూనుర్రషీద్ దర్బారులో అన్ని రకాల కళల్లో ఆరితేరిన పండితులు ఎల్లప్పుడూ ఉండేవారు. ఆయన దర్బారులోని గొప్ప గొప్ప కవులలో అబూ నవాస్, అబుల్ అతాహియ, వబల్, ముస్లిం బిన్ వలియద్, అబ్బాస్ బిన్ అల్ అస్నఫ్ మొదలైనవారు ఎన్నదగ్గవారు. ఫుకహా (షరీఅత్ వేత్తలు)లలో అబూ యూసుఫ్, షాఫయీా, ముహమ్మద్ బిన్ అల్ హసన్, నిఘంటువు కర్తలలో అబూ ఉబేద అస్మయీా, కసాయి, చరిత్రకారులలో సుప్రసిద్ధులయిన వాఖిది, వ్యాఖ్యాతలలో ఇబ్రాహీం మౌసలి, ఆయన కుమారుడు ఇస్హాఖ్ మొదలగువారు ఆయన సభలో ఉండేవారు. ఈ సందర్భంగా ఓ వింతైన సాహిత్య చర్చనీయాంశాన్ని ప్రస్తావించడం సమంసజసం. అలాంటి చర్చలు ఈ సభల్లో ఎన్నో జరుగుతూ ఉండేవి. హారూను ర్రషీద్ సభలో ఓసారి కసాయి, సీఖూయ, సాహితీ రంగానికి చెందిన కొందరు పెద్దలు ఆసీనులయి ఉన్నారు. ఆ సభలో కసాయి, అరబ్

సామెతలోని ఓ వాక్యం చదివారు. దాని భావం ఇలా ఉంది : "తేనెటీగ కాటుకంటే కందిరీగ కాటు చాలా తీవ్రంగా ఉంటుందని నేను అనుకునేవాణ్ణి. అది నిజమేనని ఇప్పుడు తెలిసింది". కాని కసాయి అభిప్రాయాన్ని సీఖూయ వ్యతిరేకించారు. ఆ వ్యవహారంపై తర్జన భర్జన జరిగింది.

ఎట్టకేలకు ఇలా తీర్మానించడం జరిగింది : "ఎన్నడూ పట్టణవాసితో కలవని, పట్టణవాసుల యాసలో మాట్లాడని ఓ గ్రామవాసిని తీర్పులడుగుదాం."

హారూనుర్రషీద్‌కు మొదట్నుంచి కసాయి పట్ల అత్యంత అనురాగం, అభిమానం ఉండేది. ఈ పందెంలో కసాయి గెలవాలని మనసారా వాంఛించారాయన. ఎందుకంటే ఖలీఫా కాకముందు కసాయి ఆయనకు ముఖ్య గురువు. హారూనుర్రషీద్ ఓ గ్రామీణుడ్ని పిలిపించి అతణ్ణి ఆ విషయం గురించి అడిగారు. అందుకా గ్రామీణుడు సీఖూయ పలికినట్లుగా ఆ వాక్యాన్ని వల్లించాడు. అప్పుడు హారూన్ "ఆ వాక్యాన్ని కసాయి పలికినట్లుగా పలుక"మన్నాడు. అలా ఆ వాక్యాన్ని వల్లించడం తన వల్ల కాదన్నాడా గ్రామీణుడు. అయితే నీవు ఒక పని చెయ్. రేపు సభలో కసాయి, సీఖూయ తమకు తోచినట్లుగా ఆ వాక్యాన్ని పలుకుతారు. నీవు కసాయి పలికిందే సరైందని చెప్పేస్తే సరిపోతుందని అనగానే అలా చేయడానికి అతడు ఒప్పేసుకున్నాడు. మరునాడు సభలో అనుకున్నట్లుగానే పథకం ప్రకారం అంతా జరిగిపోయింది. కానీ తను ఘోరంగా మోసగించబడ్డాడని, అందరు అధర్మంగా కసాయిని బలపరిచారన్న విషయం సీఖూయకు తెలిసిపోయింది. ఆ సంఘటన ఆయన్ని ఎంతో కృంగదీసింది. ఆయన మనస్సు కకావికలమయిపోయింది. బాధ, దుఃఖంతో బగ్దాదును వదలి వెళ్ళిపోయారు. ఆ తర్వాత ఆయన ఎన్నో రోజులు జీవించలేదు. ఆ బాధ దుఃఖంతోనే ఆయన మరణించారని చెప్పుకుంటారు.

అలాగే హారూనుర్రషీద్ సభల్లో షరీఅత్ సమస్యల పట్ల కూడా చర్చ జరుగుతూ ఉండేది. అలా జరిగే చర్చల విచిత్ర దృశ్యాల్లో ఇదొకటి. ఇమామ్ అబూ హనీఫా (రహ్మాలై) శిష్యులయిన ఇమామ్ ముహమ్మద్ బిన్ హసన్, "కసాయి షరీఅత్‌లో నిపుణులు కారు. ఆయన కేవలం అరబీలో కొంచెం పాండిత్యం కల్గి ఉన్నారు, అంతే" అని అన్నారొకసారి. అందుకు కసాయి "ఒక వ్యక్తి ఒక విద్యలో పాండిత్యం సాధించగలిగితే ఇతర శాస్త్రాలన్నింటిలోనూ అతనికి జ్ఞాన దృష్టి ఉంటుంది" అన్నారు.

## సదనాలు

ఇమామ్ ముహమ్మద్ ఆయనను పరీక్షించదలచి, "ఒకవేళ ఒకనికి 'సజ్‌ద సహూ' మధ్యలోనే 'సహూ' జరిగిపోతే అతడు రెండవసారి సజ్‌ద సహూ చేస్తాడా? అని అడిగారు.

'లేదు' సమాధాన మిచ్చారు కసాయి.

ఒక ఉదాహరణ చెప్పండి.

వ్యాకరణ సిద్ధాంతం ప్రకారం ఒక పదంలో తప్పుదొర్లితే అందులో ఇంకా తప్పుల ప్రశ్నే తలెత్తదు.

ఇస్లామీయ సంస్కృతీ నాగరికతల చరిత్రలో మామూన్ రషీద్ సభలు విశిష్ఠ మైనవిగా, ఉన్నతశ్రేణి సభలుగా విలసిల్లాయి. ఎందుకంటే ఆయన స్వయంగ ఉన్నతశ్రేణి విద్యా పారంగతుడు. ఆయన భవనంలో అన్ని వేళల విద్యా కోవిదులు, సాహితీవేత్తలు, కవులు, వైద్యులు, గొప్ప గొప్ప తాత్వికులు పరివేష్టితులయి ఉండేవారు. మామూన్ తన విశాల సామ్రాజ్యపు నలుదిశల నుండి వారందరినీ ఆహ్వానించి దర్బారులో ప్రవేశపెట్టారు. ఎలాంటి భేదభావం చూపకుండా అందరిపట్ల ప్రత్యేక శ్రద్ధాసక్తి చూపుతూ వారికి కావాల్సినవన్నీ సమకూర్చుతూ ఉండేవారు. ఒక్కో సమయంలో సభలో వివాదగ్రస్తమయిన సమస్యల్ని ఆయన స్వయంగా లేవనెత్తేవారు. అలా విద్వాంసుల్ని వాదోపవాదాల్లో పాల్గొనడానికి ప్రోత్సహించేవారు. విద్వాంసులు, తాత్వికులు తమ గ్రంథాల నుండి దృష్టాంతాలు, నిదర్శనాలు చూపించరాదని నిషేధించారు. "ఖుర్‌ఆన్, బైబిల్, తౌరాత్‌ల నుండి ఆధారాలు వెతకడంలో నిమగ్నం కాకండి. సమస్యలపై చర్చించండి. అదీ హేతువు దృష్టితో చర్చించండి" అని వారితో అంటుండేవారు. సభలో మత విభేదాలు తలెత్తకుండా ఉండాలన్నదే ఆయన అభిమతం. ఎందుకంటే సభలో విభిన్న అభిప్రాయాలు గల మతవర్గాల పండిత ప్రకాండులు ఉండేవారు. ఫికహ్, హదీసువేత్తల సమస్య, ప్రసిద్ధ ఖల్కె ఖుర్‌ఆన్ చర్చల్లో ఆయన స్వయంగా పాల్గొని ఉన్నారు. ఇందువల్ల షరీఅత్ విద్యా శాస్త్రాల్లో ఆయనకు ఎంతటి ప్రజ్ఞ ఉందో, వాటి అంశాల మీద ఆయనకు ఎంతటి పటిమ ఉందో తెలుస్తున్నది. ఈ సభల చర్చలకు, వాదాలకు కొన్ని ప్రత్యేక నిబంధనలు ఉండేవి. వాటిని అందరూ పాటించేవారు. ఉదాహరణకు వాదించే వారికి కోపం

రాకూడదు. ఆశ్చర్యపడరాదు. గొడవ చేయకూడదు. తనతో వాదించేవారిని వదలిపెట్టి ఇంకొకరి మీదికి దృష్టి మళ్లించరాదు. వారి సంభాషణకు గల లక్ష్యం కేవలం సత్యాన్వేషణ, పుణ్యఫలం ఆర్జించే భావన తప్ప మరో ఆశయం ఉండరాదు.

అబ్బాసీ ఖలీఫాల సభల నుండి కాస్త ముందుకు పోయి కైరోలోని ఫాతిమా ఖలీఫాల సభల్ని కూడా చూడండి. వారి సభల్లో కూడా అదే ఔన్నత్యం, విశిష్ఠత గోచరిస్తాయి. రాజధానిలో అనేక పండిత బృందాలు వివిధ శాస్త్రాంశాల మీద వాదోపవాదాలు, ప్రతి విమర్శలు జరుపుకునేవారు. కొన్ని సమయాల్లో స్వయంగ ఖలీఫాలు కూడా ఆ చర్చా గోష్ఠులకు అధ్యక్షత వహించేవారు.

ఇవేకాకుండా మంత్రులు, అమీర్లకు సంబంధించిన ప్రత్యేక సభలు కూడ జరుగుతూ ఉండేవి. వాటిలో ప్రతి ఒక్క కళలో ప్రజ్ఞావంతులయిన పండితులు సమావేశమయ్యేవారు. "బరామ్‌క" సభల కార్యక్రమాలన్నీ సాహిత్య, చరిత్ర గ్రంథాల్లో ఉల్లేఖించబడి ఉన్నాయి. ఈ సభలో విభిన్న విద్యాంశాల మీద చర్చలు, విమర్శలు సాగుతూ ఉండేవి. ఖలీఫా సైపుద్దౌల హమ్దాని సభల్లో అబూ ఫిరాఫ్ వంటి ప్రముఖ కవులు 40 మందికి మించి ఉండేవారు. అప్పటి సుప్రసిద్ధ కవి ముత్‌నబి కూడ ఆ సభల్లో పాల్గొనేవారు. ఈ సభలు కూడా అబ్బాసీల కాలం నాటి మంత్రుల మహా సభల్ని జ్ఞప్తికి తెస్తాయి. మంత్రి ఇబ్నె అల్ గరాత్ సభ కూడా ఇలాగే ఉండేది.

అబూ హయ్యాన్ తన గ్రంథం "అల్ సుమ్‌తావల్ మవాసినల్"లో మంత్రి ఆధ్వర్యంలో జరిగే ఈ సభల గురించి సమగ్రంగా ప్రస్తావించారు. ఈ సభల్లో సీరానీ, ఖాలిది, ఖదామాబిన్ జాఫర్, అలీ బిన్ ఈసా అల్ జరాహ్ వంటి తాత్వికులు తర్క శాస్త్ర కోవిదులు అధిక సంఖ్యలో పాల్గొనేవారు.

అబూ అబ్దుల్లాహ్ హుసైన్ బిన్ సాదాక్ నుమ్‌సాముద్దౌల గారి మంత్రితో పాటు తను పాల్గొన్న ఆ సభల్ని కూడ అబూ హయ్యాన్ ప్రత్యేకంగా ప్రస్తావించారు.

## విద్వాంసుల సభలు

ఇక ఖలీఫాలు, అమీర్లు, మంత్రుల్ని వదలి సాధారణ విద్వాంసులు, సాహితీపరుల సదనాల విషయానికి వద్దాం. అక్కడా మనకు ఓ వినూత్న విద్యా జీవితం ప్రాప్తిస్తుంది. అలాంటి ఉన్నత ప్రమాణాలుగల ఓ సభా దృశ్యాన్ని తిలకించండి మరి.

ఓసారి ప్రసిద్ధ సాహితీవేత్త ముఖ్ఫ, ఆ కాలపు సుప్రసిద్ధులైన విద్వాంసులు, సాహితీవేత్తలు, రచయితలు ఓ సభలో సమావేశమయ్యారు. ఆ తరుణంలో ఫార్సీ జాతీయుడయిన ఇబ్నె అల్ మఖ్ఫ ఆ సభనుద్దేశించి "ప్రపంచంలో తెలివయిన జాతి ఏది?" అని ప్రశ్నించారు.

అందుకు వారు ఆయన పట్లగల గౌరవ భావంతో "ఫార్సీ యుల్ అఖ్లుల్ ఉమమ్" జాతుల్లో పర్షియనే తెలివైన జాతి అని అన్నారు. అది విని ఇబ్నె అల్ ముఖ్ఫ, "అలా ఏమాత్రం కాజాలదు. వారికి గౌరవ మర్యాదలు లేవు. వారిలో విద్యా కోవిదులు లేరు. వారికి ఆ అర్హత, ఔన్నత్యం లేదు. వారు చదువుతారు. చదువు చెబుతారు అంతే. ఇతరులు కనుగొన్న ఓ విషయాన్ని నేర్చుకొని దానికి విధేయులుగా ఉంటారే తప్ప స్వయంగా వారిలో పరిశీలనా ప్రజ్ఞ, విచక్షణా ప్రతిభ లేదు."

"మరయితే రోమన్లో!" సభికులన్నారు.

ఆయన ఆ అభిప్రాయాన్ని కూడా తిరస్కరిస్తూ, "వారు కేవలం దేహదారుఢ్యం కలిగి ఉంటారు. గణితం, నిర్మాణ శాస్త్రంలో నిపుణులు. అది తప్ప వారికింకేమీ తెలియద"న్నారు.

"అయితే, చైనా వారి గురించి ఏమంటారు?"

"వృత్తి, చేతి పనులే తెలుసు వారికి. ఆలోచన, సునిశిత బుద్ధితో వారికి సంబంధమేమిటి?" అన్నారు ముఖ్ఫ.

"అయితే టర్కీ వారు!"

"వారు వేటాడే జంతువులు. అంటే వారికి యుద్ధం తప్ప మరింకేమీ తెలియద"న్నారాయన.

"మరయితే హిందుస్తానీలు కావచ్చు" అన్నారొకరు. అందుకు ఇబ్నె ముఖ్ఫ "వారు అనుమానాల అయ్యలు, అతి తెలివయిన వారు. యుక్తిపరులు" అన్నారు. ఇక విసిగిపోయిన సభికులు "అయితే ఇంకెవరుంటారండీ!" అని అడిగారు.

అందుకాయన అతి స్పష్టంగా "అరబ్బులు" అన్నారు.

ఆ సమాధానం విన్నాక సభికుల్లో గుస గుసలు బయలుదేరాయి. ఓ పర్షియన్ సంతతికి చెందిన వ్యక్తి, అన్ని జాతులకంటే అరబ్బువారు మిన్న అనడం వారూహించలేని విషయం. అందుకే ఆ విభ్రాంతిని గమనించిన ఇబ్నె ముఖ్ఫ అత్యంత సీరియస్‌గా, "నేనేదో మిమ్మల్ని ముఖస్తుతి చేస్తున్నాననుకుంటున్నారా? దేవుని సాక్షిగా! నేను మీ కోసం చెప్పడం లేదు. నేనెందుకు చెబుతున్నానంటే ఒకవేళ నేను అరబ్ జాతిలో జన్మించేందుకు నోచుకోకపోయినా, ఓ యదార్థాన్ని ప్రకటించి, దాన్ని అంగీకరించే అవకాశాన్ని కోల్పోకూడదని నిశ్చయించుకున్నాను" అన్నారు. ఆ తర్వాత ఆయన అత్యంత విపులంగా అరబ్‌జాతి ఇతర జాతుల కంటే ఎందుకు విశిష్టమయిందో వివరించారు. "అరబ్బులు ఓ దైవగ్రంథం గాని, వాడుకలో ఉండే విద్యలు, కళలు గాని ప్రాచుర్యం కాని ప్రాంతంలో నివసిస్తుండేవారు. అయినా వారు తమ సహజ సిద్ధమయిన యోగ్యతలవల్ల వృక్షశాస్త్రంలో పరిజ్ఞానం ఆర్జించారు. మేకలకు, ఒంటెలకు ఏ ఏ చెట్లు ప్రయోజనకరమైనవో ప్రపంచానికి తెలియజేశారు. వారు రుతువుల మార్పులను బట్టి రబీ, ఖరీఫ్‌లు, ఎండ, చలికాలాల్ని విభజించారు. కాలాల మార్పుల వల్ల జరిగే విభిన్న పరిణామాల్ని వర్షాల ద్వారా గ్రహించి నిర్ణయించారు. నక్షత్రాల కదలికలను బట్టి నేల, సముద్రాల మీద ప్రయాణ దిశలను కనుగొన్నారు. వారు నీతి బాహ్యమయిన చెడు పనులకు దూరంగా ఉంటూ సత్కార్యాలు చేయడానికి నీతిమంతమైన సూత్రాల్ని నిర్దేశించారు. ఫలితంగా సుదూరాల్లో ఉండే ఓ గ్రామవాసి, దుఃఖాందోళనల్లో ఉండే ఓ వ్యక్తి కూడా నైతిక సూత్రాల ఔన్నత్యాన్ని కొనియాడటం మొదలెట్టాడంటే దాని ఒక్కో అంశాన్ని వివరిస్తాడు. అలాగే అతడు చెడు క్రియల వల్ల సంభవించే దుష్పరిణామాల్ని చెప్పసాగితే సోదాహరణంగా చెప్పి మరీ వదులుతాడు. మన ముందున్న వారి వచనాల్లో నైతిక క్రియలు, పుణ్యకార్యాల ప్రబోధాలే కానవస్తాయి. వారిలో ప్రతీ వ్యక్తి కేవలం తనకు గల మేధాశక్తి, సునిశిత పరిశీలనా పటిమతో ఒక తుది నిర్ణయానికి వచ్చాడే తప్ప వారికి అంతకు ముందు ఎలాంటి శిక్షణగాని, విద్యాభ్యాస ప్రేరణ, ప్రోత్సాహం గాని లేనేలేవు. అందుకే అరబ్బులు జన్మతః సమత్వం, సమతూలనా స్వభావం గలవారు, చింతనాపరులు, వ్యవహార అవగాహనలో చురుకయిన వారని నేను అంటున్నాను."

## పుస్తక వ్యాపారులు

ఈ సందర్భంలో కొందరు ముస్లిం పుస్తక వ్యాపారుల గురించి కూడా ప్రస్తావించడం అసమంజసం కాదు. వారిని "వరాఖ్" అని పిలిచేవారు. వారి వద్ద కూడ విద్వాంసుల, సాహితీవేత్తల, విద్యాధికుల సదస్సులు జరుగుతూ ఉండేవి. వారి ద్వారా ప్రతి వ్యక్తికి తన అభిరుచి, కళలకు సంబంధించిన సమాచారం లభిస్తూ ఉండేది.

పుస్తక వ్యాపారుల్లో చాలమంది సాహితీవేత్తలు, విద్యాధికులే ఉండేవారు. వారు ఈ వృత్తిద్వార తమ విద్యా పిపాసను తీర్చుకునేవారు. ఈ వాస్తవాన్ని గ్రహించేందుకు ఓ విషయాన్ని ప్రస్తావిస్తే చాలుననుకుంటాను. "అల్‌ఫెహరిస్త్" గ్రంథకర్త ఇబ్నె నదీమ్, ముఅజ్జముల్ అద్‌భా, మోజ్జముల్ బదాన్ గ్రంథకర్త యాఖూత్ ఇద్దరూ పుస్తక వ్యాపారులే. "ఆగాని" గ్రంథకర్త అబుల్ ఫజల్ అస్ఫహాని, అబూనసర్ అల్ జజాజ్ పుస్తక వ్యాపారుల వద్దకు వచ్చేవారు.

ఈ ఇద్దరూ అక్కడకు వచ్చే కవులు, సాహిత్యకారులలో కవనం, సాహిత్యం విషయాల మీద చర్చలు, విమర్శలు చేస్తుండేవారు. వీరిద్దరు అబుల్ ఫతహ్ బిన్ అల్ హరాస్ దుకాణం వద్ద కలుసుకున్నప్పుడు అక్కడ ఓ కవి అబూ అల్ హసన్ అలీ బిన్ యూసుఫ్ కూడా కూర్చొని ఉన్నారు. అప్పుడు అబుల్ ఫతహ్ బిన్ అల్ హరాస్, ఇబ్రాహీం బిన్ అబ్బాస్ సూలీ కవి రచించిన పద్యభాగాన్ని చదువుతున్నారు. "నా అనురాగాన్ని కనబడని అణువులా భావించారు. అయితే అది కంటిలో నలుసులా ఉన్నా, తుదకు బయటపడి పోయింది" అని దాని భావం.

అబుల్ ఫతహ్ ఆ పద్యం వినిపించగానే అబుల్ హసన్ ఎంతో శ్లాఘించి, మళ్ళీ చదివించుకొని విన్నారు.

అబూనసర్ జజాజ్ అంటారు -

అబుల్ ఫరజ్ నాతో "నీవు అబుల్ హసన్ వద్దకు వెళ్ళి, ఆ పద్యాన్ని శ్లాఘించడంలో హద్దులు దాటావు. వాస్తవానికి అది మంచి పద్యమే. అయినా అది సాంకేతికంగా ఎంతవరకు ప్రమాణబద్ధమైనదో అడిగి రమ్మ"ని అన్నారు. నేను ఆయన వద్దకు వెళ్ళి విషయాన్ని వివరించాను. అందుకాయన ఆ పద్యంలో "కంటిలో

నలుసులా" అన్నది ప్రామాణికమైనదన్నారు. నేను అబుల్ ఫరజ్ అస్ఫహాని వద్దకు వచ్చి ఆయన చెప్పిన జవాబును వినిపించాను, దాన్ని ఒప్పుకోలేదు. "నీవు మళ్ళీ వెళ్ళి, మీరు చెప్పినది తప్పు. అందులో 'కనబడని అణువులా' అన్నది ప్రామాణిక మైనదని చెప్పిరా" అన్నారు.

పుస్తక దుకాణాల ద్వారా కలిగే విద్యా ప్రయోజనం గురించి కొందరు సాహితీవేత్తలు తమ అభిప్రాయాలను వ్యక్తం చేశారు.

"బజారులో కూర్చోవడం మంచిది కాదని భావిస్తారు. కాని బజారులో కూడా కొన్ని మంచి సమావేశాలు జరుగుతాయి."

అయినా బజారు సమావేశాలకు వెళ్ళటాన్ని అయిష్టకరంగా భావించటం జరిగింది – గుర్రాలు, ఆయుధాలు, పుస్తకాలు విక్రయించే బజార్లు తప్ప. ఎందుకంటే అక్కడ మీకు యుద్ధ సామగ్రి, సాహిత్య గనులు లభిస్తాయి." వాస్తవంగా వారు ఓ మంచి అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

ఎందుకంటే మనిషికి యుద్ధకళలు, విద్యా సముపార్జనకు గల మార్గాలు అత్యంత అవసరం. ఇంకా విద్య, సాహిత్య విజ్ఞానం కలిగి గౌరవ ప్రతిష్ఠలతో జీవితం గడపాలని కాంక్షించే మనిషికి అత్యంత అవశ్యం –

**-: సమాప్తం :-**